ఓమ్.

# కావ్యకుసుమావళి

వేంకటపార్వతీశ్వరకవులు.

మొదటికూర్పు 500 ప్రతులు.

1924.

సర్వస్వామ్యసంకలితము.] [వెల రు 1-12

వలయువారు :—
మేనేజరు, ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము,
కాకినాడ.

# ఆ మో ద ము.

సరసాశ్రయంబైన సురసాలమందైనఁ గలకంఠి చిగురుటాకులనె చూచు
మధురాభిమతఫల మందారమందైన వలిగాలి కమ్మతావులనె చూచు
సర్వోత్తమంబైన సంతానమందైన సెలఁదేఁటి విరిదేనియలనె చూచుఁ
గామితార్థప్రద కల్పకంబందైనఁ జిలుక తీయనిఫలంబులనె చూచుఁ
గాని సర్వపదార్థసంకలితకావ్య
పారిజాతంబుఁ గని పల్లవప్రసూన
పరిమళమరంద పరిపక్వఫలరసముల
నన్నిటి రసజ్ఞుఁ డొక్కఁడే యనుభవించు."

స్వభావసిద్ధ మగుప్రకృతిసౌందర్యమును గాంచువాఁడు కవి. స్వభావానురూప మగుసౌందర్యమును సృష్టించువాఁడు కవి. సహజసౌందర్యమున స్వాదుమాధుర్యము ననుభవించువాఁడు కవి. విశ్వసౌందర్యవిశిష్టమూర్తియే కవి.

బ్రహ్మసృష్టి యంతయును సౌందర్యమయ మైనదియే. కాని కవిబ్రహ్మసృష్టి సౌందర్యమయ మైనదియు మనోహర మైనదియు నగుచున్నది. బ్రహ్మ కేవలము ప్రకృతిసౌందర్య ప్రదర్శకుఁడు మాత్రమే. కవిబ్రహ్మ ప్రదర్శకుఁడును బ్రబోధకుఁడును గూడ నై యున్నాఁడు.

సౌందర్యము హృదయాకర్షక మైనది. కవిబ్రహ్మ యిట్టి చరమోత్కృష్టసౌందర్యమును సృష్టించి దానిమూలమున మానవహృదయకమలములను వికసింపఁజేసి పవిత్రసౌరభముల నెల్లెడల వెల్లివిరియఁ జేయుచున్నాఁడు. మఱియుఁ దనకావించిన పవిత్రసృష్టిసౌందర్యమునం దనురాగమును గల్పించి మానవహృదయములనుండి యపవిత్రభావములను దొలఁగించుచు నాతఁడు నిజధర్మమును నెఱవేర్చుకొనుచున్నాఁడు.

కేవలము నీతిని బోధించుటయే కవికృత్యము గాదు. కాని, నీతిబోధకునకును, గవికిని గలపరమోద్దేశముమాత్రమొక్కటియే. కవి యనినఁ, బ్రబలశాసకుఁడు గానిప్రభువు; తీవ్రోపదేశకుఁడు గానిదేశికుఁడు. హితచింతకుఁడగుమిత్రుఁడును, బ్రియకల్పకుఁడగుబంధుఁడును గవియే. మిత్రత్వశత్రుత్వములును, రాగద్వేషములును లేని నిత్యనిర్మలజీవనుఁడు కవి.

కవి తనకవితామృతరససేచనమున నిర్జీవపదార్థములకు జీవకళలను, జీవలోకమునకు దివ్యతేజమును గల్పించుచు జగత్కల్యాణముంగూర్చుపట్టున నీతివేత్తకంటెను, ధర్మబోధకునికంటెను, మతకర్తకంటెను, దండశాసకునికంటెను, మండలేశ్వరునికంటెను మానవసమాజమునఁ బ్రధానుఁ డగుచున్నాఁడు.

కవిత్వము దైవదత్తమగుదివ్యశక్తి. కావుననే యది నశ్వరంబు లగుపదార్థములకు శాశ్వతత్వమును బ్రసాదింపఁ గలుగుచున్నది. నిత్యమును, నిశ్చలము నగుకవితాశక్తి యెదుట

క్షణక్షణపరిణామశీలమును, అంచలమును నగుకాలశక్తి యెంత మాత్రమును దనపరాక్రమమును జూపఁజాలదు. సర్వకాలముల యందును, సకలదేశములయందును, సమస్తపాత్రములయం దును గవితాశక్తి తనసంపూర్ణాధికారమును బ్రవర్తింపఁ జేయుచు సకలంబులకును నిత్యనూత్నవికాసముం గల్పించు చుండును.

కవితాగానమునం దమృతమాధుర్యము కలదు. సర్వ జీవహృదయసంతాపనివారణకారణం బగునమ్మధురగానమున సమ్మోహనాకర్షణశక్తులు రెండును మూర్తీభవించియుండును. ఆదివ్యసంగీతశ్రవణమాత్రముననే మానవహృదయకుసుమము లు వికసించి ప్రశాంతోదారభావపరిమళములచే విలసిల్లు చుండును. ఆగానామృతరసతరంగములు తమయందుఁ బ్రతి బింబించుచున్నయమృతమయుండగుసర్వేశ్వరునియానందకళల ను స్ఫురింపఁజేయుచు దుఃఖమయంబులగుమానవజీవితంబులకుఁ గూడ సుఖానుభవముం గూర్చుచుండును. జగదానందదాయకం బగునమ్మోహనసంగీతమువలన మానవహృదయంబులును, మానవశరీరంబులునుగూడ వినిర్మలవికాససౌందర్యమయంబు లగుచుండును.

ఆగానామృతమాధుర్యము నిత్యనూతనమైనది. ఆగానా మృతతరంగనినాదము నిత్యానందదాయకమైనది. ఆగానామృత విమలతేజము నిత్యజగత్ప్రకాశకమైనది. మహర్షియగువాల్మీకి

శ్రీరామనామముతోడను, భగవానుఁడగు బాదరాయణుఁడు శ్రీకృష్ణనామముతోడను, కవిరాజశిఖామణి యగు నన్నెచోడమహారాజు గురుపరమేశ్వరనామంబుతోడను, కవిబ్రహ్మ యగు తిక్కనసోమయాజియు, నవీనగుణసనాథుండగు నాచనసోమనాథుండును హరిహరాద్వైతనామంబుతోడను నాకోమలమధురమోహన గానమునే, ఆలాపించి—ఆలాపించి—యనవరతసాంద్రానందామృతతరంగమాలికలలో మానవహృదయకమలముల నోలలాడించియున్నారు.—ఓలలాడించుచున్నారు.

ఆమధురామృతగానమే కవితాగానపరవశులగు చి॥ మా వేంకటపార్వతీశ్వరుల కాదర్శమైన దని నేను గర్వించుచున్నాను. ఈయిరువురును నా కాత్మీయులు; బాల్యమునుండియు నాకళవుల నెఱింగినవారు; నాచనవున మెలంగినవారు. ఇక్కవిద్వయమునందు చి॥ బాలాంత్రపు వేంకటరావునకు "మల్లాము" గ్రామమును, చి॥ ఓలేటి పార్వతీశమునకు "కొమరగిరి" గ్రామమును జన్మస్థానములై వెలయుచున్నవి. ఈ రెండుగ్రామములును గోదావరీమండలాంతర్గతమగు మా పీఠికాపురసంస్థానములోనివి. వీరిరువురును వరుసగా విక్రమ చిత్రభానువత్సరములయందు జనియించిరి.

షడ్జపంచమములవలె భిన్నైక్యసంబంధమునఁ గలసి, శబ్దార్థములవలె నవినాభావసంబంధమున వెలయుచున్న యిక్కవిద్వయభావసమ్మేళనమహాలాధారమునుండి కవితామృతరస

వాహిని వెలువడి నానాముఖములఁ బ్రవహించుచున్నది. చిర కాలమునుండి యాంధ్రలోక మాదరముతో నందులనుధారన ము నాస్వాదించుచునేయున్నది. ఈసమ్మేళనమే వంగభాషా కవితాసౌందర్యము నాంధ్రలోకమునకుఁ బరిచితముంగావించి నది. ఈసమ్మేళనమే యాంధ్రకవితాకల్పకోద్యానవనవాటిక యందు 'ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము' అను సరస్వతీ విలాసమందిరమును నెలకొలిపి వివిధవిజ్ఞానకళలను వెలయించు టకు హేతుభూతమైనది. ఈసమ్మేళనమే యాంధ్రభాషామతల్లికి వినూత్నంబును, మనోజ్ఞంబు నగు 'కావ్యకుసుమావళి' అను నీ "అష్టోత్తరశతపారిజాతప్రసూనమాలిక" ను సమర్పించినది.

కావ్యకుసుమావళియందు దరవికసితంబులును, బరిపూర్ణతావిలసితంబులును, మృదులతాకలితంబులును, బరాగలలితంబులును, సౌరభోచ్ఛ్వసితంబులును, మరందపరిపూరితంబులును,బహువర్ణవిభాసితంబులునగువివిధకుసుమములు విరాజిల్లుచున్నవి. వానిసౌందర్యసౌకుమార్యసౌరభమాధుర్యములు పరసజనహృదయాహ్లాదకరవిమలనుమమాధుర్యములై యొనలారుచున్నవి. ఆంధ్రభాషాసరస్వతి నధిక భక్తిపూర్వకముగ నర్చించుచున్న యిక్కవిద్వితయమనోజ్ఞభావప్రసూనముల క్రమక్రమ పరిణామ మిందు విస్పష్టముగఁ గానవచ్చుచున్నది.

కవితాగానపారవశ్యమున నానందవిహారము గావించుచున్న కవిభావనందనోద్యాన మనందగు నికావ్యమునఁ బ్రి



ప్రథమమున "అక్షర" కుసుమము గానంబడుచున్నది. ఇందు పదసంపత్తి లలితంబయ్యును విన్నాణంపుజిగిబిగి యింకను గుదురుకొనలేదు :—

" ఒక్కటై యొక్కరూపు, నొండొంటిఁ గలసి
వేఱుపోలిక నందుచు వివిధగతుల
వలన వివిధాకృతులఁ దాల్చి వఱలుచుండు
నట్టి యక్షరతత్త్వంబు నరయవశమె."

ప్ర. భా. 4 పుట.

అర్థగౌరవము పరిపూర్ణంబయ్యును విశదంపుమిసిమియింకను నెలకొనలేదు :—

" ఆత్మనిర్వృతికో, పరమాత్మ దేవు
నరయుటకొ, పరమాత్మ తానగుటకొ యకొ
సంతరింపంగఁ దగినవిజ్ఞానమునకు
సాధనం బైన దల్ల యక్షరమ కాదె,"

ప్ర. భా. 6 పుట.

భావసౌందర్యము మనోజ్ఞంబయ్యును బరువంపునెఱతన మింకను విరియఁ బాఱలేదు—

" ప్రకృతిజీవులలోన నీశ్వరునివెనుక
నిలువఁబడియున్న మానవకులము నెల్ల
నెలమిఁ బైమెట్టు నెక్కింపఁగలుగుటకును
సాధనం బైన దక్షరజ్ఞానమెకద !"

ప్ర. భా. 6 పుట.

ఈయక్షరగీత మిక్కవుంకవితాకల్పవల్లికి భవిష్యదమృ

తఫలోదయసూచకమగు దరవికసితకుసుమము. ఐనను, దిగంత వ్యాప్తములై జగదామోదదాయకములై శాంతములగునభి నవకవితావిలాససంపూర్ణసౌరభములను వెలయింపఁజాలువరా గలేశములును, నిత్యనూతనములై నిరంతరాస్వాదమధురము లై నిర్మలములగు శాశ్వతకావ్యానందరసమకరందధారలఁజాల్వా ఱఁజేయు రసశీకరంబులును నీయరవిరికుసుమమునఁ గానవచ్చు చునే యున్నవి.

" ఎంచఁగారానిశబ్దప్రపంచమందు
వేలువేలురూపంబుల వెలయునీదు
విమలపదముల నాత్మ భావించుచుందు
మనిశమును మాకుఁ దోడ్పడు మక్షరంబ"

ప్ర. భా. 3 పుట.

అను 1910 సంవత్సరమునాఁటి యీయరవిరికుసుమము 1921 సంవత్సరమునాఁటికి——

" అమృతసురభిళమృదులశాంతములతోడ
అమృతపరిపక్వఫలగుళుచ్ఛములతోడ
అమృతరసమాధురీమూర్తి వైననిన్నుఁ
గంటిమోతల్లి! సుకవితాకల్పవల్లి!"

ద్వి. భా. 174 పుట.

అను లలితమృదులవికచసురభిళమధురప్రసూనముగాఁ బరిణ మించినది.

ఇం దీయక్షరగీతముమొదలు గురుభక్తివటికనుగల పదియాఱుకుసుమములు నించుమించుగ దరవికసితకుసుమము

లే యని చెప్పవచ్చును.

పదునేడవకుసుమమగు "చందమామ" పున్నమచంద మామవలెనే గడిదేఱిన పరిపూర్ణవిలసితకుసుమము. ఈ "చందమామ"—

" చెట్లకొమ్మలసందులచెంతఁ జేరి
యారినచిగుళ్ళలో మంచునీరు వోసి
యెన్నియోముత్తియములఁ గాపించుచుండె" ను.
ప్ర. భా. 85 పుట.

మఱియు—

" సరిగ లేఁజిగురాకులసందులందు
నెన్నియోవెండిపూలఁ జేయించుచుండఁ
గనుమఱపి చూడ మింటికిఁ గంటి కొకట,
వెండితీఁగ లెన్నొన్ని గల్పించుచుండె"ను.
ప్ర. భా. 85 పుట.

ఇంతటినుండి కవితాచంద్రిక కవులలేఖినినుండి చెలువంపువెన్నెల వెలయింపఁదొడంగినది. ఈచిన్నెలవన్నెలచెలువంపులేఖిని విమలసుధారసముతో వెలఁదివెన్నెలలను జిలికించినది; అవ్యక్తమధురస్వరముతోఁ గోకిలగానము నాలాపింపఁ జేసినది; చిత్రగతులచేఁ జిన్నిబిడ్డల

" ఆరుబైటవెన్నెలకుప్పలు... ...
" చిట్టిమిరియంబులును జిప్పచిప్పగోళ్లు
చెమ్మచెక్కలు— ... ... ...'
ప్ర. భా. 79 పుట.

మొదలగు లీలాఖేలనములను బ్రదర్శించినది. మఱియును

ముద్దులొలుకు జిలిబిలిపలుకులతో—

"* * * మాతల్లి! జాబిల్లిఁజూచినావె * * *
అల్లరులఁజేయ కాటల నాడుచుండు ;
మంకుపిల్లలఁ గూడఁడు మంచివాఁడు
బుద్ధిమంతుఁడు కొండపైఁ బోవుచుండు ;
చల్లఁదనమిచ్చు కన్నులఁ జాలనిచ్చు
నేఁడునాతల్లి! నినుఁజూచినాఁడితండు
బువ్వదినకున్న జాబిల్లినవ్వునమ్మ!"

ప్ర. భా. 80 పుట.

అను ప్రేమమయియగుతల్లి బిడ్డను బుజ్జగించుమాటలను,

"అమ్మ! యీచిన్నిజాబిల్లి కమ్మయెవరు ?
ఈతనికి బువ్వపెట్టువా రెవ్వరమ్మ
* * * * * * *
పోరుపెట్టఁడె కొండపైఁ బోవలేక
[illegible]వేయడ క్రిందికిఁబడునో యేమొ ?"

ప్ర. భా. 81 పుట.

అను ముద్దులబిడ్డ ముగ్ధాలాపములను వినిపించినది. కాని—

"రాతిరైనను నింటికిరాక బయలఁ
దల్లవాఱినదాఁకను దిరుగునేమొ ?"

ప్ర. భా. 82 పుట.

అను నీచిన్నిబిడ్డపలుకులో మాతృప్రేము కవిగాననగుచున్నాఁడు.

ప్రకృతిరామణీయకసందర్శనమునఁ గవిహృదయ మిప్ప టికి కింతవఱకు వికసించినది. "చందమామ" మొదలు "* * తేపు" వఱకునుగల నాలుగుకుసుమములు నించు

మించుగా నొక్కరకముతోనివే.

ఇరువదియొకటవకుసుమము ప్రణయకోపము. ఇది పరిపూర్ణవికాసమృదులతాకలితము. ఇందుపోతనామాత్యునిశబ్దార్థసమ్మేళనసౌందర్యమును, ముక్కుతిమ్మనార్యునిరసభావసమాకలనప్రాచుర్యమును బొడసూపుచున్నది. రాధాకృష్ణుల యాచిన్నసంఘటనమున వారిస్వరూపస్వభావములతోఁ బ్రణయకోపతత్త్వము మనోహారముగా వెల్లడింపఁబడినది.

“ ఎదురుకొనుకొలందిని గోప మెచ్చుచుండు
నెడసిచనుకొలందిని బ్రేమ హెచ్చుచుండు ”

ప్ర. భా. 101 పుట.

అని ప్రణయకోపతత్త్వమును గవులొక్కమాటలో నిర్వచించియున్నారు. బాహ్యప్రకృతి సహజసౌందర్యమును, భావనాప్రకృతి సంసృష్టసౌందర్యము నిందు హృదయంగమముగఁ బ్రదర్శింపఁబడినవి.

ఇందు గవితాకన్య, యలరుమొగంబునఁ జిఱునవ్వులొలుకుచుండియును వాలికచూపుల నెలయించుచున్నట్లును, మనసువిచ్చి ప్రేమమధురభావమును వెలువరించుచుండియును బలుకరింపకయున్నట్లును, మనోహరోచితవసనాలంకారవిభూషితయై హొయలుమెఱయ నెట్టయెదుట సాక్షాత్కరించియును కవులకునించుక యెడముగ నిలిచియున్నట్లును దోఁచుచున్నది.

దీనితరువాత “ మక్షికము, భాగ్యము, ఆత్మసఖుఁడు ”

అను మూఁడుకుసుమములు గలవు. ఇరు[illegible]దవకుసుమము రాజభక్తి. ఇది మన కేలికయగు జార్జిసార్వభౌముని భారతరాజ్యపట్టాభిషేకశుభసమయమునం దర్పింపఁబడిన ప్రభుభక్తిసూచకమగు కుసుమరాజము. ఇందుఁ బ్రభుప్రకృతుల యన్యోన్యానుబంధావశ్యకతంగూర్చిన యభివర్ణనము వెలయుచున్నది.

26, 27 కుసుమములు కవికావ్యగీతములు. ఇప్పటికిఁ గవులకు సుస్థిరాదర్శ మేర్పడినది. కవితాసరస్వతిసుప్రసన్నవదనముతోఁ, బ్రేమపూరితహృదయముతో, నమృతమధురవచనములతో "కవీంద్రా!" అని పరమానుగ్రహమునఁ బలుకరింపఁ బ్రారంభించినది; ప్రకృతిరామణీయకమును బ్రదర్శించుచుఁ బ్రకృతిరహస్యములను వెల్లడించుచుఁ, బరతత్త్వజ్ఞానము నుపదేశించి—.

"విమలనవనీతమృదులశబ్దములఁగూర్చి
రమ్యభావప్రబోధకార్థములఁగూర్చి
* * * * *
మహితమై మానితంబైనమనసుతోడ
దివ్యమై ధీయుతంబైనదృష్టితోడ
* * * * *
భావముగరంచు దృశ్యకావ్యములనైనఁ
జవులఁబుట్టించు శ్రవ్యకోశములనైన
మహితగతి వ్రాయుమా! వ్రాయుమా! కవీంద్ర!"

ప్ర. భా. 158 పుట.

అని హెచ్చరించుచుఁ గవితాతత్త్వమును బ్రబోధించినది.

మఱియు—

" ప్రకృతి నీతోడునీడయై పలుకుచుండె
స్వస్థచిత్తతగల దంతెచాలునీకుఁ
గావ్యనిర్మాణమునఁ బరికరములరసి
చూచుకొననేల ? కవితనీసొమ్ముకాదె ?''

ప్ర. భా. 159 పుట.

అని యనుగ్రహించి ప్రకృతిని వశవర్తినింగావించి యుత్సాహముం గల్పించి

" జగతి నీమాటమీఁదుగా జరగుచుండు
జగతి నీచేత నన్వర్థమగుచునుండు
జగతి నీచూపుత్రోవనే చనుచునుండు
జగతి ధన్యుండనఁగ నీవె సత్కవీంద్ర !''

ప్ర. భా. 164 పుట.

అని యాశీర్వదించినది.

ప్రేమస్వరూపిణియు దివ్యతేజోమయియు నగునాదేవీమూర్తి సాక్షాత్కారసుప్రబోధశుభాశీర్వాదమహిమవలననే తత్కవిద్వయవిజ్ఞానయనచతుష్కము వికసించి

" అరసిచూడ నిరర్థకమగునయేని
నక్షరసమష్టియే పదమనఁగరాదు ;
లోకహితలక్షణయుతంబు గాకయున్నఁ
బద్యగద్యాత్మకంబె కావ్యంబుగాదు ;
ఉచితగతి రసభావంబులొప్పకున్నఁ
గవులు వ్రాసినదంతయుఁ గవితగాదు ''

ప్ర. భా. 170 పుట.

అను సత్యమును గ్రహింపఁజాలినది. ఇంతటినుండి కవితాకుసుమములకు భావసౌరభ మభ్యుదయింపఁదొరఁకొనినది.

28, 29, 30 కుసుమములలోఁ బ్రేమతత్త్వనిర్వేదకాతుకభావములు గుబాళించినవి.

31 కుసుమము రాధ. ఈచిన్నికుసుమమునందుఁ బ్రేమతన్మయ మగుకవిహృదయములోనియీశ్వరహృదయపరిశీలనలాలసత యనియెడిసౌరభతరంగము తుఱంగలించినది.

"అందమునకును బ్రేమింతువా మహాత్మ!'' అని—
ప్ర. భా. 180 పుట.

32 కుసుమము ప్రకృతిప్రబంధకర్త. ఇది భగవల్లీలలను గానముచేయునత్యుత్తమగీతములజాతిలోనిది. ఇందుసరస్వతీసదుపదేశమహిమంబున సంపూర్ణవికాసముంగాంచిన కవిహృదయము బాహ్యప్రకృతి నతిక్రమించి, భావనాప్రకృతి నుత్తరించి, దివ్యపథము నధిగమించి దివ్యతేజస్సందర్శనేచ్ఛాపారవశ్యమున :—

"దేవదేవ! మహాత్మ! త్వదీయదివ్య
భావబోధకవిశ్వప్రబంధమందు
నెచట శ్రీరామ చుట్టితి వెచటఁ జిత్త
గింపవలె నని వ్రాసి ముగించినావు?''
ప్ర. భా. 180 పుట.

అని యుచ్చైస్స్వనంబున దివ్యగానముం గావించినది. ఈమధురకవిగానమున విశ్వ మంతయును "ఎప్పటికప్పుడే యభినవ

మును, నతిమనోహరమును, సురసాశ్రయమును, సత్యమును, సార్థకమును, సమధికమును, సర్వజనసమ్మతమును, సలలితము" నగుమహాకావ్య మైపోయినది. అవ్విశ్వమునకుఁ గర్తయగు "దేవతాసార్వభౌముఁడు" సమానాధికరహితుఁ డగు "కవిరాజచక్రివర్తి" యైపోయినాఁడు.

కవిచక్రవర్తిమహిమ కన్నులఁ బడినంతనే మనకవిద్వయమునుండి :—

"మేము నీకృతిఁ జూచుచున్నాము గాని
మేముఁ దన్మయలీల నున్నాము గాని
తెలిసిన ట్లుండి యేమియుఁ దెలియకుండెఁ
దెలియ కుండియు నంతయుఁ దెలిసినట్లు
నటనమును జేయుచుంటి మనాథనాథ"

ప్ర. భా. 184 పుట.

అనతమయల్పజ్ఞతాదైన్యసూచక మగుప్రార్థనాగానము తారస్వరమున మిన్నుముట్టినది. ఆయావేశములోఁ గవులయహంభావావగుంఠనము తొలఁగిపోయినది. సత్యతత్త్వము చక్షుర్గోచరమైనది. అప్పుడు :—

"నేను దరియించుతెరు వనునియతి గాని
యాత్మశక్తిని బ్రకటించునాస గాని
లోకములు మెచ్చునవెడిలోలుపత గాని
నాకు యశ మబ్బు ననిచింతనమునఁ గాని
యర్థసంగ్రహణాపేక్ష నంది గాని"

ప్ర. భా. 184 పుట.

మహాకావ్యమును రచియిం"పని "సచ్చిదానందమూర్తి" యగు "కవిరాజచంద్రుఁడు" కవుల కాదర్శకుఁ డైనాఁడు. ఆ యాదర్శమే పరమోద్దేశముగాఁ గవు లప్పటినుండియిప్పటివ ఱకు నామనోహరగానమును సరసగతుల నాలాపించుచు నే యున్నారు.

ఏమహాకావ్యమును బఠియించునప్డు
డామహాకావ్యకర్తపై ననుపమాన
భక్తిగౌరవ ప్రేమముల్ ప్రబలుచుండు
నదిగదా యుత్తమోత్తమ మైననుకృతి!

ప్ర. భా. 188 పుట.

ఈవిధముగా నీముప్పదిరెండవకుసుమము సంపూర్ణపద దళవికాసంబును, సరసార్థసౌందర్యమార్దవంబును, రుచిరాలంకారపరాగలాలిత్యంబును, మనోజ్ఞభావసౌరభోచ్ఛ్వాసనంబును గాంచి విరాజిల్లుచున్నది.

దీనితరువాతఁ దొమ్మిదికుసుమములు సరసకవితాగాన మును నెఱపుచున్నవి. 42 కుసుమము గోగీతము. ఇది యనంతామాత్యునిభోజరాజీయములోనికథ ననుసరించి బాలురకును వేద్యమగునట్టిసులభశైలిని వ్రాయఁబడినది. 43 వకుసుమ మగులక్ష్మీవిలాసము శుక్రవారవ్రతకథ ననుసరించి వ్రాయఁబడిన హృద్య మగుచిన్నరూపకము. ఇవి రెండు నానందవాచకములఁ గానంబడుచున్నవి.

ద్వితీయసంపుటమున నఱువదిమైదుకుసుమములుగలవు.

ఇవి వికాసాదివిమలగుణవిశిష్టంబులును, బరిమళమరందరస పరిపుష్టంబులు నై యున్నవి.

ఇందు గవులకవిత మనోహరపరిపాకమునకు వచ్చి ప్రోఢతనము గానుపించుచున్నది. కవులకు భాషాజ్ఞానము క్రమాభివృద్ధిం గాంచినది. ఉచితములగుమధురపదములు లేఖన్యగ్రమున విచ్చలవిడి సరసగతుల నటనముచేయుచున్నవి. అర్థంపు సొంపులమృతమధురంబులై నవరసంబులఁ జిలుకరించుచున్నవి. భావము లుదారములై హృదయముల నాకర్షించుచున్నవి. శైలి ధారాళమై గంగావాహినింబోలి సహస్రముఖములఁ బ్రవహించుచున్నది. ఈవిధముగా "అమృతసురభిళమృదులతాంతములతోడ, అమృతమధుపక్వఫలగుళుచ్ఛములతోడ, అమృతరసమాధురీమూర్తి" యైనకవితాకల్పవల్లి యిక్కవులకుఁ బెరటికల్పకమైనది.

---

## II

ఇందుల యొక్కొక్కకుసుమమును బ్రత్యేకముగ విమర్శింపఁదగియున్నను గావ్యముకంటె విమర్శనమే విపులమగునను వెఱపున నిఁక నిక్కావ్యస్వరూపస్వభావాదులను గూర్చి సమష్టిసమాలోచనముం గావించెదను.

ఇందు శైలి, రీతి, నిర్మాణము మొదలగువానిలోఁ

బూర్వకవుల మేలిపోకడలకళలు గానంబడుచున్నను గావ్యపద్ధతిమాత్రము మనయాంధ్రభాషకు నూతనమై వెలయుచున్నది. పురాణేతిహాసములయందును, నిబంధనములననుసరించిన ప్రబంధములయందును బురనగాదివర్ణనములు గానంబడుచున్నవి గాని యీపద్ధతిననుసరించినవి మనభాషయందు మృగ్యములై యున్నవి.

దేశకాలపాత్రములననుసరించి సాంఘికనైతికరాజకీయాది వివిధవిషయములయం దభిరుచులు మాఱుచున్నట్లే కవితయందును మార్పులు గానఁబడుచుండును. వేంకటపార్వతీశ్వరకవుల కాంగ్లేయభాషాపరిచయము లేకపోయినను బాశ్చాత్యవిజ్ఞానవాతావరణముగల ప్రకృతి నాశ్రయించి వీరిసహజప్రతిభ పాశ్చాత్యపద్ధతిని బ్రియకళయందుఁ గూర్చి యీనూత్నకావ్యమును సృష్టించినది.ఆంధ్రభాషయం దీదృశకావ్యసృష్టి కిదియే ప్రథమంబైనను మనోహరాకృతిం దాల్చియున్నది.

వీరికవితాకన్య తఱచుగఁ బ్రకృతిలోని మనోహరపదార్థములనే సందర్శించుచుండును. ఒకప్పుడు పసిఁడి 'పంజర' ములకడ నొయ్యారముగ నిలిచి చిలుకలను బలుకరించుచుండును. 'వసంతకోకి'లలయవ్యక్తమధురగానములతో గానముసేయుచుండును. పున్నమ "చందమామ" వెన్నెలలకు వన్నెలు దిద్దుచుండును. ప్రభాతవాతపోతముల నుయ్యేల లూచుచుండును. "ఆనందమందిర"ముల మెలంగుచు విందులుగూర్చుచుం

డును. "చుక్క"ల చక్కందనమును లెక్కించుచుండును. "మల్లెపూవు"ల జడనల్లుకొనుచు, "జలజమాలిక"ల గళమున సవరించుకొనుచు, "వసంత"డోలికల నుయ్యెల లూగుచుఁ "గలువకన్నె"లతోఁ గలసిమెలసి "విహంగవిమానము"ల విహరించుచు వివిధగతుల "లక్ష్మీవిలాసము"ను నెఱపుచుండును.

కాని, ప్రకృతిసౌందర్యమును దిలకించుపట్టున వీరి కవితాకన్య యప్పుడప్పుడు ముగ్ధయై పైమెఱుంగుల కాసపడి పదములఁ బదిలపఱచుకొని రంగులువెట్టుకొనుచు మెఱుఁగుసొమ్ముల మేనునిండించుకొనుచు, నడకల కొయ్యారము నలవరించుకొనుచు దిద్దుకొనుచుండును. చిన్నభావమునుగూడ నొక్కొకయెడ సహజముగ వెల్లడింపక ముద్దులొలుకుపలుకులతో మురిపంపుగతులతో వివిధరీతుల విస్తరించి యాలాపించి గానముచేయుట యిక్కవితాకన్య కలవాటు. మోహనప్రకృతిసౌందర్యమునకు ముగ్ధయై, ప్రకృతితత్త్వాన్వేషణమున నిమగ్నయై, సర్వేశ్వరసాక్షాత్కారలీలానుభవలాలసయగుచున్న యిక్కవితాకన్య మానవప్రకృతినిగూర్చి గానముసేయుట మఱచిపోయినట్లగపడుచున్నది. దానంజేసి రసానుభవప్రకటనమే కాని రసోదయకల్పన మంతగా వికసింపలేదు. ఇక్కవితయందు భావము సహజమైనను, సత్యమైనను, పవిత్రమైనను, ఆవేశపూరితమైనను, మృదుమధురపదార్థసంఘటితమైనను నచ్చటచ్చటఁ గొంతవఱకు గభీరయవనికాభ్యంతరమున మఱుఁగుపడియున్నది.

వీరికవితలోని ఛందోవ్యాకరణాదివిషయములు పూర్వాంధ్ర కవుల నియమములకు భిన్నములై యున్నను నత్తరాంధ్రకవుల ప్రయోగములకు సరిపడుచున్నవి.

ఇందులకవిత్వము చాలవఱకు ధ్వని ప్రధానముగా నున్నది. ఇక్కావ్యకర్తలు ప్రణయసౌందర్యలీలామయియగు ప్రకృతిని ప్రేమించుచు, ధ్యానించుచు, నారాధించుచుండగా నిత్యపరిచితమైన యాసహజప్రకృతి భావనాప్రకృతిలో విలీనయగుచున్నది. ఆబాహ్యాభావనాప్రకృతులసమ్మేళనమున :— "వెలఁదివెన్నెలతేటలో వెన్నపూస" వెలువడుచున్నది. "బాలభానునికరములఁ బసిఁడిచేరు" పట్టువడుచున్నది. "కొమ్మనెమ్మనిచాయలోఁ గుందనమ్ము" కొమరునిగులుచున్నది. "కలవిహంగమరుతముల గానలహరి" కలకలలాడుచున్నది. ప్రకృతి ప్రతిబింబమనందగు భావనాప్రకృతిలోని వీరి "కవితాకల్పవల్లి" యందును "పుట్టుమున్నిటఁగడవంగఁబెట్టు పట్టుగొమ్మలును "ధర్మార్థకామమోక్షములునాల్గునకృ రాకృతిం"గన్న "మూకులు"ను "అమృతసురభిళమృదులతాంతము"లును "జన్మజన్మాంతరోగ్రివాసనలుడింపు" "దివ్యసుమపరీమళ" ములును, "అమృతమధుపక్వఫలగుళుచ్ఛము" లును, "శృంగారరసనవకం బనంతరసమయతఁ గాంచిన" ఫలరసమును గానవచ్చుచు భావసృష్టిని బ్రస్ఫుటము సేయుచున్నవి.

అగోచరమగుభావమునకు మనోహరాకృతిం గూర్చున

ట్టున నిక్కవిత "చివురాకులందు సంజీవనీఫలములనుంచి యంద దఱకు నందించు" చున్నది. "పూవుగుత్తులలోనబోధామృత రసంబునుంచి యందఱకు వడ్డించు" చున్నది.

మఱియు యథారూపముగఁ బ్రకృతిసౌందర్యమును, బ్రకృతివిశిష్టమగు భావసౌందర్యమును, భావసంకల్పితమగు ప్రకృతిసౌందర్యమును, భావనాప్రకృతిలోని భావసౌందర్యము ను జిత్రించినభాగము లిక్కావ్యమునఁ బెక్కుచోట్లఁ గానంబ డుచున్నవి. ఇదియునుంగాక నిత్యసత్యతత్త్వాన్వేషణపరవశ యగు నిక్కవిత ద్వంద్వభావవిశిష్టమగు ప్రకృతియందుఁ బ్ర ణయలీలలను సదానందతేజోవిశిష్టంబగు దివ్యప్రకృతియందు భగవల్లీలలను సర్వత్ర సందర్శించుచున్నట్లగపడుచున్నది.

వేంకటపార్వతీశ్వరకవుల కవితావల్లికలకు మూలకార ణంబులగునమృతబీజములు కవిరాజశిఖామణియగునన్నెచోడ నియుఁ, గవిబ్రహ్మయగుతిక్కనసోమయాజియు, సర్వజ్ఞుండగు నాచనసోమనాథునియు నక్షరకోశములందుఁగానంబడుచున్నవి.

"సీ. ఎలమి నీమైదీగ నెలకొన్న సుకుమార
వాసంతలక్ష్మి పొందోసరింప
మరఁగి నీజిహ్వానుమంజరివిహరించు
భాషాశుకంబులఁ బాఱఁజోఁపి—"

సీ. "జ్ఞానదీపంబు హృత్సదనంబులోఁ దాన
దీపించఁగా నేఁచఁదివురువారు

వలచేత వసుమతీవలయంబు నవరత్న
వలయంబుగా నిడ వలచువారు
భారతిఁ దమమోముఁబసిఁడిమాడువులోన
నిలువేల్పుగా నిల్పఁదలఁచువారు
నణిమాదిగుణమణిహారమ్ము లురమున
హారంబుగా నిడఁగోరువారు
వెలయ మత్కృతి చదువుఁడు, వినుఁడు,—"

నన్నెచోడదేవుఁడు.

"ఒకటిఁగొని రెంటి నిశ్చలయుక్తిఁజేర్చి
మూఁటి నాల్గింటఁ గడువశ్యములుగఁజేసి
యేనిటినిగెల్చి యాఱింటి నెఱిఁగి యేడు
విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు—"

* * * * *

"వరుమాడ్కి ముద్దియవదనంబుపైఁ బాతి
తివుటమై నునుఁగాంతి తీవుఁ గ్రోలు

* * * * *"

"కరుణారసము పొంగి తొరఁగెడుచాడ్పున
శశిరేఖ నమృతంబు జాలువాఱు

* * * * *"

"గుతిమైన చెలువున నెఱసినలోకర
తుణ మనంగ గళంబుచాయ దోఁప

* * * * *"

"* * * తోడి, పూసి, కట్టి, పన్ని—"

తిక్కనసోమయాజి.

సీ. "తొలుకారు మెఱుఁగులతోఁటలో నాడెడు
రాయంచకొదమతో రాయఁజాలి
ఇరులబండారంపుటింటికిఁ బెట్టిన
బొండుమల్లెలకోటఁ బోర గెలిచి
బలుమంచుఁ గంబాల బలసి రాఁజుట్టిన
క్రొత్తమంజిడిబాగుఁ గొఱఁతచేసి
పాలపెన్నురువుగుబ్బలిమీఁద నెలకొన్న
నిండువెన్నెలమ్రుగ్గునిగ్గుఁ జెఱిచి
జడలఁ గ్రొన్నెల, మెడఁ బాఁపసరము, దొడలఁ
బొడలతో, శ్వేన వెలిమిడిపూఁత మించఁ
బొడమి వ్రేటూనియుండదటఁ బొడవుసూపెఁ
బొడువులందెల్లఁ బొడువైనబోటువేల్పు."
నాచనసోమనాథుఁడు.

ఇక్కవులు దివ్యప్రణయలీలావిలసితమగు "ఏకాంతసేవ" అను నొక యపూర్వపద్యకావ్యమును, "శ్రీరామరాజనీతి" అను నైతికపద్యకావ్యమును బదివేలపుటలకు మించిన వివిధగద్యకావ్యములను రచించి యాంధ్రలోకమున భాషాభిమానుల యాదరమును గాంచియున్నారు.

ఈవిధముగా వేంకటపార్వతీశ్వరులు తమకవితావల్లికను నలుదెసలఁ బ్రాఁకించుచు "పొన్నపూఁగొమ్మను బొగడయున్నదియొ, పొగడయే యున్నదో పొన్నపూఁగొమ్మ, ఊహింపరాకుండ నొకరీతినుండి, యిరువురిపరిమళంబిదియిదియనుచు విభజింపరాకుండ విలసిల్లుచుండి—గానమును శ్రుతియుంగల

సిన సరసమోహనకలస్వనముంబోలి, రాగమును గళయుం గలసిన శాంతసుందరవిలాసముంబోలి, స్వరమును లయయుఁ గలసిన సురుచిరామోదవిస్ఫురణంబోలి, భావమును ధ్వనియు నుగలసిన నవనవానందవైభవముంబోలి "కవితాపురాణిని" దమచూపులోఁ బాపఁగాఁ జేసికొని సమస్వరమున గానము సేయుచు,

"కవితామృతాబ్ధిలోఁ గల్పప్రసూనముల్
తేనెచిందకయుండఁ దేల్చితెచ్చి
జ్ఞానవల్లికలలో స్వర్ణపుష్పంబులు
చెలువుగందకయుండఁ జేర్చితెచ్చి
గానసరిపంతిలోఁ గనకారవిందముల్
పుప్పొడిచెడకుండఁ బొదివితెచ్చి
ఆనందవనములో నమృతలతాంతముల్
దళములొత్తకయుండ దాఁచితెచ్చి"

ఆంధ్రకవితాసరస్వతికి 'అమ్లానపూజాపుష్పహారము' గను,

"తిక్కని నన్నని తెల్లని యెనలేని
మొగ్గలలోనుండి నిగ్గుఁదీసి
చక్కని చిక్కని సరిలేని కమ్మని
పూవులలోనుండి ప్రోవుఁజేసి
విఱుగని తఱుఁగని వెలలేని తీయని
తేనియలోనుండి తేటఁదీసి
కలఁగని తలఁగని నలిలేని తొలిలేని
చివురాకుదొన్నెల సేకరించి—

సరసకవితావిలాసరసాయనమును ప్రేమరసమునఁగూర్చి యాంధ్రలోకమునకు 'అమృతపానీయము'గను నర్పించియున్నారు— అర్పించుచున్నారు. ఇంకను వీర లనేకోత్కృష్టమధుర కావ్యరచనలచే నభివృద్ధిఁ గాంచుచు, దీర్ఘాయుష్మంతులై, యింతోధికయశస్వంతులై వెలయుచుండునట్లు పరమేశ్వరుఁ డనుగ్రహించునుగాక యని యానందపూర్వకముగ నాశీర్వదించుచున్నాను.

సీ. సకలజీవానందసంజీవనము లైన
యమృతధారాప్రవాహములతోడ
సర్వార్థసముదారసంపత్ప్రదము లైన
కమనీయగతివిశేషములతోడ
అతిలోకపావనశ్రుతిమనోజ్ఞము లైన
కలకలధ్వనితరంగములతోడ
సుశ్లోకమాధురీసుప్రసన్నము లైన
శాంతలీలావిలాసములతోడ
పృథివిఁ దనియించుగోదావరీస్రవంతిఁ
గాంచి పులకించి తపము ఫలించె ననుచు
స్వాంతముననుబ్బుగౌతమసంయమీంద్రు
సమ్యగామోదవిభవంబు సంస్మరింతు.

పిఠాపురము.
5-10-1924.

నడకుదుటి వీరరాజు.

# విషయసూచిక.

## ద్వితీయభాగము.

ఓమ్.

# కావ్యకుసుమావళి

## ద్వితీయ భాగము.

సమర్పణము.

సీ. ననుఁ బ్రోవు మనుట యేనాఁటివాఙ్కమాట
విశ్వరక్షకుఁడగు విభునిచెంత
దాసుఁడ ననుట పెద్దలనాఁటిమర్యాద
భక్తపాలకుఁడగు ప్రభునిచెంత
సిరుల నిమ్మనుట యాశ్రితజనాభ్యాసంబు
సర్వప్రదుండగు స్వామిచెంత
నావాఁడవనుట సనాతనాచారంబు
సకలాత్ముఁడైన యీశ్వరునిచెంతఁ
గాన నోదేవ ! నీసేవఁ గాంచుకంటెఁ
గోరి నీకాత్మ నర్పించుకొనుటకంటెఁ
గామితార్థంబు లింక మాకేమి గలవు ?
సత్కృపాధామ ! దేవతాసార్వభౌమ !

(5—8—1923.)

# 45 వందనము.

సీ. శ్రీమూర్తిఁ దనమూర్తిఁ జిత్తగించెడివేళ
సిద్ధసంకల్పంబు సెందువేళఁ
జిన్మయాకారంబు చిత్రితంబగువేళఁ
బంచభూతములు నర్తించువేళఁ
బ్రహ్మాండంబులు ప్రసవంబులగువేళ
బహురూపములు కానఁబడెడువేళఁ
బరివిమలానందంబు ప్రకృతి కబ్బెడువేళ
నఖిలంబునకుఁ బురుడైనవేళ
వేయిచేతుల సృష్టిగావించువేళ
నన్నియును దానయై దేని నంటకుండ
విశ్వకారణమూర్తియై వెలుఁగుచుండు
వరదుఁడగునీశ్వరునకు మావందనములు.

సీ. ఘోరశార్దూలముల్ గుయివెట్టునడవుల
మృగకదంబములకు మేపుసూపి
ఆకొన్నబకములు పైకొన్నకొలఁకులఁ
జిఱుచేపలకు మనుతెఱఁగుసూపి
ఖరనఖశ్యేనముల్ దిరుగునాకసమున
వరకపోతములకుఁ దెరువుసూపి

దారుణాపయములు దరికొన్నజగమునఁ
బొదలుజంతువులకు బ్రిముకుసూపి
గీ. సకలజగములఁ బ్రిణమైక శాసనమునఁ
బాలనము సేయు జగదేక పాలకునకు
భక్తచింతామణికి సార్వభౌమమణికిఁ
బ్రేమమయజీవమణికిఁ బ్రణామశతము.
సీ. భూతజాలంబు లుప్పొంగిపోవుచునుండ
భువనంబు లణువులై పోవుచుండ
గగనభూచరసృష్టి గగ్గోలుపడుచుండ
రవిచంద్రితారకల్ రాలుచుండ
భవరంగమున నాశపటము జాఱుచునుండ
హాహావిరావంబు లగుచునుండ
జీవచైతన్యంబు చివికిపోవుచునుండ
నఖిల మేకార్ణవంబగుచునుండఁ
బ్రకృతి దుస్సహ మగునట్టి ప్రిళయవేళ
నఖిలసంక్షోభముం గాంచి యవనిఁ గాంచి
తన్నుఁ దాఁ గాంచి యానందతాడవమున
మగ్నుఁడగు నీశ్వరునకు నమస్కృతంబు.
సీ. కరుణామృతము వోసి పరమాదరమున లా
లించి నిత్యంబుఁ బాలించుతల్లి

ప్రేమామృతము చిల్కి ప్రియతమపదము రూ
పించి నిత్యంబుఁ జూపించుతండ్రి
జీవామృతం బిచ్చి చిరతరారోగ్య మం
దించి నిత్యంబు సంధించువెజ్జు
జ్ఞానామృతము సూపి యానందవార్ధిఁ గ్రీ
లించి నిత్యంబుఁ దేలించుగురువు
నగుచు జీవుల నిత్యంబు ననుసరించి
వేయిగన్నులఁ గని మేలు చేయుచుండు
సర్వలోకాశ్రయుండైన సర్వమయుని
వత్సలత్వంబునకు నభివాదనములు.

సీ. హాలాహలమునైన నఱచేత నిమిడించి
యారగింపఁగఁజాలు నట్టిశక్తి
యశనిపాతమునైన నడుగుదప్పక నిల్చి
తలయెత్తి యెదిరింపఁ గలుగుశక్తి
కాలపాశమునైనఁ బూలమాలికవోలెఁ
దేజరిల్లఁగఁ జేయు దివ్యశక్తి
ప్రళయానలమునైనఁ బండువెన్నెలఁబోలెఁ
బరిణమింపఁగఁజేయు భవ్యశక్తి
సాధువులకుఁ గటాక్షించు సర్వశక్తి
సర్వసమవర్తి శాశ్వత సత్యమూర్తి

సర్వభూతదయాపరచక్రవర్తి
చరణకమలంబులకు నమస్కారశతము.

(18-2-1923.)

---

# 46 కవిద్వయము.

సీ. సమసూత్రవీణాద్వయమునుండి యేకమై
మొఱయునాదంబు నేర్పఱుపనేల ?
సమజాతిపుష్పద్వయమునుండి యేకమై
విరియునెత్తావి నేర్పఱుపనేల ?
సమరూపదీపద్వయమునుండి రేకమై
మెఱయు తేజంబు నేర్పఱుపనేల ?
సమవేగలహరీద్వయమునుండి యేకమై
పొరలునీరంబు నేర్పఱుపనేల ?

నియతసమభావగతిఁ గవిద్వయమునుండి
యేకమై తోఁచు కవితారసైకమూర్తిఁ
దలఁపులో నిల్పి యెన్నఁగా వలయుఁగాని
వేఱుసేసి కనుంగొన గోరనేల ?

క. ఫలరసము పంచదారం
గలసి రసాయనము గాఁగఁ గైకొని రుచులం
దెలియవలెఁగాక, తెలిసియుఁ
దెలియనితర్కముల వానిఁ దేర్పఁగనేలా ?

క. శరదాగమంబు, జ్యోత్స్నా
కరపులకితయామినియును గలసిమనోమం
దిరమోహనమై మెఱయఁగ
నిరువంకలఁ దరతమంబు లెఱుఁగఁగనేలా ?

సీ. గాన మాతనిది, చొక్కంబైన శ్రుతి నాది
సరసమోహనకలస్వనము మాది
రాగ మాతనిది, తోరంబైన కళ నాది
శాంతసుందరవిలాసంబు మాది
స్వర మాతనిది, విభాసురమైన లయ నాది
సురుచిరామోదవిస్ఫురణ మాది
భావ మాతనిది ; జీవంబైన ధ్వని నాది
నవనవానందవైభవము మాది

చోద్యముగఁ బాడు నాతండు చూపులోనె
పట్టియాడెద నేఁ గనుపాపలోనె
యేపుగా రూపుగాఁ దోఁచు నింతలోనె
చూపులోఁ బాపమై కవితాపురాణి.
(19-10-22.)

---

## 47 వసంతాంకము.

అమలగానంబు, మలయాచలానిలంబు,
చెలిమొయారంబు, ఫలరసం, బలరుఁదావి
యరయ నేకైకకరణక్రియములె కాని
సకలకరణమనోజ్ఞంబు సుకవికవిత.

---

జగతి వడఁకించుచలిగాలిఁ జల్లపఱిచి
వెసల ఘూయించుపోగమంచుఁ గసిమసంగి

మొరడుమోళ్ళఁకులఁ జిగురాకు మొలవఁజేసి
మూకకోకిలఁ గలకంఠముగ నొనర్చి
సుప్రసన్నప్రభాతవిస్ఫూర్తితోడ
సుమధురవిహంగకలకూజితములతోడ
సురుచిరారామవరలతాతరులతోడ
సురభిళోత్ఫుల్లకుసుమమంజరులతోడ
సరసపరిణతఫలగుళుచ్ఛములతోడ
సరసిజామోదకాసారసమితితోడ
సలలితశ్యామశాద్వలస్థలులతోడ
సదమలాశాదిశావకాశములతోడ
సకలజీవోత్సవంబుగా స్వర్గమట్లు
లవని నలరించునివ్వసంతాగమమునఁ
బువ్వుఁదోఁటల విహరించు పువ్వుఁబోండ్ల
తనువిలసనంబు నొయ్యారితనముఁ జూచి
మలయగిరినుండి తామరమడుఁగునుండి
మెల్ల నేతెంచుకమ్మతెమ్మెరలఁ జూచి,
వలపు లొలికించుపూవుగుత్తులు సలింప
మురిసి తూగాడు కుసుమవల్లరులఁ జూచి,
యలరుఁదేనెలఁ గడుపార నారగింప
ఝమ్మనుచుఁ బోవు నెలదేంట్లసొగసు చూచి,

సకలజీవలోకంబును సంతసమున
నలరి యానందతన్మయం బగుచునుండఁ
జిన్న ముండినఁ గొండంత సేయువాఁడు
విగ్రహము లక్షరములతో వేయువాఁడు
చెలువమును జూచి భావంబుఁ జెప్పువాఁడు
జగతిఁ గవితను జూపింపఁ గలుగువాఁడు
చూచి యూరక యుండునే సుకవివరుఁడు !—

*　　*　　*　　*

సమధురమనోజ్ఞ రూపవసంతవేళఁ
బూర్వశైలంబునను బ్రొద్దుపొడుచువేళఁ
జెలఁగి చెందామరలు వికసించువేళఁ
బ్రకృతి రమణీయమూర్తియై వఱలువేళ
భావ ముప్పొంగఁజేయు ప్రభాతవేళ
బాలసూర్యుని మృదుకరజాలకలనఁ
గనుల మెఱయింపఁగల తరంగములతోడఁ
గుతుకముం గూర్చు నిండిన కొలనినడుమ
విచ్చుచుండిన తామరవిరులనడుమఁ
గుసుమసుకుమారమూర్తి యా కోమలాంగి
నిలిచి పూవులఁ గోయఁగాఁ దలఁచుచుండి
యంతలోఁ గోకిలారావ మాలకించి

కోయఁదలఁచినపూవులు గోయకుండ
సొగసుగులుకంగ నిక్కి నెమ్మొగము మలచి
చిత్త మలరంగ నొక్కింత సేపు సూచి
యట్టె పరికించి నిలువునీరైనయట్లు
పోఁతవోసిన బంగారుబొమ్మయట్లు
నిలువఁబడిపోయినప్పు డన్నెలఁతరూపుఁ
గవి యెవండైనఁ గాంచుట గలిగెనేని
నిలిచి పారంబుముట్ట వర్ణింపకుండ
నొక్కలాగున నూరక యుండఁగలఁడె ?
అగపడినదెల్ల రసమయం బైనయట్టు
లవనియంతయు స్వర్గమేమైనయట్లు
సుకవి మధుమాసమును జూచి చూపుచుండుఁ
గవులకు వసంత మన నెంతకౌతుకంబో ?

* * * *

వెలఁదివెన్నెఁతేటలో వెన్నపూస,
బాలభానునికరములఁ బసిఁడిచేరు,
కొమ్మనెమ్మేనిచాయలోఁ గుందనమ్ము,
ననుఁగుటెల్లాలిపలుకులం దమృతరసము,
చావచెంగావిమోవిపైఁ దేనెచుక్క,
కలవిహంగమరుతముల గానలహరి

కానఁబడనేర్చునే యొక్కకవికికాక !

* * * *

అవనిపైఁ గల్గు నఖిలవస్తువులఁ జేర్చి
మధురవర్ణంబులను గూర్చి మధురగాన
కలన మధురామృతరసంబుఁ జిలుకరించు
సరసకవిచంద్రులకు నమస్కారశతము.

(2-1-16.)



# 48 అనుగ్రహము.

అసదృశమనోజ్ఞఖేలనాయత్తు లగుచు
నఖిలబాలకుల్ విహరించునట్టివేళ
నలరునెత్తావులను మోచునలపుతోడ
మెల్లఁగాఁ బిల్లవాయువుల్ మెలఁగువేళ
జగమునకు నూత్నరాగంబు సంతరించు

మెలపుతో సంజకెంజాయ లోలయువేళ
ఘనతరానందకలకలధ్వనులతోడ
నఖిలఖగములు నెలవుల నందువేళఁ
గందులఁ దలంచుకొనుచు వేగంబుతోడ
నాలమందలు గృహముల కరుగువేళ
వేఁడివేలుపు విరతికై వెడలువేళఁ
బరివిమలానంద మిచ్చుదీపాలవేళ
నొంటిగాఁ ద్రోవనడచుచు నున్ననాకుఁ
దావకీనపవిత్రసందర్శనమునఁ
దావకీనతేజోమయదర్శనమునఁ
దావకీనవాత్సల్యప్రదర్శనమునఁ
దావకీనకటాక్షామృతంబువలన
మాత ! నాపాపసంఘంబు మాయమయ్యె
జనని ! నాయంధకారంబు సమసిపోయెఁ
దల్లి ! నాగాత్రవల్లి యుత్ఫుల్లమయ్యె
నమ్మ ! యమృతత్వ మందితినమ్మ నేను !

(5-1-1916.)

# 49 ప్రేమకోటకు.

చెట్టునకు మొగ్గదొడిగెడు చేష్ట గలదు
కోరకమునకు వికసించు గుణము గలదు
విరికి వలపుల వెదచల్లు విద్య గలదు
వలపునకు గుబులొల్కొను నలవాటు గలదు
దేనికొఱ కిది యంతయు దేనికొఱకు?
ప్రేమకొఱకుఁ బ్రేమకొఱకుఁ బ్రేమకొఱకు—
కోకిలం బూరకయె పాడుకొనుచునుండెఁ
బలుకుపలుకున సుస్వరం బొలయుచుండె
స్వరలహరిలోన నమృతంబు గురియుచుండె
నమృతరస మెంతొ మాధుర్య మగుచునుండె
నెందుకొఱ కిది యంతయు నెందుకొఱకు?
ప్రేమకొఱకుఁ బ్రేమకొఱకుఁ బ్రేమకొఱకు—
హృదయపదమున నెల యుదయించు టేమి?
కలశవారాశి మిన్నంటి తొలఁకుటేమి?
తలఁపుఁదరఁగలగమి దరిఁ దట్టుటేమి?
మెఱపుఁదీగలు మిలమిల మెఱయుటేమి?
దేనికొఱ కిది యంతయు దేనికొఱకు?
ప్రేమకొఱకుఁ బ్రేమకొఱకుఁ బ్రేమకొఱకు—

ఇనకరంబులలో వేఁడి యెందుకొఱకు ?
ఇందుకిరణంబులను జల్వ యెందుకొఱకు ?
ఋక్షసంతానమున మిన్కు లెందుకొఱకు ?
ప్రేమకొఱకుఁ బ్రేమకొఱకుఁ బ్రేమకొఱకు—
ఎఱుఁగఁబడకున్న యీకూర్పు లెందుకొఱకు ?
తెలియఁబడకున్న యీమార్పు దేనికొఱకు ?
విశదపడకున్న యీనుడు లేవికొఱకు ?
ప్రేమకొఱకుఁ బ్రేమకొఱకుఁ బ్రేమకొఱకు—
ఈసుఖంబును గష్టంబు నెందుకొఱకు ?
ఈభవంబును నాశంబు నెందుకొఱకు ?
ఈజగంబున నిన్నియు నెందుకొఱకు ?
ప్రేమకొఱకు ముమ్మాటికిఁ బ్రేమకొఱకు.

(10-1-1916.)

# 50 శ్రావణశుక్రవారము.

శ్రీలఁ జెలువారెడుటకు సువాసినులొనర్చు
శ్రావణీశుక్రవారపూజలకు నలరు
నమ్మహాలక్ష్మిశుభదృష్టి నవతరించు
నమృతవీచిక లశుభంబు నార్చుఁగాత !

గీ. దేశకాలపాత్రములనుస్థితికి మనుజ
హృదయములకును సంబంధమేమిగలదొ?
శ్రావణముతోడఁ దొల్లింటిచరిత మొకటి
సంస్మృతికి రాఁగ వ్రాసితిఁ జదివికొనుఁడు.

సీ. "ఏనాఁటి కానాఁడె యొగతాళిఁ గావించు
మునలిమాదిగముండ మొగము చూచి
కడకంటిచూడ్కినే కనఁబడునాముద్దు
భామామణిమనోజ్ఞభావ మెఱిఁగి
కాలానుసారంబుగా వచ్చుపర్వంపు
దినములమాట ముందే గ్రహించి
దినవెచ్చమున కెంతధనము గావలయునో
యిుంచుమించుగఁ జూచి యేర్పరించి
యిచ్చుచుంటి నే నడుగకే యింతదాఁక
నక్కటా ! పుండుపైఁ గారమట్లు తేప

వచ్చినది శ్రావణీశుక్రవాసరంబు
చేతఁ గాసైనలే దేమిచేయువాఁడ.

ఉ. "నీసరివారు లేరనుచు
నిన్వరియించెనె మీాలతాంగి, నీ
మీాసలలోనిన వ్వమృత
మే? సరి! శ్రావణశుక్రవారపుం
గాసు నొసంగనైనఁ గొఱ
గానియనాథవు నీకు సానిసా
వాసము లేలరోరి! తులు
వా! సరివారలఁ జూడలేమరా?

ఉ. తేరబాజుంగ నీమనసు
దీరఁ జరింపఁగ నెల్లకాలముఁ
దారము గట్టినావె వెల
దారకు? నీమొగమిచ్చుమాట బం
గారపుమూట గాదు వెడఁ
గా! పదరా! యని పెద్దలంజె న
న్నాఱడిచేసి తోసినది
హా! యిఁక నూరక యెట్లు పోవుదున్?

ఉ. సంచులు విప్పి రూప్యము ల
సంఖ్యము దాసిమొగానఁ బొఱఁబో

యించిననాఁటిమాట యెట
యేఁగెనో ! బూతులనాటకఁబుఁ దీ
యించి క్రమంబుగా నభిన
యించుచు నున్నది యిప్పు డక్కటా !
మంచియుఁ జెడ్డయున్ దెలిప
మాలినతో త్తెఱుఁగంగఁజాలునే ?
సీ. మూఁడంతరువులతో మేడఁ గట్టింపఁగా
నవిడిమాన్యము తెగనమ్మినాఁడ
వరుస దప్పని యేఁడువారాలనగలకై
మడిపల్లెపొలము చేవిడిచినాఁడ
నాకులుఁ బోకలు నత్తరువులకునై
చెల్లూరిపంపు గాఁ జేసినాఁడ
నప్పటప్పటికినై యమలాపురంబులోఁ
గొబ్బెరతోఁటఁ బోద్రొబ్బినాఁడఁ
దక్కుసర్వస్వముంగూడ దానిపేర
వ్రాసి యిచ్చితిఁ గానైన వదలకుండ
నింక నే దాఁచికొనియున్న దేమి గలదు!
తెమ్ము తెమ్మన్న నేరీతిఁ దెచ్చువాఁడ ?
గీ. పూఁటపూఁటకు నాపెద్దబూచి కొసరి
కొసరి పంపెను బత్తెంపుఁగూటితోడ

నేను నాభార్యయును బొట్ట నింపికొనుచు
బ్రిదుకుచుంటిమి చావక బ్రదుకకుండ.

గీ. "నావరాలమూట నాకొంగుబంగార"
మన్ననోటితోనె యీముసలిది
"యినుపగజ్జెలయ్య యీాసుపుఁగాళ్లయ్య"
యనఁగఁజాగె నేమి యనఁగఁగలదు ?

ఉ. తామస మొప్ప నన్నటు ల
దల్చుచు నుండినతల్లిఁ గాంచి భా
మామణియైన నీకు నిది
మంచిది గా దని చెప్పకుండ నె
మ్మోము మలంచి చిత్తరువు
బొమ్మవలె న్నిలుచుండెనోర ! నే
నే మని యెంచుకొందు ; మఱి
యేగతి దానిమొగంబుఁ జూచెదన్.

గీ. భామ నామీాఁదఁ గలయట్టి ప్రేమచేత
నిమిషమున కొక్కయందంబు నెఱపుకొఱకుఁ
గోకలును సొమ్ములును గోరికొనుటె కాని
యాలతొంగికిఁ దుచ్ఛధనాశ లేదు.

క. భామామణి నాసంగతి
నామూలాగ్రిం బెఱుంగు నైనను దనకీ

నోమునకుఁ గాసు నేనే
పేర్మి నొసఁగనలయు ననుచు వేఁడుకపడెనున్.

క. వలసినయపు డొక్కటిగా
నొలిచికొనుచుఁ దెచ్చి దాని కొసఁగితి మఱినా
కులకాంతయొద్ద నొకమం
గళసూత్రముకంటె వేఱుగతి లే దకటా !

క. పెడమొగము గాక నే నే
మడిగిన నానందసూచకాననమున ని
చ్చెడు నాసతి నిఁక నే మని
యడుగ, నడుగరానిప్రియపదార్థము నకటా !

గీ. మాపరస్పరనిత్యసంబంధమునకు
మంత్రపరిపూతచిహ్నమై మంతుకెక్కి
నేనె నాచేతఁ గట్టినదాని నకట !
త్రెంచి నా కిమ్మనుచు నెట్లు దేవురింతు.

గీ. కాసు నీయకున్న గుమసరిముదిలంజె
యేపికుక్కవోలె నెగసిపడును ;
భామ తోఁపకుండఁ బడియుండు నాకయి ;
పోవు టెట్లు ? పోకపోవు టెట్లు.''

గీ. అనుచు నిట్లు కోటలమ్మ చెఱువుగట్టు
చెంత నున్నజువ్విచెట్టుక్రిందఁ

గూరుచుండి ర్యాలి గోవిందరా వుప్స
రుస్సు రనుచు వెచ్చ నూర్చుచుండె.

గీ. అతఁడు చూచుచున్న నటు చూడకుండిన
నెవరిజోలి లేక యేఁగుకాల
మట్లు తిరిగిపోవ నర్కుఁ డంబునిలోన
మునిఁగెఁ ; దమము దెసల ముంచికొనియె.

గీ. దిడ్డితలుపుమూల దివ్వె ముట్టించిన
సమయ మాదిగాఁగ జానకమ్మ
విభుని రాకకొఱకు వేచి తాఁ గూర్చుండెఁ
గడకు వంటయింటిగడపచెంత.

క. పడఁతి యటు చూచుచుండఁగ
గడియలు జాములుగ మాఱె కన్నులలోనే
కడచుటయె కాని ప్రియనా
థుఁడు వచ్చెను జాడమైనఁ దోఁపకయుండెన్.

మ. అపు డయ్యంగన యంతరంగమునఁ "గ
ట్టా! యింత సేయంగఁ బా
పపుదైవంబునకున్ వినోద మొకొ? మా
పైఁ గోపమో? కానిచో
విపరీతస్థితిఁ గూర్చి యీవిధమునన్
వేధింపఁగా సర్వభూ

తపరిపాలకుఁ డైన దేవుఁ డిటు ని
ర్దాక్షిణ్యుఁ డై యుండునే?

గీ. చేతఁ గాసు లేక చింతాకులాత్ముఁడై
నొగులుచున్న నామనోహరునకు
సరిగఁ జేయఁదగిన పరిచర్యలందు నా
దోష మేదిన్నైనఁ దోఁచె నేమొ?

క. ఇ ల్లెరవుగ వారాంగన
యిల్లె సతముగాఁ దలంచి యెల్లప్పుడు నా
వల్లభుఁడు చరించుట కే
నొల్లమి వాటించి యుంటినో యెపుడైనన్?

గీ. పడపుఁబడఁతివలలఁ బడినవాథునకు నా
మోముఁ గన నసహ్యమేమొ యనుచు
శిరము వంచి సేవ చేయుచుంటిని గాని
కన్ను లెత్తి చూడఁ గలిగినాన?

క. ధనమునకు వలచువారాం
గన యొల్లమిఁ జూపి మనసుఁ గందించునొ నా
థున కని నగలను నాయం
తనె యొనఁగితిఁ గాని యురక తగవాడితినే?

గీ. సానియింట నైనఁ జల్లనిమనసుతోఁ
బ్రాణనాథుఁ డుండవలయు ననుచు

వచ్చునంతలోనె వడ్డించుచే కాని
నిమిషమైన నింట నిలిపి యెఱుఁగ.

గీ. ఆదరించి మాటలాడక యుండిన
నారగింపవచ్చు నప్పుడైన
నాత్మభర్త కంటికగపడు చుండె నా
కంతె చాలు ననుచు నాసపడితి.

క. వెలవెలఁది ధనముఁ దెమ్మని
యలిగి మనోనాధు నొవ్వనాడుటవలనన్
గలఁగినమదితోఁ దోఁపక
యలమరుచున్నాఁడో? యేమొ? మారాటమునన్

చ. కరముల దాఁటిపోయె సిరి;
కట్టఁగగుడ్డ, తినంగఁ గూడునున్
గఱవయిపోయె; నాపడవుఁ
గత్తియకోరికలెల్లఁ దీర్ప దు
స్తరమయిపోయె; నిట్లయిన
దానిపయిం దగులంబు వీడ దు
ర్భర మయిపోవుచున్న యది
భర్తకు; నేనింక నేమిచేయుదున్.

ఉ. ఎత్తతి నీకు నెట్లు సహి
యింపఁగ రానిదోసంగు గలునో

యత్తతి దీని సీమగని
కందఁగఁజేయు మటంచుఁ జెప్పి మా
యత్త యొసంగె నొక్కపర
మాద్భుతవస్తు వొకండు; దానిఁ దా
యెత్తున నుంచి నేను నపు
డే గళసూత్రమునందుఁ గూర్చితిన్.

గీ. ఆమె చెప్పినట్లు లది యిప్పు డెటులైనఁ
బ్రియుని కింత యుపకరించు ననుచుఁ
బోవ మిగిలి యున్నభూషణం బిదె యని
యీయఁ దలఁచి యుంటి నీదినమున.

క. అకటా! యతఁడు దురాశా
వికలహృదయుఁడగుచుఁ బాపి విధిదూఱుచుఁ దా
నొకచిల్లిగవ్వఁ దేనో
పక యుండుట కెంతచింతపడుచుండెనొకో?

గీ. అర్ధరాత్రివేళ నంధకార బున
నాఁడుదాన నొంటిదైనదాన
నిల్లు వెడలు టెప్పు డెఱుఁగనిదాన నే
నెట్లు విభుని వెదక నేఁగుదాన?

గీ. ఏమి సేయుదాన నెటు వోవుదాన నీ
కాళరాత్రి నెట్లు గడపుదాన "

ననుచు జానకమ్మ యతివిషాదంబునఁ
బ్రియునికొఱకుఁ బరితపించు చుండె.

సీ. తలవాకిటను దల్పు తట్టినయట్లైన
లేచి యవ్వలి కేఁగి చూచి వచ్చుఁ;
వెరటిగుమ్మమునొద్దఁ బిలిచినయట్లైన
నల్లన చెవి యొగ్గి యాలకించుఁ;
జేరువ నట చీమ చిటుకుమన్నట్లైన
నదరిపాటున లేచి యవలఁ జూచుఁ;
బ్రియుఁ డెట్టయెదుటఁ గాన్పించినయట్లైనఁ
దత్తరంబున లేచి యుత్తగిల్లు
నెపుడు వచ్చునో నానాథుఁ డింటి కనుచు
సంభ్రమించుచు నున్న యాజానకమ్మ
కపుడు పరిసరముల నెట్టి యలుకుడైన
భర్త జాడలె కాఁ గానఁబడుచునుండె.

గీ. అట్టులుండ రాత్రి యామద్వయం బయ్యెఁ
గూరుచున్నసతికిఁ గునుకు వచ్చె
నంతలో నదేమొ యాకస్మికంబుగా
నట్టె యింటిదీప మాఱిపోయె.

గీ. ఒక్కయింతలోనె యువిద తా గొంతెత్తి
"వదలు మయ్య! చేయి వదలుమయ్య!

మగఁడు ముట్టఁదగిన మంగళసూత్రంబు
ముట్టఁబోకు మయ్య మ్రొక్కెదాన.

క. వనిత పతికొఱకునై నన్
వనితకొఱకు నాథుఁడైనఁ బ్రాణంబులు పో
యినదాఁక విడువనొల్లని
ఘనవస్తువు నంట నీకుఁ గలుషము గాదే!

క. ఐదువతనమునకున్ గుఱి
గాదిలిమగనియెడ నిరతగాఢప్రేమా
పాదనమున కుపకరణము
గాదే దీని నొరుఁ డంటఁగాఁ దగ వగునే?

గీ. కడుపు మండుచున్నఁ గలవారిభవనంబు
లకట! యీపురంబునందు లేవె?
యిస్సి! యిట్టిపేదయిల్లాలితాళితో
నీదరిద్రజలధి నీఁదఁగలవె?"

క. అని యీగతి వాపోయెడు
వనితపయిం గరుణలేక వాఁడట్టె పుటు
క్కునఁ దాళిఁ ద్రెంచికొని వ
చ్చినదారిం బాఱిపోయెఁ జిడిముడిపడుచున్.

గీ. ఇరుగుపొరుగువార లెల్లరు నాజాన
కష్టమార్తనాద మాలకించి

త్వరగ నేఁగుదెంచి పరికించిరే కాని
దొంగజాడ సుంత దొరక దయ్యె.

గీ. జానకమ్మ, పూతచరిత, ప్రాణముకంటె
ఘనముగాఁగఁ జూచికొనెడుతాళి
చోరుచేతఁ బడియు సుదతియొడిం జేరెఁ
దల్లిఁ బాయనట్టి పిల్లవోలె.

---

గీ. కంట నిదుర లేక కాలుగాలినపిల్లి
కరణి వీథులెల్లఁ దిరిగి తిరిగి
కుటిలచిత్తుఁ డైన గోవిందరావప్పు
ఛామమందిరంబు పజ్జకరిగి.

గీ. కాచదీప మున్న కంబముకడ కేఁగి
చిన్నజేబులోనఁ జేయి వెట్టి
పసుపుదార మొకటి పైకెత్తి కనుఁగొని
తెల్లఁబోయి కన్నుఁ దేలవైచి.

క. కటకటపడుచుండఁగ న
చ్చటి కొకగుఱ్ఱంపుబండి చనుదెంచిన నే
మిటి కిది యని నెమ్మదిఁ దొ
క్కట మినుమడియైనఁ దెలియఁగాఁ దగుననుచున్.

గీ. అశ్వచోదకుచెంగటి కరిగి మిగుల
మెలపుతోడుత నాతనిఁ బలుకరించి
యాగమనకారణంబేమి యనుచు నడుగ
నతఁడు నిట్టూర్పు విడిచి యిట్లనుచుఁ జెప్పె.

క. "పాములకోటజమీదా
రీమెకు నెల కై దునూఱులిచ్చి నిలువఁగా
నామోదించెను దుర్భర
కామవికారంబు గన్నుఁగవ మూయింపన్.

క. తంటాలమారి వెలవా
ల్గంటులవిషదృక్ప్రసారకలనంబునఁ బె
న్మంటల మిడుతలవలె నిటు
వంటిధనికు లెందఱైరొ పరికింప మొకో!

క. తన కెంతజమీ నున్నన్
గనుఁగొన గోవిందరావుకంటె ధనికుఁడే
తినుటకు లేకుండఁగ నా
తని జేసినభామ యితనిదయఁ జూచునొకో.

గీ. తనకుఁ బ్రాణమానధనముల నర్పించి
కులవధూమతల్లి గొలుచుచుండఁ
దనదుప్రాణమానధనముల హరియించు
వెలవెలందిఁ గోర వెఱ్ఱిగాదె."

గీ. అనుచు నీరీతి నతఁడు దన్నాదరించు
ప్రభునియవివేకమునకునై పరితపింప
నదియె గోవిందరావున కాత్మమూఢ
బుద్ధి మాయించుదివ్యప్రబోధ మయ్యె.

గీ. అంతరంగంబునందుఁ దాపానలంబు
నిండి యాకస్మికంబుగా మండసాగె
భావవీథిని శతకోటిభానుకిరణ
జాలములు దుస్సహంబులై జాలుకొనియె.

గీ. కన్ను లెఱ్ఱనయ్యెఁ గనుబొమ లుబ్బిడివడెఁ
బెదవు లదరె నాల్క పిడుచవాఱె
మొగము జేవురించె ముకుపుటంబులు విచ్చి
నిడుదయూర్పు లెగసె నొసలు నడఁకె.

గీ. ప్రబలమారుతమున సుడివడినజలధి
వెడలెడుతరంగములువోలె విపులతాప
వహ్నిఁ గ్రాఁగెడునాతనిస్వాంతమందు
నెగసె భావస్ఫులింగంబు లగణితముగ.

సీ. తడఁబాటు గదుర ముందడుగు వేయఁగఁ జూచు
'నాఁ' డెందుల కటంచు నట్టె నిలుచు
దర్ప మేర్పడఁ బోయి తలుపుఁ గొట్టఁ దలంచు
నిది యేమిపని యంచు మది మరల్చుఁ

బిలిచినఁ బలుకునో పలుకదో యని యెంచు
నేమైన నేమని యీసడించు
మొగముఁ జూపించి నాలుగుమాట లన నెంచు
సిగ్గుండునా యని చీఁదరించుఁ
గాలకారణవశత నాకస్మికముగ
స్వాంతమునఁ దోఁచునట్టిభావాంతరంబు
పరికృతినే మార్చివైవ నపాజ్ఞు నొకని
బ్రాజ్ఞుఁగాఁ జేసె ననుట యేపాటిమాట.

గీ. ఇంతలో భామ ముద్దుల నిచ్చి పంప
నాజమీాందారుఁ డేతెంచి యచట నున్న
ర్యాలిగోవిందరావుపార్శ్వముననుండి
యశ్వశకటంబుపై నెక్కి యవులఁ జనియె.

గీ. కోపమొ నిరాశయో యనుతాపమో య
సూయయో దుఃఖమో మదిఁ జొచ్చి కలఁపఁ
దెలుపఁగా రాని వేదన యలమికొనఁగఁ
గొయ్యవడిపోయె నతఁ డొక్క కొంతసేపు.

గీ. ఇట్టు లుండి యుండి యేమి భావించెనో
గాని యతఁడు సానిదానియింటి
వంకనైనఁ గనక వడివడినడలతో
నాత్మగృహముచెంత కరుగుదెంచి.

గీ. గుండె లతివేగమునఁ గొట్టుకొనుచునుండ
దీర్ఘనిశ్వాసముల మాట దేలిపోవఁ
దనసతీమణిఁ బిలుచుచుఁ దలుపుఁ గొట్టఁ
దక్షణమ వచ్చి యాతన్వి తలుపుఁ దీసె.

గీ. భయము వినయంబుఁ జిత్తసంభ్రమముఁ దోఁప
దిగులుపడుచున్న యట్లున్న మగువఁ గాంచి
సంశయము, సిగ్గు దుఃఖంబు సందడింప
నతఁడు గొబ్బునఁ గౌఁగింట నదిమికొనియె.

సీ. ఆకులు రాల మోడైనట్టిసుమశాఖఁ
దుదిదాఁకఁ జిగురాకు దొడిగినట్లు
గ్రీష్మతాపమునఁ గాఁగెడుసరోవరమున
మలయానిలము స్వారి సలిపినట్లు
అడుసుముట్టఁగ నింకి యడుగువట్టినయేట
నమృతవాహిని దొలఁకాడినట్లు
కాలమేఘమునఁ జీకటులుగ్రమ్మినయింటఁ
బండువెన్నెలవెల్లు నిండినట్లు
సతతపరితాపపరిఖిన్న జానకీహృ
దంతరంబున నానంద మంకురించి
యంత కంతకు వర్ధిల్ల నానెలంత
ప్రాణనాయకుకౌఁగింట మేను మఱచె.

గీ. అడ్డమగుమాయ మాయించి యాత్మ దివ్య
మోక్షలక్ష్మిసమాసక్తి మురిసినట్లు
గోవెలఁది రోసి గోవిందరావు నాత్మ
దారతోఁ గూడి తన్మయత్వంబుఁ గాంచె.

గీ. ఆమహానంద మవ్యక్త మైనదగుట
నప్పు డాదంపతులహృదయాంబుజంబు
లెట్లలరి భావగంధంబు లెట్లు లెగసి
పరిమళించెనో తెలియంగఁ బడకయుండె.

గీ. జానకమ్మ యెంత చక్కనిచెలువయో
యిన్నినాళ్లదాఁక నెవరి కెఱుక
ప్రియుని ప్రేమతోడి బిగికౌఁగిటను గూర్పఁ
బడినయప్పు డెఱుక పడియెఁగాక.

సీ. తనసహాసాపరాధముల మన్నింపు మం
చును భర్త సతి వేఁడుకొనకయుండ
నన్నింటిఁ గాలాన కారోపణముఁ జేసి
సతి పతికిఁ బ్రియంబు సలుపకుండఁ
దనపూర్వవృత్తంబుఁ దలఁచి నాథుఁడు దిట్టు
కొనుచు నొఁదలఁ వంచికొనక యుండ
నైనదేమో యయ్యె నామాట లిఁక నేఁటి
కని ప్రాణకాంత యూరార్పకుండ

నొండొరులదర్శనములనే యొల్లఁబోయి
స్పర్శనంబులఁ దన్మయత్వంబుఁ గాంచి
యలగునాదంపతులకష్టములును నిల్లి
తెల్లవాఱెడు నన్నట్లు తెల్లవాఱె.

గీ. భావశాంతిని గూర్చుప్రభాతమందుఁ
గర్మసాక్షి కరంబులఁ గనులు విప్ప
వికసనము గాంచుకమలకోరకములట్లు
లలరునాదంపతులకును దెలివి వచ్చె.

గీ. ప్రాణనాథుపాదపంకజంబులచెంతఁ
బసుపుఁదాళ్ళిటఁ గూర్పఁబడినయట్టి
పసిఁడితాయెతొకటి పడియుండుటను గాంచి
జానకమ్మ సంతసమునఁ బొంగి.

గీ. "కష్టవేళ నీమగనిచేతి కిమ్మని
యత్త నాకొసంగినట్టిదీని
నర్ధరాత్రి చోరుఁ డపహరించినదీని
బ్రాణనాథ! యెట్లు పడసితయ్య?"

గీ. అనిన గోవిందరావు దీనాననంబు
వెల్లఁబాఱంగ స్వరము కంపించిపోవఁ
"బ్రాణనాయిక! యంతటిపాపి కుటిల
చిత్తుఁ డీతఁడెసు" మ్మని శిరము వంచె.

గీ. జానకమ్మ యతనిఁ జల్లనిమాటల
మనసులోనినెగులు మాయఁజేసి
"యత్త కష్టవేళకని యిచ్చెఁ గావున
దీన నేదొ యుండి తీఱవలయు."

గీ. అని వచింప నాతఁ డద్దానిఁ గైకొని
విచ్చి లోన నున్న వెండిరేకుఁ
బైకిఁ దీసి చూడఁ బరమాద్భుతము దాని
పైని సరిగ వ్రాయఁబడియె నిట్లు.

గీ. "నాయనా! ధర్మకామనిశ్శ్రేయసములఁ
జేర్చెడిధనంబు రిత్తచేసితివి నీవు
గతము గతమయ్యె నిఁక బుద్ధి గలిగనేని
వేగ నాతలక్రిందఁ ద్రవ్వికొనుమయ్య!"

గీ. అనెడు శ్రీదేవతాప్రసాదామృతాక్ష
రములఁ బురుడించు నయ్యక్షరములఁ గాంచి
యాసతీపతు లానంద మతిశయింప
మెఱసి రామని సుమలతాతరులఁబోలి.

సీ. దుర్గంధపూరితాంధువున మున్కలు వెట్టి
దివ్యపుష్కరిణిలోఁ దేలినట్లు
అతిఘోరదుస్స్వప్నమందుఁ గన్నులు మూసి
దివ్యబోధమునఁ గన్దెఱచినట్లు

భయదోగ్రమృత్యుగహ్వరమునఁ జొరఁబాటి
దివ్యలోకమువంకఁ దిరిగినట్లు
దుష్పథంబునఁ గాలు దూలిపోవఁగఁబోయి
దివ్యపథంబునందికొనినట్లు
అపుడు గోవిందరావు భాగ్యంబుకలిమి
నీశ్వరానుగ్రహంబున నింతలోనె
దుస్సహావస్థలోనుండి తూలితూలి
తుదకు నపరిమితానంద పదవిఁ గాంచె.

గీ. కోరి తెచ్చికొన్న దారిద్ర్యము నశించి
తఱుగులేనిధననిధాన మబ్బె
వల పొకింతలేని వెలవెలందుక రోసి
యనుఁగుటింతిమీఁద మనసు నిలిచె.

గీ. స్వాంతమలరంగ నాఁడె యాసతియుఁ బతియు
శ్రావణీశుక్రవాసర సద్వ్రతంబు
నాగమోక్తంబుగా భక్తి నాచరించి
యిందిరాదేవిఁ గొలిచి రానందలీల.

సీ. శుక్రవారవ్రతసుప్రసన్నాత్మయౌ
నమ్మహాలక్ష్మిమాహాత్మ్యమునకొ
సురుచిరశుభగుణవరమణిఖనియైన
సతిజానకీసాహచర్యమునకొ

బహువిధసుఖదుఃఖ భావావగతమైన
లోకానుభవపరిపాకముననొ
అఘటనఘటనా సమర్థతేజంబైన
వరభాగధేయప్రభావముననొ
విమలమతియైనయట్టి గోవిందరావు
నాఁటనుండియు వెలయాలి మాటమఱచి
కులవధూమణితోఁగూడి కలసిమెలసి
యవనిపై స్వర్గసౌఖ్యంబు ననుభవించె.

(15-2-16.)



# 51 అనుతాపము.

నిర్మలాకాశకాసార నీరములను
బుట్టి వికసించి పెంపెక్కఁబోలు ననుచు
లోకబాంధవునిర్మలాలోకనముల
నఖిలకుసుమంబులఁ బవిత్రమైన దనుచుఁ
దల్లి ! నీపూజ కీపూవు దగునటంచు
నమ్మి యుండినపాప మీనాఁటి కిట్లు
బట్టబయలయ్యె భ్రాంతికిఁ బాత్రమైతి
నెట్టులో ముందుమార్గంబు నెఱుఁగనైతి
నెట్టులో నిన్ను సేవించు టెఱుఁగనైతి
నిట్టికుసుమంబుఁ గని విని యెఱుఁగనైతి
నింక నిది యెందులకొకాని యెఱుఁగనైతి
భ్రమరఝుంకారమా వినఁబడకపోయె
మలయపవమానమా మాటమాత్రమయ్యె
నమరసలిలావగాహమా నాస్తి యయ్యె
సౌరభం బేడనోకాని జాడలేదు
చూడఁజూడ లావణ్యంబు శూన్యమయ్యె
నగపడఁగరాదు మార్దవ మైనఁగాని
లేశమైన మరందంబు లేనియట్టి

పద్మ మేటికి సృష్టింపఁబడియెఁదల్లి !—
అమ్మ! నీపూజ కిది యయోగ్యం బటంచు
మొట్టమొదటనె యెఱుఁగకపోయినాఁడ
అక్కటక్కట! గుణలేశ మైనలేని
యిట్టియీమెట్టదామర నేరితెచ్చి
యెఱుఁగకుండఁగనే వచ్చి యిందమనుచు
నెవ్వరోకాని నా కిచ్చి యేఁగినారు.
అమ్మ! యీనిష్ప్రయోజన మైనయట్టి
పద్మ మేఁటికి సృష్టింపఁబడియెనమ్మ !—
జననిపదములఁ బూజించు సమయమయ్యెఁ
గన్నతల్లినిదర్శించు కాలమయ్యె
విశ్వజనయిత్రి నర్చించు వేళయయ్యె
నంబపాదంబులకు మ్రొక్క నవను గలిగె
ననుచు సంతోషమున మాటలాడుకొనుచు
నమలఫలముల దివ్యపత్త్రావళులను
విమలతోయంబులను విరివిరులఁగొనుచు
భక్తిభావంబుతోఁ దోడివార లెల్లఁ
దల్లి! నీపూజకై వేగ తరలుచుండఁ
గాంచి యే నెందులకుఁ గొఱగానియట్లు
మెట్టదామరఁ గొనివచ్చు టెట్టులమ్మ !

అమ్మ! యీనిష్ప్రయోజన మైనయట్టి
పద్మ మేఁటికి సృష్టింపఁబడియె నమ్మ!

(24-3-1916.)



## 52 ప్రేమోపహారము.

ఓకోకిలాలాప! యోకీరవాణి!
యోసుగుణాంబుధి! యోపద్మగంధి!
యోచంద్రికాసార! యోగానలహరి!
యోప్రియరత్నమా! యోజీవధనమ!
అడుగు వెట్టఁగరాని యీమరుభూమిఁ
బరిమళశోభిత ప్రసవంబ వీవు?
వర్షావసరనిశాభాగంబునందు
అంధకారసమావృతాకాశమందు

సదమలరుచిరనక్షత్రంబ వీవు;
దారుణగ్రీష్మసంతాపంబునందుఁ
బటుతరవిస్తృతప్రాంతరమందు
జలపూర్ణవిమలకాసారంబ వీవు;
భంగసంగతమహాపాథోధియందుఁ
గాంచనరత్నసంగతనౌక వీవు;
నాహృదయేశ్వరీ! నాజీవధనమ!
ఐహికజీవనయాత్రలయందు
అతిఘోరసంసారయాతనలందు
వివిధసుఖస్వరూపిణి వీవెసుమ్మ!

౨

చిరకాలదారిద్ర్యచింతలచేత
నలసిననిఱుపేద కబ్బినయట్టి
యతులితామూల్యరత్నావళియట్లు,—
చిరకాలము వియోగచింతలచేత
బడలినవానికి భాగ్యంబుకల్మి
నానందరూపమై యమరినయట్టి
నిజసతీసంయోగనిమిషంబుభాతి,—
చిరకాలము విదేశసేవలయందుఁ
దిరిగెడువాని కదృష్టంబుపేర్మి

నాకస్మికంబుగా నబ్బినయట్టి
స్వస్థానబాంధవసంయోగమట్లు,—
చిరకాలవైధవ్యచింతలఁగుందు
సాధ్వీమతల్లికి స్వప్నంబునందుఁ
గలిగినభర్తృసాక్షాత్కారమట్లు—
ప్రాపంచికామోఘఫల మైననీవు
ప్రేమానుబంధరూపిణి వైననీవు
ఆనందమయవిగ్రహం బైననీవు
విమలసుఖస్వరూపిణి వైననీవు
అస్మదీయార్ధాంగి వగుభాగ్య మబ్బె
హృదయేశ్వరీ! యింక నేమి గావలయు!

3

దారుణగ్రీష్మప్రతాపంబునందుఁ
బత్త్రిశోభితపాదపస్థలమందు
నదమలశీతలచ్ఛాయవు నీవు;
అమితశీతనివారణాగ్నివి నీవు;
వర్షాంబుబాధాతపత్రంబ వీవు;
నవ్యవసంతసూనంబవు నీవు;
సద్రూపకాంతివిశాలాక్షి వీవు;
అస్మదీయవిలీలిమాకాశమందు

శారదపూర్ణిమాశశిబింబ మీవు;
ఘనతరశోకాంధకారంబునకును
గమనీయదరహాసకౌముది వీవు;
నాహృదయేశ్వరీ! నాజీవధనమ!
అతిఘోరసంసారయాతనలందు
వివిధసుఖస్వరూపిణి వీవె చూవె
తనుమనోజ్ఞైకచందనచర్చవీవు
పరిసవవినిర్మితవ్యజనంబ వీవు
నేత్రానుకూలకనీనిక వీవు
దేహనిశ్వాసపరిదీపిక వీవు
మానసానందైకమధువృష్టి వీవు
సుప్త్యంతరస్వప్నసుఖలక్ష్మి వీవు
జాగ్రదిచ్ఛామహాశక్తివి నీవు
ఐహికయాత్రాసహాయవు నీవు
సంసారవిపదైకసాంత్వన వీవు
వివిధసుఖస్వరూపిణివైన నీవు
నారీశిరోమణీ! నాకేమి గావు?
నాహృదయేశ్వరీ! నాజీవధనమ!
నీకొఱ కెవ్వాడు నే సహియింతు
నతిఘోరసంసారయాతన లెల్ల!

(28-3-16.)

# 53 అనంతవాహిని.

"ఈఁదుకొని పోవుచున్ననీ వెవరు పూవ!"

అమలజలపూరితప్రవాహంబునందుఁ
బ్రవిమలతరంగమాలికావళులయందు
సలలితమనోజ్ఞపల్లవాసనమునందు
నొంటిగా నుండి యీఁదుచు నున్నయట్టి
నీ వెవరు చెప్పవా నాకుఁ బూవుఁబోఁణి!
ఏవనంబున వికసించినావొ నీవు?
ఏలతాగ్రంబునం దుదయించినావొ?
ఏలతాశాఖనుండి యేగాలిదొంగ
యెత్తుకొనివచ్చి ని న్నిలయించినాఁడొ?
క్రొవ్వి యెవ్వారు నినుఁ జిన్నికొమ్మనుండి
త్రుంచి యిట వైచినారొ? నాతో వచింపు
మేల దాఁచెదు సుమసుందరీలలామ!
ఎవరు తెచ్చిరి నిన్ను నీయేటిదరికి
ఏకులమువారికన్యక వీవు బాల?
పూవుఁగొమ్మకుఁ బాపి యేపుణ్యమూర్తి
కనికరము లేక యీజలగర్భమునకు

నెట్టు లర్పించె నిను వచియింపఁగదవె!
లలితమోహనమూర్తి! నెచ్చెలులఁ బాసి
యెట్టు లొంటిగా నీయేట నీఁదుచుంటి
వేమి శోకించుచునుండె నా కెఱుఁగఁజెపుము!
అంబుదంబులనడుమ విహంగమట్టు
లున్నతాకాశమున వెలుఁగొందు నీవు
ఎట్టు లీఁదుచునుంటి వీ యేటినీటఁ
జిన్నినక్షత్రమా! నాకుఁ జెప్పఁగదవె
నీటివేగంబునకుఁ దొట్రుపాటుఁ గనుచు
విషమగతి వీచుగాలిలో వెడలలేక
కాలవాహిని నెదటికిఁ గదలుచుంటి
వేల చెప్పవు నాకు రత్నాలనౌక?
పొంగుపాటున నేఁ డీతరంగరాశి
నిన్నుఁ గన్గొని కడు నవ్వుచున్న దకట!
ఒంటిగా నీఁదుకొనిపోవుచుంటి వేమి?
అబల వెదటికిఁ బోయెద వక్కటకట!
ఈయనంతప్రవాహంబు నీఁదుకొనుచు
నీమహాకాలవాహిని నీఁదుకొనుచు
నెంతొకౌతుకమున వేగ మేఁగుచున్న
నీ వెవరొ చెప్పవా నాకుఁ బూవుఁబోణి?

ఈఁదుకొని పోవుచున్న నీ వెవరు పూవ ?
ఈఁదుకొని పోవుచున్న నే నెవరె పూవ ?
నీవలెనె కాలనదిలోన నేనుగూడ
ననుదినం బిట్లులే యీఁదులాడుచుంటి
నెంతో లోఁతగు నీపెద్దయేటియందు
నతిభయంకర మగుతరంగాళియందు
నెవరు నన్నిట్లు త్రోసిరో యే నెఱుంగ,
మునిఁగి తేలుచు నిటుగొట్టుకొనుచు నుంటి
నొడ్డునకుఁ జేరుటన నెప్పుడో యెఱుంగఁ
దీరమున్నదియో లేదో తెలియనేర
నిట్టు లెన్నాళ్లు లుండుటో యెఱుఁగనేరఁ
గాని, నే నొక్కమాట నీకడ వచింతు
నలరుఁదొయ్యలి ! నామాట నాలకించి
యెచటి కేఁగెదవో యట యేఁగు మపుడు.
నీమతంబునఁ జూడంగ నిశ్చయముగఁ
బుష్పసుందరి ! నేనును బూవనెనుమి !
నీవలెనె కొమ్మనుండియే నేనుగూడఁ
దుంపఁబడి యీమహానదిఁ ద్రోయఁబడితి.
కట్టువడియుంటి నాశానిగళముచేత
నేను గూలంబునకుఁ బోవు టెట్లు లింక ?

నీమతంబునఁ జూడంగ నేనుగూడఁ
బుష్పగుచ్ఛంబ నీవంటి పూవనగుట
నాకులత నందుచుంటి నీయలలయందు.
పూవ ! యీఁదుచునుంటివి నీవుగూడ
నొడ్డునకుఁ జేర్పలేరు ని న్నొక్కరైన
నేనుగూడ జలంబుల నీఁదుచుంటి
నొడ్డునకుఁ జేర్పలేరు న న్నొక్కరైనఁ
బుష్పసుందరి ! వెనుసూడఁబోకు మింక
నిరువురముగూడఁ గలిసితి మేకవృత్తి
నిరువురముగూడఁ బోవుద మేకవృత్తి
నిరువుర మనంతలక్ష్యంబు నెడద నుంచి
యిరువుర మనంతవాహిని నీఁదికొనుచుఁ
గలసిపోద మనంతసాగరమునందు.

(9-4-1916.)

## 54 కరుణము.

నింగినుండి వెలుంగు నెలబాలుముంచి
కటిచీకటిగుంపు గ్రమ్మినయపుడు,
గుజ్జుగొమ్మమెలంగు కోకిలఁ దన్ని
కాకి కాకాయని కదిసినయపుడు
కనులున్నవారు నెమ్మనమున్నవారు
సుఖదుఃఖముల రుచిచూచినవారు
మంచి, చెడ్డ లెఱింగి మసలెడివారు
విడువకయుందురే వేఁడినిట్టూర్పు?—
మార్గఁబండిన తీయమావిలేఁగున్నఁ
గమలింపఁ గార్చిచ్చు గవియుటఁ జూచి
పాల్గారుచనుకట్ల బాలెంతకపిలఁ
బొలియింపఁ జెలరేఁగు పులితీరుఁ జూచి
వెచ్చనికన్నీరు విడువకయుండఁ
గలుగునే యెంతటి కఠినాత్ముఁడైన?
ఉరియాడు వేఁడినిట్టూర్పు గాడుపులు
గడుఁబొంగు నులివెచ్చని కన్నీటియేళ్లు
సామాన్యములుగావు; జగతిఁ గలంపఁ
గల వెంతపనియైనఁ గావింపఁగలవు.

(10-4-16.)

# 55 భావగీతములు.

ఎలనవ్వు దొలఁకాడునిల్లాలి మోముఁ
గరుణార్ద్రమగు నాథుకడకంటిచూపు
నేయింటనిరతంబు నేకమై యుండు
నాయింటనే శాంతి యలరారుచుండు.

---

అందియాందనికొమ్మ యమృతఫలంబు
నబ్బియబ్బనిచోటి యబ్రింపులిబ్బి
యగపడనేనియు నాసలఁ గొలిపి
కలఁపకమానునే కడ కెట్టులైన?

అంతరంగికభావ మాకృతిఁ దాల్చి
యక్షరంబులలోన నగపడ్డవేళ
నాకస్మికంబుగా ననుకూలమతుల
భావ మాకర్షింపఁబడినట్టివేళఁ
జిత్తమేకాగ్రతఁ జెందినవేళ
జీవచైతన్యంబు చిత్రమై పోవు.

(7-5-1916.)

# 56 జాతీయగీతము.

రత్నాకరావగాహనము.

౧

శంకరతూణీర ! సరసవిహార !
వరతరంగసనాథ ! వాహినీనాథ !
ఘనజీవనాధార ! గంభీరసార !
శరదూపఘన తేజ ! సాగరరాజ !
పుణ్యుల మాపూర్వ పురుషులఁగూర్చి
మహితవిక్రములగు మావారిఁగూర్చి
పేరుగన్నట్టి మాపెద్దలఁగూర్చి
ఆర్యులగు పురాతనాంధ్రులఁగూర్చి
వారలకీర్తి వైభవలక్ష్మిఁగూర్చి
వారల పుణ్యప్రవర్తనఁ గూర్చి
వారలధర్మతత్పరతనుగూర్చి
వారలవిజ్ఞానవల్లరిఁగూర్చి
ఆదికాలమునుండి యాఁగకయుండ
ఎంతో కాలమునుండి యెడతెగకుండఁ
గర్ణపేయంబుగా గానంబుసేయు
చున్నాఁడ వని వినుచున్నాము గాన

మాపూర్వసంచిత మాణిక్యరాశి
నుదరంబులో దాఁచి యుంచితి గాన
నీలోనఁ గుంకి వినిర్మలవృత్తి
మారత్నములఁ బొందుమమతచే నిందు
వచ్చితి మీవేళ వైభవం బెసఁగ
మాకోర్కులను దీర్పుమా ! దయ యుంచి
రమణీయగుణసాంద్ర ! రత్నాకరేంద్ర!

౨

పతితపావన ! యోకృపావార్ధి ! నీవు
పతితుల మగుమమ్ముఁ బాలింతు పనియుఁ
బాపపంకిలమును బాపుదు వనియు
నజ్ఞానతిమిరంబు నడఁగింతు వనియు
సుజ్ఞానతేజంబుఁ జూపుదు వనియు
మాతాతదండ్రులు మాపెద్ద లెల్ల
నిను నమ్మి యూనాఁడు నీ కిచ్చి చన్న
మారత్ననిచయంబు మా కిత్తు వనియు
స్నానమాడఁగ వచ్చినారము గాని
ధ్యానమాడఁగ వచ్చినారము గాని
ఆకుంభసంభవుచటు లోకు మాకై
దప్పికై నినుఁబట్టి త్రాగ రాలేదు

బృందారకాసురబృందంబుఁబోలెఁ
డెంపుమై నిన్ను మథింప రాలేదు
రాజసవృత్తి శ్రీరఘురామునట్లు
గ్రూరాస్త్రముల నిన్నుఁ గొట్ట రాలేదు
సగరపుత్త్రులవలె సని చెడి మేము
తటినీశ ! నీయిల్లు దవ్వ రాలేదు,
అటుగాన మాయెడ నాదర ముంచి
ప్రస్ఫురసదృశతరంగహస్తముల
వలయింపఁగాఁ బోకుమయ్య ! మమ్ములను
రమణీయగుణసాంద్ర ! రత్నాకరేంద్ర !

3

ఆమహావిష్ణున కత్యాదరమున
నిందిరారత్నంబు నిచ్చితి వనియు,
ఆయమరేంద్రున కత్యాదరమున
నిభరాజరత్నంబు నిచ్చితి వనియు
ఆపార్వతీపతి కత్యాదరమున
నిందుమహారత్న మిచ్చితి వనియుఁ
గౌస్తుభమణియును గామధేనువును
గల్పవృక్షంబును గడుఁబ్రీతితోడ
దానమిచ్చిన మహోదారుఁడ వనియు

నత్యాదరంబున నమృతభాండంబు
నర్థుల కిడిన మహోదాత వనియు
నాత్మ నెఱింగి ని న్నర్థింతు మిపుడు
ఆదరవృత్తి ని న్నడిగెద మిపుడు
మారత్ననిచయంబు మా కిమ్మటంచు
రమణీయగుణసాంద్ర ! రత్నాకరేంద్ర !

# జాతీయగీతము.

ఏమహాపూరుషుం డుదయించుకతన
నేమహారాజమూర్ధన్యుఁ డేలుకతన
నాంధ్రదేశంబు నాఁగ నీయవని వెలసె
నామహాభాగు*నాంధ్రి నాయాత్మఁ దలఁతు.

*"యయాతివంశంబున***బలి పుట్టె. ఆబలితలన నంగవంగకళింగసింహళపుండ్రాంధ్రులను పేళ్లుగలవా రార్వురు కొమాళ్లు పుట్టిరి. వారు తూర్పుదేశంబులకు రాజులై తక్కినదేశంబులకుఁ దమతమనామధేయంబు లిడి రేలిరి." శ్రీమదాంధ్రభాగవతము—నవమస్కంధము. చేతి 706—678 వచనము.

౧

ధన్యుఁడవు ! ధన్యుఁడవు ! నీవు ధన్యతముఁడ
వనఘ ! చిరకాలనిశ్శబ్ద మైనయట్టి
అమల మైనట్టి నీగృహమందు నేఁడు
శ్రుతిసుఖావహ మైన సుశ్లోక మొకటి
నూతనంబైన జాతీయగీత మొకటి
రాజితంబైన కలకంఠరవముతోడ
నమరతంత్రీస్వనంబుతో నైక్యమంది
వేణునాదంబుతో సమవృత్తిఁ బూని
వినఁబడుచునుండె వీనులవిందు గాఁగ,
ఆలకించుచునుంటివా ! ఆంధ్రపుత్త్రి !—
మృదులపదముల నర్థంబు మేళవించి
అర్థములలోన భావంబు నైక్యపఱిచి
భావగతి సుస్వరంబులఁ బాదుకొలిపి
సుస్వరంబుల రాగంబు నూటిపఱిచి
ఏసరోజాక్షి యీమధుమాసమందు
ఏసుతాంగన యీపుణ్యవాసరముల
ఏమహాభారతీదేవి యీక్షణమున
విమలగానామృతరసంబు వెల్లిగొలిపి
యీమహాంధ్రమహోద్యాన మెల్లయెడలఁ

బల్లవింపంగ వికసింపఁ బరిమళింపఁ
జేయుచున్నదియో నీవు చెప్పఁగలవొ?
ఆలకించుచునుంటివా! ఆంధ్రపుత్త్రి!—

౨

నలుదిశలు చీఁకటులు గ్రమ్మునాఁడు లేఁగ
దినమణిని గప్పినట్టి దుర్దినము లేఁగెఁ
గారుమబ్బులు గ్రమ్మెడు కాల మేఁగెఁ
జదలు పిడుగులు గురిసెడి సమయ మేఁగ
నేళ్లు నూళ్లును నేకమౌ నేఁడు లేఁగెఁ
దటిద రాళహాసంబుల తరుణ మేఁగెఁ
గాలమేఘుంబు గర్జించు వేళ లేఁగ
నవని పంకిలమై యుండు నదను లేఁగ—
అదె ప్రభాతకాంతులు దోఁచె నరయు మిపుడు
సూర్యుఁ డుదయించెఁ దూర్పునఁ జూడుమిపుడు
ఆకసము నిర్మలం బయ్యె నరయు మిపుడు
కడల నెమ్మది వ్యాపించెఁ గాంచు మిపుడు
తోరమగు సింధుకూలంబు దోఁచె నిపుడు,
నిశ్చలత్వంబె యెల్లెడ నెగడె నిపుడు
అంతటను శాంతిరాజ్యమే యయ్యె నిపుడు
అవనిసతి సస్యశాలిని యయ్యె నిపుడు

అట్టియీవేళ నీయింట నాంధ్రపుత్త్రి!—
పాడిపంటలు గల వని ప్రతిదినంబు
వచ్చుచున్నార లతిథు లవ్వారి గాఁగ
నీవు సోమరితనమున లేవలేక
నీస్వధర్మంబు లన్నియు నీటఁ గలిపి
ఆర్యధర్మంబు లన్నియు నవలఁద్రోసి
ప్రాణిధర్మంబు లన్నియుఁ బాఱఁద్రోలి
స్వజనులను బోషణముసేయఁ జాల ననుచు
అతిథిపూజ లొనర్ప లేనైతి ననుచు
ఉదరపోషణమునకైన నోప ననుచు
వెలువడి కన్నుమోడ్పుఁగాఁ బోలునయ్య!
దీనజనములకును గామధేను వైన
అర్థిబృందంబులకును గల్పక మైన
పూర్వసంచిత విత్తప్రపూర్ణ మైన
పూర్వసౌభాగ్యగౌరవాపూర్ణ మైన
యిట్టినీగృహమందు నీకేమికొదవ?
యిట్టియీయూరియందు నీకేమికొదవ?
యిట్టినీభూమియందు నీకేమికొదవ?
యిట్టినీదేశమందు నీకేమికొదవ?
అలకించుచుంటివా! ఆంధ్రపుత్త్రి!—

3

ఏశరత్తున నొకజాతి యేపు గనెనొ
ఆశర త్తేఁగె నేఁడు మహాద్భుతముగ ;
ఏమహాశీతమున జగమెల్ల వడఁకె
నామహాశీత మేఁగె నేఁ డద్భుతముగ ;
ఏశిశిరమందుఁ గారాకులెల్లఁ బడెనొ
ఆశిశిరమేఁగె నేఁడు మహాద్భుతముగ ;
ఎట్టివేళ నీ కీనిద్ర పట్టినదియొ
అట్టివేళయుఁ బోయె నేఁ డద్భుతముగ
ఆలకించుచునుంటివా ! ఆంధ్రపుత్త్రి!—
ఉదయమందుచుఁ గ్రుంకుచు నున్నయట్టి
లలితమూర్తుల సూర్యచంద్రులను గనక
అందరాని నీలాకాశమందుఁ జేరి
నవ్వుచుండిన తారాగణంబుఁ గనక
అమలతరమైన మృదులతాగ్రమునఁ జేరి
పరిమళించుచునున్న పుష్పములఁ గనక
క్షితితలంబు పవిత్రంబుఁ జేసికొనుచు
నెపుడు ప్రవహించుచున్న వాహినులఁ గనక
అద్భుతంబుగ తెక్కలల్లార్చుకొనుచుఁ
జదలఁ దిరిగెడు విహగసంచయముఁ గనక

ఆత్మజీవనోపాయంబు నరసికొనుచు
తమను దిరిగెడు జంతుజాలములఁ గనక
సకలమును మోహమున ముంపఁజాలినట్టి
పరమసుందరిఁ బ్రకృతిదేవతను గనక
ఎన్నిసంవత్సరములు నీ వింతదనుక
గాఢనిద్రామహావస్థఁ గడపినావొ
ఉరుతరాజ్ఞానినై పడియుండినావొ
మఱపుమున్నిటిమడుగున మలఁగినావొ
ఇప్పుడైనను లెక్కించి చెప్పఁగలవొ ?
అలకించుచునుంటివా ! ఆంధ్రపుత్త్రి !—

౪

ఒడలు తెలియక నిద్రించుచున్నయపుడు
ఏమి యయ్యెనొ నీజాతి యెఱుఁగవుగద !
ఏమి యయ్యెనొ నీమత మెఱుఁగవుగద !
ఏమి యయ్యెనొ నీవేష మెఱుఁగవుగద !
ఏమి యయ్యెనొ నీభాష యెఱుఁగవుగద !
ఏమి యయ్యెనొ నీరూప మెఱుఁగవుగద !
ఏమి యయ్యెనొ నీపాల మెఱుఁగవుగద !
ఏమి యయ్యెనొ నీగృహ మెఱుఁగవుగద !
ఏమి యయ్యెనొ నీమాత యెఱుఁగవుగద !

పాఱఁజూడుము లేచి యీపాటికైనఁ
దోడివారలతో నీవు గూడిమాడి
తల్లి నర్చించి తత్ప్రసాదంబుకల్మి
అభ్యుదయపరంపరల నీవందుకొలుకు
ఆలసింపగఁబోకు మాంవంతమైన
ఆలకించుచునుంటివా? ఆంధ్రపుత్త్రి!—
ఏమహాజ్ఞానవశత నీవిట్టులైతో
ఏమహాశాపవశత నీవిట్టులైతో
ఏమహాపాపవశత నీవిట్టులైతో
ఏమహాకర్మవశత నీవిట్టులైతో
బుద్ధి నించుక యూహింపఁ బూనితేని
పూర్వదృష్టిని గని తలపోసితేని
మానసానుతాపంబున మఱిఁగెదేని
పూర్వకృతము నెఱుంగఁగాఁ బూనెదేని
అఖిలము నెఱుంగఁగా వచ్చు నంతలోనె
అఖిలయాతనలును బోవు నంతలోన
అఖిలపాపంబులును బోవు నంతలోన
అఖిలకర్మంబులు నశించు నంతలోనె
అమరవాక్యంబులను వీని నాదరమున
నాలకించుచునుంటివా! ఆంధ్రపుత్త్రి!

8—B

౫

పావనోద్యానమునఁ జేరి ప్రకృతిసూక్తి
చిన్నిశారిక చెప్పుచు నున్నయపుడు
చిగురుజొంపంబులోఁ జేరి నిగమసూక్తి
చిన్నికోయిల చెప్పుచు నున్నయపుడు
పుష్పగుచ్ఛంబుపైఁ జేరి పురుషసూక్తి
చిన్నితుమ్మెద చెప్పుచు నున్నయపుడు
ఫలగుళుచ్ఛంబుపైఁ జేరి పరమసూక్తి
చిన్నిరాచిల్క చెప్పుచు నున్నయపుడు
మేలిపరిమళముల ననుకూలసూక్తి
చిన్నివాయువుల్ చెప్పుచు నున్నయపుడు
ప్రేమబద్ధానురాగులై ప్రేమసూక్తి
వనరమామాధవులు తమవాంఛదీర
నుత్సుకతఁ బ్రొద్దుపుచ్చుచు నున్నయపుడు
సకలసౌభాగ్యమయశుభ సమయ మపుడు
మేలిసమయమప్పుడు నీవు మేలుకాంచి
తనయ ! శుభపరంపరలు నీకగునుగాక
అతిథిసత్కారమును జేయు మద నెఱింగి
ఇదియె నీకున్నసౌభాగ్య మెల్లమెడల
నిదియె నీకున్నగౌరవ మెల్లమెడల

నిదియె నీకున్నపితృధన మెల్లయెడల
నిదియె కావించుఁజుమ్మి నీయిష్టసిద్ధి
ఆలకించుచునుంటివా ! ఆంధ్రపుత్త్రి !—

పూర్వగౌరవమును బొందు పూన్కితోడఁ
బూర్వధర్మంబు లొనరించు పూన్కితోడఁ
బూర్వవిద్యలఁ బొందెడు పూన్కితోడఁ
బూర్వభోగంబులను బొందు పూన్కితోడఁ
బూర్వపురుషుల మర్యాద బుద్ధినెంచి
పూర్వపురుషుల చర్యల బుద్ధినెంచి
నీదు విధ్యుక్తధర్మంబు నీవెఱింగి
నీకు సన్మతధర్మంబు నీవెఱింగి
నీదు జాత్యుక్తధర్మంబు నీవెఱింగి
నీకు మానవధర్మంబు నీవెఱింగి
కోవిదుండని యనిపించుకొనెదవేని
గొప్పమతకర్త వనిపించుకొనెదవేని
కులమహారత్న మనిపించుకొనెదవేని
మనుజవర్యుండ వనిపించుకొనెదవేని
ఆత్మవేషంబు మార్పకుమయ్య ! యెపుడు
ఆలకించుచునుంటివా ! ఆంధ్రపుత్త్రి !—





౭

మఱవఁగారానిశత్రుల మఱతుగాక
మఱవఁగారాని మిత్రుల మఱతుగాక
మఱవఁగారానిబిడ్డల మఱతుగాక
మఱవఁగారానిప్రియురాలి మఱతుగాక
మాతృదేశంబు మఱవకుమా ! కుమార !
మాతృభాషను మఱవకుమా ! కుమార !
మాతృభూమిని మఱవకుమా ! కుమార !
మాతృదేవత మఱవకుమా ! కుమార !

(21-4-16.)



# 57 పూర్వస్మృతి.

ఆమనోజ్ఞబృందావనమందు మనము
ఆమహాయమునానదియందు మనము
ఆవినూతనవీచికలందు మనము
ఆనికుంజాంతరంబులయందు మనము
ఆపరిమళవాయువులందు మనము
ఆనవీనశరద్రాత్రులందు మనము
ఆసుధామయచంద్రికలందు మనము
తిరిగి విహరించి ఖేలనోద్రిక్తమతిని
గూడి చరియించి సుఖములఁ గొల్లలాడి
యేకవృత్తి దినంబు లనేకమట్లు
నిమిషములయట్లు జరపిననియతి యెల్లఁ
బ్రాణనాయక ! యేమఱుపాటునైనఁ
దలఁచుకొనఁబోకుమయ్య ! చిత్తంబునందు—.
హామనోహర ! హతభాగ్యనైననాకు
ఆమనోహరవేణుగానారవంబు
ఆమనోహరపదనూపురారవంబు
ఆమనోహరమృదులకంఠారవంబు
ఇంక వినరాక యుండిన నేమిగాని

ఆమహోద్యానచంచరీకారవంబు
ఆమహాయమునాతరంగారవంబు
ఆశకుంతసంతానకంతారవంబు
ప్రాణనాయక! యేమఱుపాటునైన
దలఁచుకొనఁబోకుమయ్య! చిత్తంబునందు—
ఆసముజ్జ్వలయమునాజలాంతరమున
మునుఁగలేనైతి నకట! నే ముందుగాని;
ఆవినీలతమాలవృక్షాంతరమునఁ
జేరలేనైతి నకట! నాజీవితమున;
ఆమనోహరనీలమేఘాంతరమున
నైక్య మొందంగలే నైతి నక్కటకట!
ఐన నేమాయె నీకు నాయానసుమ్ము!
ఆమహోగ్రోర్మికావళి నైనఁగాని
ఆయభాగినిమాలతి నైనఁగాని
ఆనికృష్టతటిల్లత నైనఁగాని
ఒంటిపాటున విభ్రాంతి నొందియైనఁ
బ్రాణనాయక! యేమఱుపాటునైనఁ
దలఁచుకొనఁబోకుమయ్య! చిత్తంబునందు—

(27-4-16.)

# 58 పశ్చాత్తాపము.

అపరాధ మధికమై యది యాచరించిన
యెడ నోర్మియే కానఁబడినయపుడు
నవకారమునకుఁ బ్రత్యపకార మందక
యుపకృతియే గాంచి యున్నయపుడు
దోషంబు తీవ్రమై తుదిదాఁక దండన
మనుమాటయే కనుఁగొననియపుడుఁ
దప్పయ్యె ననుచుఁ జిత్తము వేఁగుచుండఁగా
నవసాన మాసన్న మైనయపుడు
సన్నిపాతదుష్టజ్వరజ్వాలకంటెఁ
గాలకూటవిషాభీలకీలకంటె
నొకట సర్వేంద్రియంబుల నుడుకఁజేయఁ
గలుగునట్టిపశ్చాత్తాప మలమకున్నె ?

గీ. దినము రే యనుభేదంబు దెలియకుండ
గగనమున దట్టముగ మబ్బు గ్రమ్మియుండె
గడియ కొకనిముసంబైన విడువకుండఁ
గుంభవృష్టిగ వర్షంబు గురియుచుండె.

గీ. ప్రకృతి యంతయు బ్రుంగుడువడుచునుండెఁ
ప్రాణు లన్నియు నలజడిపడుచునుండె
ధరణి కాకాశమున కొక్కధార గాఁగ
నఖిలము జలార్ణవము సేయునట్టు లుండె.

గీ. అట్టిదుర్దిన మవసిత మైనవేళ
మబ్బుచాఁటుననే ప్రొద్దు మడఁగువేళఁ
గటికిచీకటి కెట్టించి కవియువేళఁ
గాళరాత్రి విశ్వాకృతిఁ గాచువేళ.

గీ. విజయనగరంబునం దొక్కవీథియందు
బ్రాహ్మణోచిత మగునొక్కభవనమందు
గద్దలము లేకయున్నయొక్కగదియందుఁ
బాలనురువును బోలినపడకయందు.

గీ. కెరలునూనియలోఁ బేలగింజవోలెఁ
గుములుబూడిదలోఁ బూవుఁగొమ్మవోలె
నుండి యుండఁగఁ జాలక యున్న రనుచుఁ
దరుణి యొక్కతె పన్నుండి పొరలుచుండె.

సీ. ఆమొగం బొకయప్పు డలరులేనగవుల
మించువెన్నెలలఁ గాయించినదియొ
ఆమూపు లొకయప్పు డగపడ్డవారల
యుల్లంబు లుఱ్ఱూఁత లూఁచినవియొ

ఆమోవి యొకయప్పు డమృతంబుఁ బలుకుల
పంచదారలఁ గ్రుమ్మరించినదియె
ఆరూప మొకయప్పు డంగనామండలి
నగ్రాసనాసీన మైననదియె
కాని యానాళు లీనాళ్లు కావు కావు
కటకటా ! చూచుచుండఁగాఁ గానఁబడక
కాలగతిఁబట్టి కర్మసంగతినిబట్టి
పూర్వగతు లన్నియును మాఱిపోవుచుండు.

గీ. కునుకునెలరేకచెంగట మినుకుమనుచుఁ
జూపులకుఁ దోఁచి తోఁపని చుక్కవోలె
నామెలఁతచెంత నైదేండ్లయీడుబిడ్డ
యొక్కచిటిచాపమీఁదఁ గూర్చుండి యుండె.

గీ. కాచదీపంబు వెన్నెల గాయుచుండ
బడలి ప్రాణావశిష్టమా నొడలితోడ
శయ్యపైఁ బండియున్న యాచానయపుడు
మరణవేదన మలమల మరఁగుచుండె.

చ. ఒకపరి బిడ్డఁ గాంచి కను
నుమ్మలికమ్మన వెచ్చనూర్చి వే
ఱొకదెస కొత్తగిల్లి కను
లుబ్బఁగ వెక్కుచు నేడ్చుఁ జేతు లిం

చుక పయికెత్తి దివ్యదేసఁ
జూచి నమస్కృతు లాచరించు నా
సికపయిఁ దర్జనిం బఱపి
సీ! సుమతీ యను నీకేలుంగునన్.

క. నిలువున నీర్రై హైపుల
కలు గ్రమ్మఁగ నంగకములు గడగడ వడఁకన్
వెలవెల్లనగుచుఁ దనలో
పలఁ దా గొణఁగుకొను నిటలబద్ధాంజలియై.

క. ఎత్తినయంజలిబంధం
బెత్తినయట్లుండ ముకుళితేక్షణయై యు
ద్వృత్తగ నొకింతలోనన
తత్తఱపడి లేచు దేవ! దయఁ గనుమనుచున్.

గీ. అనఁగ వినరానియట్టిదుష్టామయమున
నామెసర్వాంగకంబు లల్లాడుచుండ
నాడి చెప్పఁగరాని తాపానలంబు
రగులుకొనసాగె శుష్కాంతరంగమందు.

గీ. తెలివి గలవారు మంచిపెద్దలతెఱంగు
లెఱుఁగఁగలవార లొకయప్పు డెట్టులున్న
నొక్కయపుడైనఁ దొల్లింటి యునికిఁగూర్చి
వనరి తముఁ దాము నిందించుకొనకపోరు.

గీ. అవనిగర్భంబునందున్న యనల ముబికి
గిరుల భేదించి కరఁగించి కెరలునట్లు
లంతరంగంబునం దోఁచునసల మేచి
వనితసర్వాంగములఁ గాల్చివైచుచుండె.

చ. నిలిచినచోటు చూచికొన
నిష్ఠురదావశిఖాకలాపసం
కలితము, వెన్క సాంద్రితర
కంటకదుర్గమఘోరకాననా
విల, మిఁక ముందు దుస్తరగ
భీరవిషార్ణవ, మేమి సేయఁగాఁ
గల? దెటు వోయి తా బ్రదుకఁ
గాఁ గల దంగన యక్కటక్కటా!

గీ. దుర్భరదురంతయాతనఁ దూలితూలి
యలసి కన్నులు మూసినయంతలోనె
కడఁ గాఢాంధకారంబు గ్రమ్మినట్లు
లశనిపాతసహస్రంబు లైనయట్లు.

గీ. నీలమేఘంబు లుడుకునూనియలధార
లోక్కరీతిగ వర్షించుచున్నయట్లు
కాలమూర్తులు భీకరాకారులైన
భటులు దను ముట్టడించి పైఁబడినయట్లు.

గీ. అడుగు వెట్టుట కెంతైన నెడము లేక
తీవ్రవిషపుచ్ఛములతోడి తేళ్లగములు
గరళముం గ్రక్కువిషభుజంగములగములు
నగడి బ్రహ్మాండ మెల్లెడ నిండినట్లు.

గీ. ఘోరరాక్షసియొక్క తె నోరు తెఱచి
పావకజ్వాలఁ దనమీఁదఁ బఱపినట్లు
దోఁచి భయమును దుఃఖంబు దుస్సహాను
తాపముం గూర్ప నాకాంత తల్లడిల్లి.

గీ. ఆత్మపాపఫలం బిట్టు లయ్యె ననుచుఁ
దెలిసి యెలుఁగెత్తి యేడ్చుచు దిగులు మిగుల
నఘవినాశనుఁ డైన దేవాదిదేవుఁ
గూర్చి మొఱవెట్టుకొనసాగె గొంతువాయ.

క. తనశక్తి కతీతంబై
ఘనసాహాయ్యమున నడఁపఁగా రానిదియై
పొనరినకష్టంబున దే
వునిచరణముకంటె నొండు ప్రోవున్నదియే.

గీ. కనియొ కానకో పెడదారిఁ జనినవారు
చచ్చునప్పుడో కష్టంబు వచ్చునపుడో
స్వాంతమందైన నొకపు డీశ్వరునిఁగూర్చి
యొక్కపరి మొఱ్ఱ యిడకుండ నుండలేరు.

గీ. గాఢపుటపాకమునఁ గ్రాఁగి క్రాఁగి కాని
చెడినబంగారు నెఱవన్నెఁ బడయునట్లు
కఠినపశ్చాత్పరీతాపకలనఁగాని
కలుషహృదయాంతరంబు నిర్మలముగాదు.

గీ. తరుణి తనపాపవృత్తంబుఁ దలఁచి తలఁచి
వనరి వనరి పశ్చాత్తాపవహ్నిఁ గ్రాఁగి
క్రాఁగి తీవ్రమనఃపూర్వకంబు గాఁగ
దేవదేవునిఁగూర్చి ప్రార్థించుచుండ.

గీ. ఇతరచింతలేక యేకాగ్రత వహించి
నిశ్చలముగ మనసు నిలుచుకతన
దివ్యతేజమందు దివ్యమంగళవిగ్ర
హం బొకండు దోఁచినట్టు లయ్యె.

గీ. భయము వదలిపోయెఁ బరితాపము నశించె
స్వాంతవీథి సుప్రశాంత మయ్యె
నంతరంగమందె యామూర్తిఁ గనుఁగొని
పడఁతి యిట్లు విన్నపంబుఁ జేసె.

గీ. "ఓమహానుభావ! యోసర్వరక్షక!
యోదయానిధాన! యోమహాత్మ!
యోయనాథనాథ! యోలోకపూజిత
పాదపద్మ! నీకు వందనములు.

ఉ. దారుణనీచమోహపరి
తాపమున న్నిలుపోపలేక దు
ర్వారమనోవికారమునఁ
బాపభయం బొకయింతలే కతి
క్రూరముగాఁగ నేనొడ ల
ఱుంగక చేసితి నెంతశిక్షకుం
దీరనినేరమున్ ; ద్విజగ
తీపరిపాలననిత్యతత్పరా !

సీ. కర్కశకాలకింకరఘోరదారుణ
సంఘర్షణమునకు జంకి కాదు
కలుషదుర్గంధసంకలితమై యడరువై
తరణీస్రవంతిని దలఁచి కాదు
నగుఁబాటుగాఁ బ్రేతనాథుకొల్వునఁ దప్పుఁ
దనుదాన దెల్పుకోఁ దలఁకి కాదు
పలపలనుడుకునూనెలతోడిలోహంపుఁ
బెనములగములకు బెదరి కాదు
నామనశ్శాంతికొఱకయి నాతెఱంగుఁ
దెలుపుకొనుచుంటి నీకు నోదేవదేవ !
నామనస్తాపమునకంటె నరక మంత
కష్టతమ మైనయది కాదు కా దెఱుఁగుము.

క. నను మన్నించెద వని నె
మ్మనమున నాసించి కాదు మత్పాపఫలం
బనుభావ్యము ; యెఱుఁగుదు నై
నను వినిపింతు వినుమయ్య నాగతి దేవా !

క. కరకలితామృతకలశము
చిరతరపుణ్యపరిపాకచింతామణి బం
ధురకల్పకప్రసూనము
కరణిఁ బ్రియుఁడు దొరకె భాగ్యకలన న్నాకున్.

క. చెలువుఁడు నేనును జక్కని
చిలుకయుఁ గొరవంకలాగు చిత్తము లలరన్
మెలఁగితిమి కొన్నినా ళ్లి
మ్ముల మముఁగనువారలెంతొ ముచ్చటపడఁగన్.

క. చెలువలమానసములె చం
చలము లగుచు నుండ మోహఝంఝానిలము
ల్లల నాడింపఁగ నేగతి
నిలువఁగలవు చెదరకుండ నిలిచినచోటన్?

గీ. అమృత మింట నుండ నంబటి కాసించి
వేడ్కపడెడునట్టి వెఱ్ఱివోలెఁ
బ్రాణభర్త యుండఁ బై మెఱుంగులవిట
కాండ్ర కాసపడితిఁ గామవశత.

గీ. ప్రాణ మిచ్చుచు నున్ననాభర్త మొఱఁగి
యతనిప్రచ్ఛన్నశత్రుఁ డైనట్టివాని
నమృతముఖవిషకుంభ మైనట్టివానిఁ
జేరి నావిటకానిఁగాఁ జేసికొంటి.

గీ. నన్ను సౌశీల్యవతినిగా నమ్మియున్న
నామనోనాయకుఁడు నా కనారతంబు
నెల్లవిధముల స్వేచ్ఛయే యిచ్చెఁగాని
యెపుడు నవరోధ మనుమాటయెఱుఁగఁడయ్యె.

సీ. పలుకుల నమృతంబుఁ జిలుకరించెనె కాని
కటువుగా నెప్పుడైన గదుమలేదు
చూపులతోఁ బ్రేమ చూఱలిచ్చెనె కాని
కోపంబు నెప్పుడైనఁ జూపలేదు
మనసార నాతోడ నెనసియుండెనె కాని
పొలయలుక నెప్పుడైనఁ బూనలేదు
అడుగు దాఁటకయుండ నాదరించెనె కాని
యడిగిన దెపుడు లేదనఁగలేదు
మనసు కలసినకొన్నాళ్ళమాట కేమి
మనసు వచ్చినరీతిగా మసలునప్పు
డైన నానాథుఁ డనుమాన మందకుండెఁ
జనియెనేకాని సుంతైనఁ గినియలేదు.

గీ. విటునిదుర్బోధనంబుల విని యొకర్తు
భర్తకు విషంబుఁ బెట్టితిఁ బాప మనక
దైవవశమున మరణంబు దప్పిపోయె
శ్రీయములె గల్గుఁగాదె యమాయకులకు.

గీ. కన్నుఁ గప్పియున్న కామవశంబునఁ
జేసినట్టి దుష్ట చేష్టితంబు
విఫల మగుచుఁ బోవ వెండియు నేనట్టి
పాప మాచరింప భయముపడితి.

సీ. చెలువంపుముద్దుల చిన్నిబిడ్డను గన్న
తండ్రిగదా యని దయఁ దలంచి
మరియాద లెటులున్న మగవా లనెడిమాట
పోదుగదా యని బుద్ధి నెంచి
స్వైరిణి యనుపెద్ద పేరు మోయుట చాల
బరువుగదా యని భయముఁ జెంది
యభ్యంతరము వచ్చునప్పు డొండొకతోవ
కలదుగదా యను తెలివి గలిగి
యడఁగి యుంటినిగాని నన్నలమికొనిన
నీచమోహవికారంబు నిశ్చయముగ
నెంతపాపంబునైనఁ జేయింపలేదె
దివ్యదృష్టిప్రభావ! యోదేవదేవ!

గీ. ఇట్లు కొంత కాల మేఁగినతరువాత
నన్ను నమ్మియున్న నాప్రియుండు
విటునియింట నన్ను విడిచి పరీక్షకుఁ
జదువుకొనఁగఁ బోయెఁ జన్నపురికి.

గీ. చాలినన్ని ధనపుసంచులు గల వింటఁ
గోరికొనుట కేమి కొదవలేదు
పీడవదలినట్లు విభుఁడు పోయె నటంచుఁ
జంక వైచికొంటి సంతసమున.

గీ. కామరోగ మెంత కనుగాననీయదో
యట్లె తృప్తిఁగూడ నందనీయ
దవు డొకింత తెలిసినదైనంత మునుపటి
విటునికన్నుఁ గప్పి వెదకి వెదకి.

గీ. ఒక్క చెదరిపోవ నుదుటున విరఁబాఱి
బహుముఖములఁ బోవు వఱదవోలె
మగఁడు వదలిపోవ నగపడ్డమగవారి
నెల్ల విటులఁగాఁగ నేలుకొంటి.

గీ. అఖిలభూతాధినాథ ! మహానుభావ !
యేమి చెప్పుదుఁ గొన్నాళ్ల కిహమునందె
ఘనతరాహస్యదుష్టరోగముల పేరఁ
బాపఫల మంతయునుగూడఁ బడయగంటి.

గీ. ప్రియుఁ డొసంగినధనమెల్ల వెచ్చ మయ్యెఁ
బోగ రడంగెను నెమ్మది నెగులు మిగిలెఁ
గన్నుఁ దెఱవని యైదేండ్ల చిన్నిబిడ్డ
బెదరి తనతండ్రికై బెంగపెట్టుకొనియె.

గీ. నన్నుఁ దొలుదొల్తఁ జెఱిచిన నావిటుండు
మరల నామూలముననె దుర్భరమహోగ్ర
రోగపరిపీడితుం డయి లోఁగిలోఁగి
కడకు మృత్యుకరాళవక్త్రమునఁ బడియె.

గీ. తనకుఁ బ్రియమిత్రుఁ డని మదిఁ దలఁచుచున్న
నావిటునిమృత్యువార్తయు నాతెఱంగు
విని దయామయుఁ డైననావిభుఁడు ధూమ
యానమున నింటి కిప్పుడే యరుగుదెంచి.

గీ. నన్నుఁ జేర వచ్చి కన్నీరు మున్నీరు
గాఁగ గొంతసేపు గాంచి యేడ్చి
బిడ్డ నెత్తి ముద్దువెట్టి చట్టన దించి
చనియె నిపుడె వైద్యసదనమునకు.

గీ. ఎంతయమృతహృదయ మెంతయమాయిక
సుస్వభావ మెంత శుద్ధశాంత
మెంత కరుణ ప్రేమ మెంతయో ప్రియునకుఁ
గొలఁది వెట్టి చెప్పఁగలనె నేను.

గీ. అట్టిదై వస్త్రరూపున కట్టివిభున
కట్టిపూజ్యున కట్టిపాపనాధికునకుఁ
దప్పుఁ జేసితి నింక నాతనికి ప్రియోప
చారములఁ గాంచ నేనోపఁజాలనయ్య!

గీ. అతఁడు మరల నింట నడుగుపెట్టకయుండఁ
బ్రేమమీఱఁ బలుకరింపకుండ
దేవదేవ! నాకు దేహానఁ దపియించు
జీవనంబు నింకఁజేయు మయ్య.

గీ. జగతి నెడసి పోవ శాశ్వతనరకంబు
నాకుఁ గలదు గాన నన్నుఁ జంపి
యిహపరముల నెందు నెప్పుడు నానాథు
కంటఁ బడకయుండఁ గావు మయ్య!

క. అని యీగతిఁ బరిదేవన
మొనరించుచు నీశుపాదయుగ్మముచెంతన్
దనయంజలి నిడి సాష్టాం
గనిపాతముగాఁగఁ బడియెఁ గంపము గదురన్.

గీ. కన్ను లెదరిపోయె ఘనఘనాఘనమున
మెఱపుఁదీఁగవోలెఁ బరమతేజ
మాకనమున లీనమై పోయె నెప్పటి
యట్లు గాఢతమస మలమికొనియె.

గీ. హృదయవేదనంబు పదిరెట్టు లయ్యె ని
రాశ నెమ్మనమున నతిశయించెఁ
భయము ముమ్మరించెఁ బ్రాణముల్ చలియించెఁ
దెలియరాని బాధ తీవరించె.

గీ. సమధికానందపూర్ణ సుస్వప్న మతఁడు
రంతదుఃఖయవనికాంతరాంతమునను
మాయ మైపోయిన ట్లైన మగుడ
భావమున దేవునింగూర్చి తనవి పనవె.

గీ. "కలుషమూర్తి నన్నుఁగని [illegible]ఁజాలక
పొడవుసూపి పాఱిపోయె దేల
హా! యనాథనాథ! యఘవినాశనామ
మేల వమ్ము సేయ నెంచితయ్య?

గీ. హా! మహాదేవ! రక్షింపు!" మనుచు నంత
రంగమున నేడ్చుదుఃఖస్వరంబు బాహ్య
వదనమున నుండి కూడ వెల్వడుచు నుండె
నచటి కప్పుడె యరుదెంచి యామెభర్త.

గీ. వానఁ దడిసినట్టి వస్త్రంబు లైనను
విడువకుండ నింతికడకుఁ జేరి
భయము లేదు నీకు భయము లే దూఱడు
మనుచు వెన్నుఁ దట్టి యనునయింప.

గీ. కాంత తెలివిఁ గాంచి కాంతుని గని కన్ను
లుష్ణవారిధార నుడికిపోవ
నెలుఁగు రాలుపడఁగ నేడ్చుచుఁ దల్లడ
పడుచుఁ బొరలి పడియెఁ బడకనుండి.

గీ. భర్త యామె నప్పుడు పడకుండఁ బైకెత్తి
పడకయందుఁ జేర్చి దుడుకుఁ దీర్చి
యిదిగో! దీనిఁ ద్రావు మిపుడె నెమ్మదిపడు
నంచు నౌషధంబు నంది యిచ్చె.

గీ. పడఁతి యప్పుడు దిగ్భ్రాంతి పడినయట్లు
చిత్తము చలించి యున్మాద మెత్తినట్లు
వెఱ్ఱిచూపులఁ జూచుచు వికృతవదన
మొప్ప నుస్సని యొక్కనిట్టూర్పు విడిచి.

గీ. సన్నయెలుఁగున మృత్యువు చాయ లొలయ
సదయహృదయ! నాకింక నౌషధము లేల
రంగుకావడిపెట్టెలో దొంగయరను
దెల్లసీసలో విష ముండెఁ దెచ్చి యిమ్ము.

గీ. అనుచు భర్తవంకఁ గనులెత్తి చూడఁగా
నోపలేక యొక్క యోరచూపు
తనయవంకఁ బఱపి కనులవెంబడి నుష్ణ
వారిధార లురక వఱదవాఱ.

గీ. ఇంతి వెక్కి వెక్కి యేడ్వ, నేడ్వఁగఁ బోకు
మనుచు నాథుఁ డామె ననునయించి
వెఱ్ఱిదాన ! నీవు విష మనుకొంటివి
గాని యది విషంబు గాదు కాదు.

గీ. నీమనంబుఁ దెలియ నీకందునట్లుగా
నా ప్రియునకుఁ జెప్పి నీప్రియునకు
నందఁజేసినట్టి యది నిశ్చయంబుగా
వెగటుమందు గాని విషము గాదు.

గీ. అనునుడులు విని కాంత యేమైనయదియొ
"ఆఁ" యనుచు విచ్చినట్టినోరట్లె యుండ
నట్టె తేలిపోయినకన్ను లట్టెయుండఁ
గొయ్యనడిపోయె దయ్యంబు గొట్టినట్లు.

గీ. తప్పుఁ జేసినట్టి తన్నెఱుంగక నాథుఁ
డనునయించుచుండె ననియె పొగులు
నింతి, తన్నెఱింగియే యూతఁ డిటులుండు
టెఱిఁగి యెఱిఁగి యప్పు డేమి కాదు ?

గీ. మనసునందె యెన్నిదినములనుండియో
యణఁగియున్న దారుణాగ్నికీల
మొఱుఁగకుండ నొక్కపరి విజృంభించుట
కతఁ డొకింత బెదరి యట్టె చూడ.

గీ. ఒడలు చల్లఁబడఁగ నుచ్ఛ్వాసనిశ్వాస
గమన మాఁగ, నెమ్మొగంబు వాఁడ
గుండె నిలిచిపోవఁ గొయ్యయై పడియున్న
కాంత యట్లె యతనికంటఁ బడియె.

గీ. రామచంద్రుఁ డపుడు రమణిఁ గన్గొని సంభ్రి
మమున మరలఁ జూచి మరలఁ జూచి
యాస దీఱిపోయె నని నిశ్చయముఁ జేసి
యొక్క వేఁడినిడుదయూర్పు విడిచి.

గీ. "తరుణి తనయిచ్చమెయి దుష్పథమునఁబోయి
పోయి కష్టపరంపరఁ బొంది పొంది
మరల సన్మార్గమునకె తా మరలు ననుచు
నెంచి నేనీమె నొంటిగా నింట విడిచి.

గీ. చదువనుచుఁ జెప్పి పోయితిఁ జన్నపురికి
ననుకొనినయట్లె సతికిఁ బాపానుభవము
వలనఁ బశ్చాత్పరీతాప మలముకొనియె
నదియె కావలసినదేదొ జరగిపోయె.

గీ. అగ్నిసాక్షిగాఁగ నంగీకరించిన
భార్య గాన దీనిభావిగతికిఁ
జేయఁదగినయంత చేసితి నింక నా
ప్రేగులోనితీట వీఁగిపోయె.

గీ. అనుచు నెమ్మదిపడి తదనంతరక్రి
యల నివర్తించి యొక్కనాఁ డయ్యుదార
హృదయుఁడు ప్రశాంతహృదయుఁడై యేఁగుకొ
నాత్మజాత యడ్డం బయ్యెననుచుఁ దలఁచి. [అకు

గీ. అట్టిపాపాత్మురాలైన యామె కీమె
తనయ యని యూరిజను లాడుకొనకయుండ
నావికారిణిమగఁ డీతఁడనుచుఁ దన్నుఁ
జూచి లోకులు వేల్వెట్టి చూపకుండ.

గీ. తనదునర్వస్వముంగూడఁ దనయపేర
వ్రాసి వైరాగ్యభావవికాసహృదయ
నలినుఁడై తనుజాత ననాథరక్షు
కాధికారవర్గంబున కప్పగించి.

గీ. ఎచట నున్నవాఁడో యేమయి పోయెనో
నాఁటిదినము మొదలు నేఁటిదాఁక
నెఱుఁగఁబడకయుండ నేకాంతముగ నాతఁ
డున్నచోటు దెలియకుండఁ బోయె.

# 59 అనుతర్షము.

అఖిలతారలునీపాదనఖరములను
బూజచేయుట కని పూఁటపూఁట కిట్లు
మినుకుమినుకుమటంచును మెఱయుచుండ
మాత ! యీయనంతాకాశమండలమున
నిండి యుండు నీనక్షత్రమండలమున
నేఁటికీచుక్క యిటు లుదయించెనమ్మ !
తగదె యిది నీపవిత్రపాదములఁ గొలువ ?
దీని నేమిటి కిటు నిషేధించితమ్మ ?—
ప్రాగ్దిశను బుట్టి మింటను బ్రాఁకి ప్రాఁకి
పశ్చిమసముద్రవారిలోఁ బడి మునింగి
మఱల నుదయించి క్రిమ్మఱ మఱుఁగువడుచుఁ
దిరుగుచుండుట కయ్యనే దీనిబ్రదుకు ?
తల్లి ! భవసాగరమునుండి తప్పుకొనుట
కేయుపాయంబు లేదె నీవిష్టపడిన ?
సకలతారలు పోయిన జాడఁ జూచి
సకలతారలు వచ్చిన జాడఁ జూచి
సకలతారలు నినుఁ గొల్చుజాడఁ జూచి
తల్లిపదములఁ గొల్చుచిత్తమునఁ జేసి

తత్త్రమునొందుచున్న దీతార యిపుడు;
తల్లి! యాకాశగంగలోఁ దానమాడి
స్వర్గమున నున్నపూవులు సంతరించి
నీపవిత్రపదాబ్జముల్ నిష్ఠతోడ
నాత్మపీఠంబునం దుంచి యహరహంబుఁ
బూజచేయుట కీచుక్క పూనుకొనియె
నమ్మ! యీయాస పేరాస యనకుమమ్మ!
నీవె కృపఁజూడకుండిన నిఖిలజనని!
నన్నుఁ బోషించుట కెవ్వ రున్నారలమ్మ!

(20-5-16.)



# 60 పరార్థపరత.

క్షణభంగురంబు నశ్వరము జీవనము
ధర్మం బవశ్యకర్తవ్య మెల్లరకు ;
పుష్పించి ఫలియించి భూతసంతతికిఁ
గడుఁ బ్రియం బొనరించు ఘనతరులట్లు
పరమోపకారభవ్యక్రియాతతికిఁ
బాల్పడువారిజీవనమె జీవనము
అమృతఫలాభ్యుదయార్థంబుపొంకుఁ
బూవైనఁ దా రాలిపో నోపినట్లు
శిష్టరక్షణదుష్టశిక్షణంబులకుఁ
జెలిమినో పగనో చచ్చినచావె చావు.

(12-6-1916.)

# 61 విశ్వజనని.

శుభ్రాం విచిత్రవసనాం నవచంద్రచూడా
మన్నప్రదాననిరతాం స్తనభారనమ్రాం
నృత్యంత మిందుశకలాభరణాం విలోక్య
హృష్టాం భజే భగవతీం భవదుఃఖహంత్రీం.

పండువెన్నెల జగమెల్ల నిండఁజేయు
నమృతకరునిలయంబైన యాకసమునఁ
గనదమృతమూర్తితోడ నాకనుల యెట్ట
యెదుట సాక్షాత్కరించు నీవెవరు తల్లి?
మధురమందస్మితానన మండలంబు
మధురమోహనరూపంబు మధురశాంత
భావసంపూర్ణ సత్కృపాపాంగదృష్టి
యెలయ నన్నలరించు నీవెవ్వరమ్మ?
తరుణశశిరేఖ నీమౌళి మెఱయుచుండ
నభయవరదాయకంబైనహస్తయుగ్మ
మాశ్రయముఁ జూపుచుండె నీయాత్మజులకు
నన్నపూర్ణవు గావె మాయమ్మనీవు?
ఆదిశక్తి! మాయమ్మ! లోకావనమున
కలిదయామతి నీవిచ్చునట్టి కనక

కుసుమమధురామృతములఁ జేకొనెడివీర
లిందిరాగిరిజావాణులేకదమ్మ ?
జనని ! నీకరుణామృతస్వర్ణవృష్టిఁ
బండు బంగారులీగలపంట యిదిగో !
అమ్మ ! నీచనుబాల కీడైనయట్టి
కలకఁదేరిన వాహినీసలిల మిదిగో !
దేవి ! నీశాంతమూర్తితో డీటువచ్చు
కామనీయక నిర్మలాకాశ మిదిగో !
మాత ! నీయూర్పు దావికిమాఁదియైన
చారు జాతీసుగంధ సమీర మిదిగో !
తల్లి ! నీసుస్మితంబుతోఁ దలఁపఁదగిన
సురుచిర శరత్సుధాకర జ్యోత్స్న యిదిగో!
విశ్వపరిరక్షణంబు నీవిధియె కాన
విశ్వభూతహితంబుగా విశ్వమూర్తి
వెలయుచున్న నీఛాయయే విశ్వమందు
నంతటను గానఁబడుచున్నదమ్మ ! మాకు.
అనఘమూర్తి ! నీ దివ్యదయామృతమునఁ
జల్లనై పాడిపంట లీఁజాలి, జగము
కడుపు చల్లఁగా జేయఁగాఁ గలుగువేళ—
శారదావేళ-నీవేళ-జనని నిన్ను-

దల్లివగు నిన్ను - లోకమంతయునుగూడ
నొక్కరీతిగఁ బూజించుచున్నదమ్మ!
నిండుజాబిల్లి పండువెన్నెలలఁ బేరి
మడుఁగు లోగ్గుచు నుండె నీయడుగులకును
జక్కఁగాఁ బండి వంగి రాజనపుఁజేలు
భక్తి నీముందు సాష్టాంగపడుచునుండె
సారసగుహాంతరంబులఁ జంచరీక
సమితు లోంకారమంత్రముల్ చదువుచుండెఁ
బాలవరివెన్ను లెలమి నర్పణముఁ జేసి
చిలుక లభినందనంబులఁ జేయుచుండె
విమలతటినీతటములఁ గాశములు పుష్ప
విసరములతోడఁ జామరల్ వీచుచుండె
నమ్మ! విశ్వాత్మవైననీ కఖలజనులఁ
జేటనీరును, జలుగుము త్తెంపుసరులఁ
బ్రాలపరమాన్నములఁ గట్టివయాలపాలు,
బలుసుపండులుఁ, బంచదారలును, జెఱకు
పాలు, వేయిరేకుల తమ్మిపూలు, జాజి
పూలగుత్తులు, గూర్చినమాలికలును
సన్నుతులతోడ నర్పించుచున్నవారు
వింతలే నీకు నివి యెల్ల విశ్వమూర్తి!

తల్లి దయతోడ నీదివ్యదర్శనంబు
గలిగె నాకింక నేమి కావలసియుండు
నమ్మ! కొండంత దేవిఁ గొండంతపత్రి
నర్పణము చేసి పూజింప నలవియగునె?
ప్రేమమయమూర్తి! నిన్ను నాప్రేమరసత
రంగితం బగుహృదయాంతరమున నిలిపి
గగనతత్వాత్మ వగునీకుఁ గల్పసురభి
కుసుమహారపరంపరల్ గూర్చినట్లు
అనిలతత్వాత్మ వైననీ కతిమనోజ్ఞ
పరిమళాగరుధూపంబు పట్టినట్లు
వహ్నితత్వాత్మ వగునీకుఁ బచ్చకప్రి
ముంచి నీరాజనము నివాళించినట్లు
అమృతతత్వాత్మవైన నీ కమృతకలిత
దివ్యపరమాన్నములు నివేదించినట్లు
భూమితత్వాత్మ వగునీకుఁ బొగడఁదగిన
దివ్యచందనకలశ మందించినట్లు
సకలతత్వాత్మ వగునీకు సకలసదుప
చారములఁ జేసి పూజలఁ జరిపినట్లు
భావనముఁ జేసి యానందపడుదు నమ్మ!
అఖిలలోకావనంబుగా నమృతవృష్టి

సాధుదృష్టిఁ గటాక్షించు సమయమందు
ననుపమానంద కలితలాస్యంబువలన
నాననంబున శ్రమజలం బంకురింపఁ
జలువచెంగావి పయ్యెద జాఱువాఱఁ
జిత్రమణిమయహారముల్ చిక్కువడఁగఁ
జికురబంధంబు వెన్నునఁ జెదరియాడ
నమలమణికుండలంబు లుయ్యాల లూఁగఁ
గంకణంబులు మొలనూలి గంటలులియఁ
దరలిపోవక చలియించు మెఱుపువోలె
నతిమనోహరమూర్తి వైనట్టినిన్ను
నెమ్మనంబున నిల్పి ధ్యానింతు నమ్మ!
జడధు లుప్పొంగఁగాఁ జేయు శక్తి వీవు
మట్టిముద్దల మెఱయించు మహిమ వీవు
తోలుబొమ్మల నాడించు బాల వీవు
జగముఁ బుట్టించి పొదలించు జనని వీవు
ప్రళయమున మాయఁజేయు దేవతవు నీవు
ప్రకృతిఁ బాలించు పట్టంపురాణి వీవు
అమ్మ! నీమందమధురస్మితాంకురంబె
యవని కానందసాంద్రచంద్రాతపంబు
కాళి! నీమెఱ్ఱనగుకడకంటిచూపె

యఖిలలోకంబులకుఁ బ్రశయానలంబు
అబ్జజాండంబు మొదలుగా నణువుదనుక
నిలుచు నీదివ్యతమశక్తి నేకదమ్మ !
దేవి! నీశక్తి నేమఱి దేవులాడు
వాఁడు నిక్కంబుగా వెట్టివాఁడుసుమ్మ !
అమ్మ ! నీదివ్యకరుణాకటాక్షకలన
శాశ్వతానందవృష్టి, విజ్ఞానవృష్టి
యనుపమోత్సాహరసవృష్టి కనకవృష్టి
వెలయఁజేయుచు నజ్ఞానజలధినుండి
లీల మాయాంధ్రభూమిఁ దేలింపుమమ్మ !
నెమ్మదిని నిల్పి నిన్ను ధ్యానించుమమ్మఁ
జిత్తశుద్ధిగ నిన్నుఁ బూజించు మమ్మఁ
ద్రికరణంబుల నిన్నుఁ బ్రార్థించుమమ్మ
నభయదానం బొసంగి కాపాడుమమ్మ !

(12-7-16.)

# 62 నీతిగీతావళి.

గీ. పలికెద శతాధికగ్రంథభావమెల్లఁ
దేటతెల్లంబుగా నొక్క మాటలోనె
పుడమిని బరోపకృతిసేఁత పుణ్యమునకె;
పరుల కపకృతిసేఁత పాపంబుకొఱకె.

గీ. ఆర్వురే బాంధవులు లోకమందు నాకు
సత్యమే తల్లి, జ్ఞానమే జన్మదాత,
ధర్మమే తోడఁబుట్టువు దయయె హితుఁడు
శాంతియే ధర్మచారిణి క్షమయె కొడుకు.

గీ. ఆలకింపుము పరమార్థమైనమాట
నగలె వేఱువేఱగు సువర్ణం బొకండె;
భాండములె వేఱువేఱు మృత్పిండ మొకఁడె
తనువులే వేఱవే యాత్మ తా నొకండె.

గీ. సుమతులు గ్రహింప రెండువాక్యములలోనె
నిర్వచించెద సుఖదుఃఖనియమములను
సర్వ మాత్మవశంబులు సౌఖ్యదములు
పరవశము లన్నియును దుఃఖభాజనములు.

గీ. స్వరమె రూపంబు పరభృతవర్గమునకుఁ
గొ్రత్తడితనంబె రూపంబు కోమలులకు.

విద్యయే రూపము కురూపవితతి కెల్ల
శాంతియే రూపమై యొప్పు సంయములకు.

గీ. గ్రంథములలోనిచదువు నిర్గంధసుమము
పరులచేతిధనంబు నిష్ప్రయోజనంబు
సమయమున కుపయోగింపఁజాలదేని
యది చదువుగాదు ద్రవ్య మయ్యదియుఁగాదు.

గీ. ననలఁ గాదని, నవనీతమును ద్యజించి,
పరులదుఃఖంబునకు దుఃఖపడెడువాని
హృదయమునకంటె మెత్తనిదేది యనుచు
వెదకి, కానంగనైతి మీవిశ్వమందు.

క. ఖలులకును గంటకములకుఁ
గలవు ప్రతిక్రియలు రెండె కడుదూరముగాఁ
దొలఁగించుటయో పదర
క్షులచే ముఖభంగ మొదవఁగాఁ జేయుటయో.

క. తృణము మహామేరువుగా
గణియింపఁగవలయు ధనము గడియించెడుచో
గణియింపవలయు మేరువుఁ
దృణముగఁ ద్యాగంబునందు ధీవరుఁ డెందున్.

(10-11-16.)

# 63 గాలిపటము.

క. జాలెము విడిచినఁగొలఁదిని
వ్రాలుటయునులాగుకొలఁదిఁ బైకెగురుటయున్
గాలిపటమ ! నీనైజమొ ?
గాలిగుణమొ ? పిల్లవాని కరలాఘవమో ?
గీ. నూలుదారంబుచేతను బాలుచేత
గాలివడిచేత ముజ్జెష్ట గాఁగ నున్న
నీదుచంచలజీవననియతి కేను
జాలి నొందెద నేవేళ గాలిపటమ ?
గీ. అలజగత్ప్రాణుపాపుఁ గన్నట్టినీకు
సత్పథంబున విహరింపఁజాలునీకు
నవనవోన్నతులనుగూర్చి యడలవలసె
విధివిచిత్ర మైనదిగదా విశ్వమందు.
గీ. పిల్లవానికినై నీవు విధికి నేను
సూత్రమున కీవు, నేఁ గర్మసూత్రమునకు
ననిలమున కీవు, నే విషయానిలమున
కొదిఁగి లోఁగి భ్రమించుచు నుంటి మహహా!
ఆ. ఒకట రెంట మూట నొప్పియుంటిమి గాన
జగతి నిరువురకును సాటి గలిగ

నుభయులకుఁ దలంప నొక్కటియే త్రోవ
కలసిపోద మింక గాలిపటమ !

(28-12-16.)

## 64 పరమార్థము.

హెచ్చుగ ద్రవ్యంబు లెల్ల గడించి
మేడలు వాడలు మిద్దెలు గట్టి
పాడియుఁ బంటయుఁ బ్రబలంగఁ జేసి
కాంతతో యౌవనకాలంబు పుచ్చి
పౌత్రిలఁ బుత్త్రిలఁ బౌత్రులఁ గాంచి
చుట్టాల పక్కాలచుట్టును జేరి
నెచ్చెలు లందఱినికటమం దుంచి
గౌరవంబుగ నింతకాలంబు జరపి
యిహసౌఖ్యముల రోసి యెల్లరఁ ద్రోసి

పోయెదునీవేళఁ బురపురఁ బొక్కి
యెవ్వరికొఱకునై యేడ్చెద వీవు
ఎందులకై యిపు డేడ్చెద వీవు
జీవుఁడా ! నాతోడఁ జెప్పంగరాదె ?—
కోట్లకొలందిగఁ గొట్లలోనున్న
ధనరాశి నీయెడఁ దలఁపఁగాఁ బోవు
రత్నవినిర్మితరమణీయసౌధ
బృందంబునైన నిరీక్షింపఁబోవు
పాడియుఁ బంటయు భావింపఁబోవు
అలధర్మచారిణినైనఁ గన్నెత్తి
కడసారి యొకసారి గాంచఁగాఁబోవు
వత్సలభావంబు వర్ధిల్లఁ జేయు
చిన్నిబిడ్డలను వీక్షింపఁగాఁబోవు
అనవరతంబు నీయాశ్రయమందుఁ
దిరిగెడుచుట్టాలదెసఁ గనఁబోవు
కష్టసుఖంబులఁ గావడివైచి
తిరిగినమిత్రుల దృష్టింపఁబోవు
యిహసౌఖ్యముల రోసి యెల్లరఁ ద్రోసి
పోయెదునీవేళఁ బురపురఁ బొక్కి
యెవ్వరికొఱకునై యేడ్చెద వీవు

ఎందులకై యిపుడేడ్చెద వీవు
జీవుఁడా! నాతోఁడఁ జెప్పంగరాదె ?—
భూతదయయె నీదు పుట్టుకయేని
సత్త్వగుణంబె నీస్వత్వంబయేని
సత్యవ్రతంబె నీస్వాస్థ్యంబయేని
సద్వర్తనంబె నీసత్పథమేని
యాస్తికత్వంబె నీయాంతర్యమేని
ఇహసౌఖ్యముల రోసి యెలరఁ ద్రోసి
పోయెదునీవేళఁ బురపురఁ బొక్కి
యెవ్వరికొఱకునై యేడ్చెద వీవు
యెందులకై యిపు డేడ్చెద వీవు
జీవుఁడా! నాతోఁడఁ జెప్పంగరాదె ?

(10-1-1917.)



# 65 విచారలహరి.



ఏరాత్రి యీచుక్క లిటుపుట్టనావొ
నారాత్రియే గిట్టునంచును దెలిసి,
ఏయెండ కీపూవు లిటువిచ్చనావొ
నాయెండకే వాడునంచును దెలిసి,
ఏగాలి నీమబ్బు లిటుకూడనావొ
నాగాలినే వీడునంచును దెలిసి
వాసనావశతభవ్యంబును మఱచి
క్షణభంగురంబైన స్వసుఖంబునమ్మి
యక్షయదుఃఖంబు లనుభవించుటకు
దొరకొంటి విదియేమి దుర్బుద్ధి నీకు?
నిజమెఱుంగ విదేటి నిష్పృహ నీకు?
హృదయమా! తత్త్వమూహించి మేలెంచి
యనుభవసిద్ధవాక్యంబు లాలించి
చింతాలహరిలోనఁ జిక్కక మనుమ!—
వినువీథి కెగురంగ వేసినఱాయి
పుడమి నిట్టే పడిపోవునంచెఱిఁగి,
పృథివిలోపలఁ బుట్టి పెరిగినచెట్టు
ఒకగాలిదెబ్బకే యొఱగునంచెఱిఁగి,

జలములఁ బుట్టిన జలబుద్బుదంబు
లంతలోపల మాయమౌనంచెఱింగి,
మొగసిపాటున కేల యీయద్భుతంబు ?
ఔన్నత్యమున కేఁటికి కావిస్మయంబు ?
అమసహోదయమున కాశ్చర్యమేల ?
హృదయమా ! తత్త్వమూహించి మేలెంచి
యనుభవసిద్ధవాక్యంబులాలించి
చింతాలహరిలోనఁ జిక్కక మనుమ !—
జలధరంబులయందు జలములేకాక
పిడుగు లేమిటికిఁ గల్పింపఁగాఁబడెనో ?
ఫణిఫణంబున విషపటలమే గాక
మాణిక్యమేఁటి కమర్పఁగాఁబడెనో ?
అమృతాబ్ధిలో బడబాగ్ని యెందులకో ?
తత్త్వమార్గంబునఁ దలపోసి చూచి
ద్వంద్వభావసమాశ్రితంబై నయట్టి
ప్రకృతికంతకు నేకభావమే యనుచు
నుల్లమా ! విశ్వాస ముంపఁగాఁబోక
యనుభవసిద్ధవాక్యంబు లాలించి
చింతాలహరిలోనఁ జిక్కక మనుమ !—
అనవరతంబును నమృతరసంబు

గురిసెడి కోకిలకూజిత మకట!
కాలకూటవిషాగ్నికంటెను మిగుల
సంతాపమును గూర్చు చందంబుఁ జూచి
యీవస్తువునకును నిట్టిగుణంబు
గలదంచు నూహింపఁగా దెవ్వరికిని;
కాని, జీవుల పూర్వకర్మానుభవమె
యన్నింటికిని మూలమగునంతెకాని
యమృతరసంబున నమృతరసంబు,
కాలకూటంబునఁ గాలకూటంబు
గలదంచు నూహింపఁగాఁబోకు మెపుడు
హృదయమా! యనుభవ మింతకుఁ గనుమ!
చింతాలహరిలోనఁ జిక్కక మనుమ!

(10-1-1917.)



# 66 పుష్పవిరహము.

ముకుమూసి ప్రాణంబు ముంజేత నుంచి
నవపల్లవశుభాసనమునఁ గూర్చుండి
చలిగాలిబాధకు సైరణచేసి
మంచుమున్నీటిలో మాపటివేళ
నీనామమంత్రంబె నిర్మలనిష్ఠ
నక్షరలక్షల నైన జపించి
యుదయరాగాగ్నిలో హోమంబుచేసి
సాక్షాత్కరించెడు సమయమటంచు
నీకయి దోసిలి నిలిపితి నిట్లు
ప్రత్యక్ష మగుమయ్య! ప్రాణేశ! నాకు
వరము లిమ్మయ్య షట్పద దేవ! నాకు—
ద్వారంబుఁ దెఱచి నీదరిసెనమునకు
నెంతో నేపటినుండి యీక్షించుచుంటి
నిన్న నేవేళనో విలయంబు సొచ్చి
కాళులు నిల్పకే కసిగాటుగాఁగ
నేను భుజించితో మెఱుఁగనుగాని
మాపటినుండియు మంచినీరైన
నెఱుఁగక యుపవాసమే చేయుచుంటి

విందాక రావైతి వెట్లోర్చుదాన?
సూర్యపాకంబున శుచిమీఱ నేఁడు
వేఁడిపాయసమును వేడ్కతో వండి
నట్టింటఁ బెట్టితి నాప్రాణనాథ!
చల్లారిపోయినఁ జౌకసేయుదువు
వేవేగ రావయ్య! విందారగింప :—
హృదయేశ! యిటుచూడు మీతూర్పుఁగోనఁ
గాఱుచి చ్చుదయించి కాల్చుచునుండె
నతిలోకభీకర మైనయీవహ్ని
కళికనై యుండినకాలంబునందు
నేమూల డాఁగెనో యేమియోకాని
యిప్పుడే నడివీథి కెగఁబ్రాఁకుచుండె
నేనెటు సైరింతు నీతాపమునకు;
ఇంచుక నామీఁదఁ గృప గలదేని
వీక్షింపు మిచటికి విచ్చేసి నన్ను;
నీచల్లనగుచూపు నేఁ గోరుచుంటి
నీదర్శనంబునె నేఁ గోరుచుంటి
నీగానవృష్టినె నేఁగోరుచుంటి
నాసామి! రావయ్య! న న్నుద్ధరింప!—
తనువు మఱచియుంటి తలుపులు తెఱచి

నీరాకఁ గాంక్షించి నేఁ దొంగితొంగి
చూచుచునుండంగఁ జూపోపలేక
తమచెద్దుములనైనఁ దలఁపంగఁబోక
గాలిసోఁకిన దేమొకాని యెఱుంగఁ
దగుదుమంచును దమతలలూఁచికొనుచు
సరివాడలోనివాసవతులందఱును
పకపకనవ్వ; రప్పటికి నేఁదెలిసి
"వలపులమాట యెవ్వారలమాట
వాతలనే పుట్టినా" యనుకొంటి;
పరిభవ మిదిగాదు ప్రాణేశ! నాకు
నను( గృపఁజూచిననాఁడె వారలకుఁ
బరిభవ మగుఁగాక! పంతంబుఁదీఱ
నాసామి! రావయ్య! నన్నుద్ధరింప;—
పన్నీటికలయంపి పైపయిఁ జల్లి
మునుకొని పుప్పొడి ముగ్గులువెట్టి
చిగురుతోరణముల సిద్ధంబుచేసి
యతరుదినుపల నాయత పఱచి
పలుచనిరేకులపాను పమర్చి
మెల్లపనుల్ దీర్చి హృదయేశ! నీదు
చరణసంసేవకై సంసిద్ధనైతి;

నాదరంబున దాస్య మంగీకరించి
యలయికఁ దీర్పుకో నైన రావయ్య !
సమధికగుణసాంద్ర ! షట్పదచంద్ర !
(16-1-1917.)

---

# 67 మాతృస్తవము.

కన్నతల్లుల కెల్లను గన్నతల్లి
చలువగలతల్లి ముజ్జగములకుఁ దల్లి
ముప్పురను గన్నతల్లియా మొదటితల్లి
యకుగుఁదమ్ములు నాకు దిక్కగునుగాక !

---

ఒదిఁగి పొత్తిళ్లలోన నే నున్నవేళఁ
గన్నులైనను దెఱవక యున్నవేళఁ
జిన్నిచేతుల నల్లార్చుచున్నవేళ
నూయెలఁ బరుండి నిద్రింపుచున్నవేళ

నూహాయే లేక నవ్వుచు నున్న వేళ
నుదరబాధకుఁ దాళకయున్న వేళ
నొక్కపలుకైనఁ బల్కలే కున్న వేళఁ
గంటికిని ఱెప్పవోలె నన్ గాచినావు
ఎఱుఁగిమెఱుఁగనివేళ న న్నిందువిడిచి
యెందు వోయితివమ్మ! యె ట్లేఁగితమ్మ!
నీవె దిక్కని మొఱలిడు నీసుతనయు
నీవె కృపఁజూడకుండిన నిఖలజనని!
నన్నుఁ బ్రోచుట కెవ్వ రున్నారలమ్మ!—

౨

అడుగు నొచ్చిన నిను నెంతు నమ్మ యనుచు
నబ్బురంబున నిను నెంతు నమ్మ యనుచు
నాఁకలగువేళ నిను నెంతు నమ్మ యనుచు
హాయిఁ గనువేళ నిను నెంతు నమ్మ యనుచు
నలసినప్పుడు నిను నెంతు నమ్మ యనుచు
నప్పుడిప్పు డటంచు నేఁ జెప్ప నేల
జనని! నినుఁ దలంపని నిమిషంబు గలదె?
నీవె దిక్కని మొఱలిడు నీసుతనయు
నీవె కృపఁజూడకుండిన నిఖలజనని!
నన్నుఁ బ్రోచుట కెవ్వరున్నారలమ్మ!

3

విషయ మెఱుంగక నిర్మలవృత్తిఁ బోడ
నొక్కదెస మే నెఱుంగక యున్ననన్నుఁ
గ్రూరమతి నెవ్వరో కాని కొట్టి లేపి
యైదుగుఱ్ఱాల తేరు నాయత్త పఱిచి
సారథి నొకండు దానికి సంతరించి
కర్మయంత్రప్రభావసంఘటితమైన
చిన్నియడిద మ్మొకండు నాచేతి కిచ్చి—
యరుల గెలువంగఁ బురికొల్పి రక్కటకట!
పగఱఁ గన్గొందమా కంటఁ బడనివారు
సారథిఁ దలంతమా కడుఁజంచలుండు
తురగములఁ జూతమా పెడత్రోవఁ బోవు
అడిదమా మొనపోయిన; దన్నిగతులఁ
జెడితి నిం కెట్టు లే ననిఁ జేయువాఁడ?
భయపడినవాఁడ, భ్రాంతిలోఁ బడినవాఁడ
నొండెఱుంగక దెసమాలి యున్నవాఁడ
నివుడు నీపాదయుగ మాశ్రయించినాఁడ
నీవె దిక్కని మొఱలిడు నీదుతనయు
నీవె కృపఁజూడకుండిన నిఖిలజనని!
నన్నుఁ బోషించుట కెవ్వ రున్నారలమ్మ!—

౪

విశ్వమేమియుఁ దెలియనివేళ నన్ను
నొడ లెఱుంగక నిద్దుర నున్ననన్ను
నెవ్వ రిటులేపిరో కాని యే నెఱుంగఁ
దెలిసి తెలియని దుఃఖాబ్ధిఁ దేలుచుంటి
దీని కెయ్యదియో తుదిఁ దెలియరాక
దీనికెందును దీరమే లేనియపుడు
దీనిఘోషకు మేరయే తెలియనపుడు
దీనియలలకు విరతియే లేనియపుడు
దీని దాఁటంగ నౌకయే లేనియపుడు
నన్ను నీ ఘోరవారాశి నట్టనడుమ
భయదజలచరములచెంతఁ బాఱవైచి
నన్నుఁ గానట్టులుంచుట న్యాయమమ్మ!
నీవె దిక్కని మొఱలిడు నీదుతనయు
నీవె కృపఁ జూడకుండిన నిఖలజనని!
నన్నుఁ బ్రోచుట కెవ్వ రున్నారలమ్మ!—

౫

అడ్డాలలో నున్నయప్పు డవ్యక్తత
మాత! నీమాటయే మఱచియుంటిఁ
దోడిబాలురతోడఁ గూడియాడెడువేళఁ

దల్లి ! నీయునికియే తలఁపనైతి
యౌవనమదమున నఖిలంబు మఱపొంది
జనని ! నిన్ను స్మరింపఁజాలనైతి
వెనుక సంసారాబ్ధి మునిఁగి తేలఁగ లేక
జనయిత్రి ! నిన్నెన్నఁజాలనైతి
ఇపుడు నీప్రేమమయమూర్తి హృదయవీథి
మబ్బుదొలఁగిన చంద్రునిమాడ్కిఁ దోఁచె
నీవె కృపఁ జూడకుండిన నిఖిలజనని !
నన్నుఁ బ్రోచుట కెవ్వరున్నారలమ్మ !

(31-1-1917.)



# 68 ఆశ్వాసము.

అకట ! జీవితమే వ్యర్థ మయ్యెననుచు
నర్థదేహంబు పోయిన దనుచుఁ దలఁచి
సోదరీ ! దరిగానని శోకజలధి
మునుఁగ నేమిటి ? కజ్ఞానమును ద్యజించి
జ్ఞాననేత్రంబు తెఱచి యీక్షింపఁబడెను
విశ్వరూపంబు నిష్ఠ భావింతువేని
అంతటను నిండినది పరమాత్మ యనియు
నదియె దివ్యంబు నక్షరమైన దనియుఁ
దేటతెల్లంబుగా నీకుఁ దెలియవచ్చు—
ఆలకింపుము పరమార్థమైనమాట !
నగలె వేఱువేఱగు; సువర్ణం బొకండె
భాండములె వేఱువేఱు మృత్పిండ మొకఁడె
తనువులే వేఱవే యాత్మ తా నొకండె—
అకట ! యీగతి నక్షరమైనదాని
నవ్యయస్థితి నందినయట్టిదాని
నొకట నీలోననే నిండి యున్నదాని
నరయఁజాలక, పోయిన దనుచు నెంచి
వెతలఁ గుందుచునుండుట వెఱ్ఱిగాదె?—

ఏయమూల్యరత్నంబు నీకింతదనుకఁ
గంఠహారంబుగా దీపకళిక గాఁగ
నుండి నీయిష్టముం దీర్చుచుండె ననుచుఁ
గడవఁగా రానిబహుళాంధకార మెల్లఁ
బాపుచుండె నటంచు నీభావమందుఁ
దలఁచి పూజించుచుంటివో దాని నిప్పు
డెవరో కఠినత్వమున హరియించి రనుచుఁ
బాపమతి నెవ్వరో యెడఁబాపి రనుచు
దాని నిఁకఁ బొందునాస నేఁ గాన ననుచు
నకట ! యజ్ఞానతిమిరంబునందు మునిఁగి
యెడ తెగనిశోకమునఁ గూల నేఁటికమ్మ !—
ఆమహారత్న మెవరిచే నైనఁగాని
లీలలకు నైనఁగాని తర్లింపఁబడునె ?
కూలమున కీవలావలఁ గూడియున్న
నీర మడ్డంకి తీఱిననిముసమందె
యేకమైనట్లు లాయాత్మ యేకవృత్తిఁ
దోడుగా నున్న నీయాత్మతోడఁ గూడెఁ
గూడియుండుటయే దానిగుణము గాన—
అనితరప్రేమమయుఁడగు నాత్మనాథు
నాత్మతేజంబు గర్భమం దమరెఁ గాన

నాత్మజామోదసిద్ధి నీ కగు నిజంబు ;
తత్త్వము గ్రహించి యాత్మపథంబుఁ బట్టి
నాతిమిన్న ! యాత్మారాధనంబునందె
తత్పరవు గమ్మ వగవాని ; దానియందె
నిఖలధర్మంబులునుగూడ నిండియుండె
నిఖలమైనసుఖంబులు నిండియుండె ;
సుదతి ! శోకాంధకారంబుఁ జూడవింక
నిత్యసౌఖ్యపదంబె నీనిలయ మగును—
పటుతరంబై నహృదయాలవాలమందుఁ
బ్రేమ మనునమృతమ్మునఁ బెరిఁగినట్టి
యారసాలంబు దివ్యపత్రాళిచేతఁ
బుణ్యమయపుష్పములచేతఁ బూర్వమెట్లొ
యట్టులే నేఁడుఁగూడ నీయాత్మయందె
విస్తరిలి వెల్గుచున్నది విస్మయముగ
బాహ్యచక్షువులకుఁ గానఁబడనియంత
మాత్రి శోకింపఁ జనునమ్మ మగువమిన్న!—
అంతరికచక్షువులవిచ్చి యరయు మపుడు
ప్రేమమయలోకమున నది పేర్మి మీఱి
నెట్లు వర్ధిల్లుచున్నదో యెఱుఁగవచ్చు
నెట్లు శోభిల్లుచున్నదో యెఱుఁగవచ్చు

నెట్టిసుఖమిచ్చుచున్నదో యెఱుఁగవచ్చు
నెట్టియానంద మిచ్చునో యెఱుఁగవచ్చు.
(9-4-1917.)

## 69 జీవచోరుఁడు.

భవనమున నుండునట్టి యాపరమహంస
యేదెసకుఁ బోయెనో కనరా దిదేమి?
అనయ మొకరీతిఁ గలకలలాడునట్టి
యిల్లు పాడయియుండిన దేమిచెపుమ?
పరమహంసయె మైనచోఁ బాఱిపోవు
గుణము నిట్లు సంపాదించుకొనఁగనగునె?
అకట! గుణవంతుఁ డనుపేరు నవలఁద్రోసి
పురుషపుంగవుఁ డనుపేరు పొల్లుఁజేసి
గొప్పగా నున్నయీయిల్లు గుల్లచేసి
దాటిపోవుట కీక్రియ దొంగ వగుచు

మొగముఁ జూపుట కిటు నాలిముచ్చ వగుచు
నేఁడు కనుగప్పిపోవుట నీతిగాదు;
అకట! యీమందిరంబు శూన్యంబు చేసి
అక్కటిక మేఁది దీపంబు నార్పివైచి
సందుగ నెనంగు రతనాల సంగ్రహించి
తెలియకుండంగఁ దలుపులు తెఱచివైచి
దొంగవై పోవు టేపాటి దొరతనంబు?
ఎచటి కేఁగెదవాఁడ వెళ్లేఁగినాఁడ
విప్పుడైన నోకించుక చెప్పవయ్య!
"పరువు లిడుజీవుఁడా! నిన్నుఁ బట్టికొనఁగఁ
బట్టి గట్టిబంధంబులఁ గట్టినెవఁ
గర్మచారులు వెన్నంటి రోర్మితోడ
నెందు డాఁగెద వేలోక మేఁగఁగలవు?
పట్టువడుదువు నామాట భ్రాంతిగాదు;
నేఁటి కిటులాయెఁ గాని యేనాఁటికైన
లోకమున నీపనులు రుజువు కాకపోవు
ముందు నీబాము లున్నవి మురియనేల?
తుల్లి తొందరపడకుము దొంగకాన!

(25-5-1917.)

# 70 ఆశ—నిరాశ.

పెరటిలో నున్న యేడాకులరఁటిచెంతఁ
బెద్దబావిజలంబులఁ బెంచికొన్న
మావిమోకకుఁ గననయ్యెఁ గావిచిగురు;
కావిచిగురున కాసించి గళమునెత్తి
గండుఁగోయిల పాడె రాగంబు లొలయఁ;
జివురు వెట్టనికొమ్మలఁ జిన్నిపూలు
తావు లింపార వికసించె; దానఁ జేసి
మేలుకొలుపులఁ బాడుచు నాలి తేఁటి
యొక్కరీతిని చిందులు ద్రొక్కఁ దొడఁగెఁ;
గాంచుచుండంగ నాకస్మికంబు గాఁగ
నెట్టిగాలిపాటుననొ మఱేమొ కాని
చిగురు నశియించెఁ బూవులు చిందిపోయెఁ
జిన్నికోటుల యంతలోఁ జిన్నవోయెఁ
దుమ్మెదకుఁగూడ నేమియుఁ దోఁచదాయె
విషమవిశ్వంబునకు నిది వింతపనియె ?
అగు ననుచు నంతమాట నే ననఁగఁజాలఁ
జివురుదినుమంచుఁ గోకిల కెవరు చెప్పి ?
వలరు లిమ్మని మూత్రమ్ము నడిగి రెవరు ?

తేఁటి నెవ్వరు పిలిచిరి తేనెకొఱకు ?
దేనికై పూవు నెవ్వారు తీవరించి
రీప్రకృతిసిద్ధగుణముల నెల్ల నెఱిఁగి
యీస్వభావగుణంబుల నెల్ల నెఱిఁగి
ప్రకృతి యెల్లరకును బోధపఱుటకొఱకు
సకల మెఱిఁగిన పండితుఁ డోకఁడు దక్క
శ్రేష్ఠమగువ్యాఖ్య నెవ్వాఁడు చేయఁగలఁడు ?
కొమ్మచివరను జిగురుంట కొత్తయేని
బూల మకరంద ముండు టపూర్వమేని
వెన్నెలలఁ జల్లఁదనముంట వింతయేని
గానమున రాగముండుట కల్లయేని
ఆశపుట్టుటకే యవకాశ మున్న ?
ఆశపుట్టెను బుట్టినయపుడె కూడ
నిది నిరాశకుఁ జోటని యే నెఱుంగ ;
నిది నిరాశకుఁ దల్లియం చే నెఱుంగ ;
కడలిలో నూర్మికలు కానఁబడినయట్లు
పందిరిని జిన్నితీవలు ప్రాఁకినట్లు
మేఘములలోన మెఱపులు మెఱసినట్లు
ద్యోతలంబున నొకచుక్క తోఁచినట్లు
వింతగా నాశ పొడసూపి విరియఁ బ్రాకె.

అలలు జనియించి నీటిలోఁ గలసిపోయె
వల్లరియుఁగూడఁ జివురించి వాడిపోయెఁ
జంచలాలత యపుడె నశించిపోయె
నెక్కడనొ కానఁబడకుండఁ జుక్క గుంకె
నాశ లన్నియు నంతలో నంతరించె
నాశను నిరాశ త్రోసిరా జనుటఁ జేసి—
ఇప్పు డారాజు పోయినాఁ డేమొకాని
యెల్లసందర్భంబు లొకమాటె యింకిపోయె
వాడుతీవయుఁగూడఁ గన్పడకపోయె
నాశ లనువెల్గు లొకమాటె యంతరించె
నంధకారమె యెల్లెడ నావరించె
నిది నిరాశాధికారమా! యేమిచెపుమ!
ఇది నిరాశకుఁ గాలమా యేమిచెపుమ!
ఇది నిరాశకు నిలయమా యేమిచెపుమ!
ఇది నిరాశాంధకారమా యేమిచెపుమ!
ఆశ కవకాశమే లేనియప్పు డింక
నాశ యనుమాటయే లేనియప్పు డింకఁ
బెద్ద లెందుందు రని చూచి పిల్చువాఁడ?
సత్యముగ నాస లేనిచో జగము లేదు
లేనిజగమున నెయ్యది కానఁబడును?

అలనిరాశయా ? కాదు కా దన్నిటికిని
మూలకారణమైన నిర్మోహతత్త్వ
మిందు గాన్పించు నిపు డాశ్రయింతు దాని
నదియె నాశాంతికి శరణ్య మగునుగాక !

(9-7-1917.)



## 71 భవాబ్ధి.

ఆదికారణ మెఱుఁగని ప్రాణులార !
గోప్య మెఱుఁగని యోజీవకోటులార !
శోకవిహ్వలులై యిటు స్రుక్కనేల ?
మోహతాపభరంబున మ్రొగ్గనేల ?
కర్మసంబద్ధ మగుదానిఁ గర్మమునకె
యప్పనముసేఁత మీపని యగును గాని
కర్త లీరెంటికిని మీరు గారు కారు !
చీకటులఁ బంపుచేసిన చేతితోడ
వెన్నెలల సృజియించిన విభుఁ డెవండో

అట్టికర్మాధిపతి యాశ్రయంబుకొఱకు
అట్టికర్మవినాశుని యండకొఱకు
విజ్ఞులై యిప్పుడైనను వెదకికొనుఁడు !
అపరాత్పరుసేవ మీ కబ్బెనేని
శోకమోహాదు లిఁక మిమ్ముఁ జూడఁబోవు
శోకమోహాదు లడఁగినచో భవాబ్ధి
దాఁటిపోయెద రోజీవకోటులార !—
శోకమోహాదివృత్తుల కాఁకచేతఁ
గగ్గి కలుషీకృతంబై వికారసరణిఁ
దోఁచుచుండిన మీచిత్తతోయజమును
సారెసారెకు భక్తిరసాయనమునఁ
గడిగి పరిశుభ్రముగ నుంపఁగలరయేని
జ్ఞానతేజంబు దాననే కాననగును ;
తేజ ముండిన లే దింకఁ దిమిర మచట
శుద్ధసత్వస్వరూపమే చూడనగును
గానభక్తిమార్గంబును గాంతురేని
పూర్ణతరభక్తుఁ డంజనాపుత్రుమాడ్కి
నీయపారభవాంబుధి నింతలోనె
దాఁటిపోయెద రోజీవకోటులార !

(19-7-1917.)

# 72 కాలసముద్రము.

అత్యగాధంబు భయదంబు నైనయట్టి
భువనపరిపూర్ణకాలసముద్రమునకు
అలలు సంవత్సరములంట! యలసి సొలసి
చింతచేఁ గూలఁబడియున్న జీవకోటి
నేత్రవారిధారల నిది నిండునంట!
క్షారజలయుతమంట! యపారమంట!
పోటుపాటుల నిది యెల్లప్రొద్దులందుఁ
దీవ్రగతితోడ మర్త్యత్వతీరములను
నొరసి యిరుదెసలను దాఁకుచుండునంట!
ఎట్టులో యెందఱినో కాని యిట్టె మ్రింగి
తా నసహ్యించుకొనునఁట! దానికేమి
అదయతయు నదాక్షిణ్యంబు ననెడుగట్ల
నవశులైన యసంఖ్యాకులైనజనుల
నివి వెడలఁగ్రక్కుచున్నది యేమిచెప్ప!
నెమ్మదిగ నున్నయట్లు కాన్పించుచుండి
ఘోర మగుభంగపాటును గూర్చునిదియె
అలతుపాను జనించెడు నపుడు రేఁగి
యఖిలమునుగూడ భ్రమింగుచున్నదియు నిదియె

ఈయగాధసముద్రము నెఱిఁగియెఱిఁగి
ఈమహాఘోరవారాశి నెఱిఁగి యెఱిఁగి,
ఇఁక నడుగుఁ బెట్టెదరె మఱి యెవ్వరైన
నింక నమ్మెదరే దీని నెవ్వరైన ?—

(19-7-1917.)

# 73 వసంతలక్ష్మి.



అరయఁగ షడంకపరిమితమైనదాని
వత్సరాభిధానంబున వఱలుదాని
జిత్రనాటకమును బ్రదర్శించుచున్న
కాలసూత్రధారికి నమస్కారశతము.

---

సూత్రధారుఁడు నిపుణుఁడే యాత్రమేల ?
ఒక్కటికి వెన్క మఱియొక్క టున్నయపుడు
తెరల నన్నింటి నొకమాటె తీయుటెట్లు ?
చూప నన్నింటి నొకమాటె చూచుటెట్లు ?

తొలుతఁ గన్నవసంతాంకవిలసనంబు
నేఁటి కిఁక రాకయున్నఁగానీ మఱొక్క
నాఁటికైనను మనము గానంగవచ్చుఁ
జూప ఱొకయింత తమకంబు నాఁపలేరె ?
పరిభమదృశ్యంబునకుఁ దెర పడినకతన
నగపడకయుండె నావసంతాంకమిపుడు
నీలమేఘుంబుచాఁటున నిలుచుకతన
మనకుఁ గనఁబడఁ డాచందమామ నేఁడు.
అయనచక్రంబు తిరిగినయపుడు మనకు
నావసంతాంకదృశ్యమే యద్భుతముగ
సూత్రధారుండు బ్రహ్మయుఁ జూపఁగలఁడు
మనన మొనరింత మందాఁక మనసునందె.

(23-7-1917.)



# 74 కుసుమమంజరి.

అనునిమేషము విచిత్రాకృతుల్ దాల్చి
యఖిలప్రపంచమహారాజ్యమునకుఁ
బట్టంపురాణివై పాలించుచున్న
ప్రకృతికి మ్రొక్కులు పదినూఱువేలు.

పరిదృశ్యమానప్రపంచరంగమున
నాకస్మికంబుగా ననపేక్షితముగ
బంధమోక్షంబులుఁ బాపపుణ్యములుఁ
గష్టసుఖంబులుఁ గలుగుచునుండు ;
నానందసరసిలో ననురాగసుమము
దుఃఖగంధంబుల దొరలించుచుండు ;
సంతాపవార్ధి నాశాతరంగములు
విమలమౌక్తికముల వెదచల్లుచుండు ;
శుక్తి మౌక్తికమయి చూపట్టుచినుకు
కడలిలోఁ బడి యుప్పుఁగ గలుగుచుండు ;
వంచకు వెగటైన యంబుదాగమము
నెమ్మికి నానందనిలయమౌచుండు ;

రాల్చెడు కొమ్మలు రాల్చుచునుండఁ
జిగురించు కొమ్మలు సిగురించుచుండు ;
నొకచేత మెఱయుచు నుండుకాంచనము
మఱియొక్క చేతిలో మాయమౌచుండు;
చెలువంపుఁదోడవుఁ జిగజిగ మెఱయు
మణి యొక్కతఱిఁ జచ్చుమం దగుచుండు ;
గడగడ సర్వాంగకములఁ దూలించు
చలిగాలి యొకవేళఁ జల్ల నౌచుండు ;
సురభిళకుసుమంబు శుష్కకంటకము
నొక్క గులాబియం దొడఁగూడినట్లు
గుణమును దోషంబుఁ గూడి యొక్కెడనె
యతివిచిత్రంబుగా నగపడుచుండు ;
కర్మపద్ధతిఁబట్టి కాలంబుఁబట్టి
మంచిచెడ్డలగతుల్ మాఱుచునుండు ;
నిట్టిచూచుచునుండ నింతటిమార్పు
లెట్లుకల్పించునో యెవరెఱుంగుదురు ?
కష్టంపుటేటిలోఁ గాతుకనొక
సంతోషజలధిలో సంతాపశిఖరి
యేల నిర్మించునో యెవ్వరికెఱుక ?

కోమరారు చెంగల్వకొలనితీరమునఁ
గుదురైన సురపొన్నగున్నకొమ్మలను
నంటియు నంటకయట్టె తూగాడి
కులికెఁ బొగడపూఁగొమ్మ మాయమ్మ,
మధుమాసయామిని మాధవుఁ గాంచి
పొడవున మాయమ్మ పులకించినపుడు
సొంపైన చిగురాకుజొంపంబునడుమఁ
బూసంత మేనితోఁ బుట్టితి నేను,
మాయమ్మతోఁగూడి మలయానిలమున
విలసిల్లు సురపొన్న విరిగొమ్మకూడ
నాతల్లి దనివార ననుఁ గన్నయపుడె
యుల్లంబు రంజిల్ల నొకమొగ్గదొడిగె
నారంబు లోఁగొని శ్రమల నందించి
సంతతసంతాపసంతతిఁ గూర్చి
కలఁగించుచుండఁగాఁ గన్నతల్లులకు
సంతాన మన నింతసంతోష మేమొ ?—
పొన్నయుఁ బొగడయు మున్నన్నకంటెఁ
గన్నులవేండువుగా నొప్పుచుండె ;
సురపొన్నక్రొన్నన సొంపొందుచోటఁ
జిగురాకుదువ్వల్వ చిక్కనిమెత్త

నే నుంటి నెండక న్నెఱుఁగకయుండఁ;
జందనానిల మిచ్చుజలశీకరముల
చలువల వెన్నెలచలువలఁ దోఁగి
యేకష్ట మెఱుఁగక యేమిర్వురమును
బొదలుచునుంటిమి పూఁటకుఁబూఁట:
నుల్లంబుపొంగార నొండొంటి నొరసి
కులుకుచుఁ గంటిమి కోరకాకృతులఁ;
బుప్పొడినెత్తావిఁ బొరయకమున్న,
తోరంపువిరిదేనె దొరలకమున్న,
వచ్చియు రాని జవ్వనపుఁగ్రొమ్మిసిమిఁ
జెలువారు చెలువలచెలువంబుఁ దెగడి
మనములఁ దనియించు మారూపుఁ జూచి
సంతోషమునవచ్చి షట్పదగణము
మాచుట్టుఁ దిరుగుచు మధురగీతముల
భావంబు దనియంగఁ బాడంగఁదొడఁగె
లలితవసంతవిలాసంబు గాఁగ:—
మంచిముహూర్తంబున మాకిర్వురకును
బసితనంబు దొరంగి పరువంబువచ్చె;
నెలజవ్వనంబు రేకెత్తంగఁదొడఁగె;
మలయసమీరకుమారుఁ డామెడనె

మాకమ్మతావుల మలయించెఁ గడలఁ;
దళతళమెఱయుచిత్రాస్వాతులల్లు
తనమానసంబును దనియించుమమ్ము
బాలచంద్రుఁడు సూచి పకపకనగియె;
మావికాసంబును మావిలాసంబు
మాయనురాగంబు మాచెల్మిఁ జూచి
మకరందమునకంటె మఱివన్నెహెచ్చు
మధురస్వరంబుతో మాపేరిమీఁదఁ
గలకంఠ మింపుగా గానంబు సేసె;
వేగున నిండాక విరిసినమమ్ముఁ
గని వెల్లనగుచు నక్షత్రంబు లెల్ల
మాలోనఁ బొంగారు మకరందమందుఁ
దమరూప మొకసారి తలుకు మన్నంత
నదిగదా ధన్యత యని పొంగిపోయె;—
ఎడఁబాయకున్న మాయిరువురిచెలువు
నూతనానందమనోరమం బయ్యె;
నిరువురిపరిమళ మేకమై దెసలఁ
జెలువొందఁ గడునుల్లసిలె నొక్కరజని;
యెల్లదిక్కులనుండు నిందిందిరములు
పండువెన్నెలవోలె బయలెల్ల విరియు

వలపులచే నానవాల్పట్టి వచ్చి
మధురామృతముకంటె మాధుర్యమగుచు
మాలోన నిండారు మకరంద మాని
సమ్మదంబునఁ బొంగి స్వాంతంబు లలర
మధురాకృతుల నొప్పు మామూలమునను
వఱలె వసంతాప్తి వసుమతి యనుచుఁ,
బొగడపొన్నల నేము పుట్టుటకతనఁ
బ్రమదావనంబు సార్థక మయ్యె ననుచు,
భావంబు లిగురింపఁ బాటలు వాడె :—
ఆకులచాటున నగపడకుండఁ
గానంత మేనితోఁ గ్రాలుచుండినను
బొగడంగఁ దగునట్టి పూవుల మగుట
నిఖలభూభాగంబు నిండె మాతావి ;
పరితూష్ణపవనసంపత్తితోఁ గూడి
పరిపూర్ణమయ్యె మాపరువంబుఁగూడ ;
నుదయరాగంబుతో నొక్కింత సేపు
మిలమిలలాడుచు మేమాడుచుండ
బాలసూర్యుఁడు తనబాహులు సాఁచి
పరువంపుమామేన బంగారుపూసె :—

* * * *

సకలలోకామోదసరణిఁ జేకూర్చు
నీవసంతంబెప్పు డిట్టులేయుండి
యలరింపవలె నని యాశలు మాకు!
మోహనసంగీతమును బాడుకొనుచు
నళులు మాతావుల నరయుచు వచ్చి
మురియింపవలె నని ముచ్చటల్ మాకు!
చలువగందపుఁగొండ చక్కటినుండి
చిఱుతమారుతములు చెంగటఁ జేరి
వలపింపవలె నని వాంఛలు మాకు!
జగతికంతకు సుధాసారంబుఁ జిలుకు
పండువెన్నెలలు మా యిరువంపురూపు
వెలయింపవలె నని వేడ్కలు మాకు!
చిగురాకునను సెజ్జ చెదరకయుండ
మముఁ బ్రియంబునఁ జేర్చి మాతల్లు లెపుడుఁ
గులికింపవలె నని కోర్కులు మాకు!
నిగనిగలాడు మానెమ్మనులందు
మవ్వంబు సెడకుండ మాకోర్కు లిట్లు
ఫలియింపవలె నని భ్రాంతులు మాకు!—
అవని జీవులయాశ కంతంబు లేదు;
ప్రకృతి కెప్పుడుఁ గృపాభావంబు లేదు;

ఈవసంతం బిట్టులే యుండియుండి
యేరీతి మాఱునో యెవ్వరి కెఱుక?
ఈయళిసంగీత మేవేళ కెట్టు
లేమయిపోవునో యెవ్వరి కెఱుక ?
ఈమలయానిలం బిటునటుఁ దిరిగి
యెటువచ్చి యెటులౌనొ యెవ్వరి కెఱుక ?
ఈచల్వ రేయెండ యింతలో జరగి
యేయెండ గాయునో యెవ్వరి కెఱుక ?
ఈనునుజిగురాకు లీరీతినుండ
నేకాఱువచ్చునో యెవ్వరి కెఱుక ?
విరిసినకోర్కుల విలసిల్లుమేని
కేపాటువచ్చునో యెవ్వరి కెఱుక ?
ఏమని చెప్పుదు మేకైకనిమిష
పరిణామశీలయౌ ప్రకృతిచందములు :—
ఏగాలిచేసె మ విస్మృంతటివాని
నాగాలియే వచ్చి యట్టె తూలించి
మాబంధ మెడలించి మమ్ముఁ గొంపోయి
యంతరాళంబున నటునిటుఁ ద్రిప్పి
పచ్చికబయటను బడఁద్రోసిపోయెఁ;
బొన్నపూగొమ్మను బొగడయున్నదియౌ ?

పొగడయే యున్నదో పొగడపూఁగొమ్మ ?
నూహింపరాకుండ నొకరీతినుండి
యిరువురిపరిమళం బిది యది యనుచు
విభజింపరాకుండ విలసిల్లుచుండి
యెన్నియో కోరిక లీరికలెత్త
నెంతయో సంతోష మిగురించుచుండఁ
బాపపుదైవమో ప్రకృతియో యేదో
బంధంబు దెగఁగోసి పగఁదీర్చుకొనియె :—
తల్లిగర్భమునుండి తరలినవేళఁ
గోరకాకృతిఁ బండుకొనియున్నవేళఁ
గనువిచ్చి జగమెల్లఁ గాంచినవేళఁ,
నేవేళ గణియింప నెట్టిదో కాని
యిట్టి మా కీవేళ కీపాటు గలిగె ;
పరికింపఁ జెలిమియుఁ బగయును లేక
యంతలోనన మార్పు నందించుచున్న
యీప్రకృతిని మన మే మనఁగలము ?—
భిన్నభావంబుల భిన్నతేజముల
భిన్నగుణంబుల భిన్నరూపముల
నగపడుచుండు నీయఖిలజగంబు
నేక తేజంబుననే యుద్భవించి

యేక తేజంబుననే వృద్ధిఁ గాంచి
యేక తేజంబుననే లీనమంది
యేకీభవించుటయే సత్యమేని,
ఏకాకృతి వెలుంగు నీశ్వరుఁ డెపుడు
జీవులఁ దరియింపఁ జేయునయేని,
నిర్గుణుండైన యానిర్మలమూర్తి
సగుణుఁడై సేవావసర మిచ్చునేని,
ఏభక్తులైన మద్భిర్మరుపురఁ జేర్చి
గుణవిశిష్టంబైన కోవనుగూర్చి
విశ్వేశు నర్చించు వేళ రాకున్నె?
సచ్చిదానందపరిశాంతభావమున
నైక్యానుసంధాన మబ్బకయున్నె?
పొగడకుఁ బొన్నకుఁ బూవులమైన
వాసనావశత నీవాంఛ జనించె
నిది యపరాధ మంచెవ రనఁగలరు?

(15-12-1917.)



# 75 ఏనవ్వు నీకిష్టమే?

రతనాలఁ దులకించు రవణాలకంటె
నలరించు ముత్యాల హారాలకంటె
మురిపంపుఁ జిత్రింపు ముకురాలకంటె
నవ్వులే నవనవానందముల్ మాకు.

కెమ్మోవినవ్వు, చెక్కిలిచెంతనవ్వు
ముక్కుముంగలనవ్వు, మునిపంటనవ్వు
నుదుటిపై నవ్వు, కన్నులలోనినవ్వు
చూపులలోనవ్వు, చుబుకాన నవ్వు
మురిపంపునెఱనవ్వు, ముసిముసినవ్వు
చెలువంపుఁజిఱునవ్వు, చిన్నారినవ్వు
అలవోకనవ్వు, నెయ్యముగుల్కునవ్వు
పలువరుసలనవ్వు పరువంపునవ్వు
ఇన్నినవ్వులుగల విన్నింటిలోన
నెఱుఁగ మేనవ్వులో నేమున్నయదియొ
ఏనవ్వు నీకిష్టమే పువ్వుబోణి :—
కౌమరుఁబ్రాయమున దాఁగుడుమూఁతలందుఁ
జిన్నవోయినచెలి చిఱునవ్వునవ్వ

వేడుకబొమ్మలపెండ్లిండ్లవేళఁ
గల్లవియ్యపురాలు కలకల నవ్వెఁ;
గెలనిపెద్దలు చిటికెనఁబట్టు మనినఁ
గొసరుఁజూపులఁ బెండ్లికొమరుండు నవ్వె;
వరుఁ డొద్దనున్న బువ్వపుబంతివేళఁ
గులుకుఁబల్కులఁ దోడికోడలు నవ్వె;
ఇపుడు వచ్చినవార లెవ్వరే యనుచు
నన్నయిల్లా ల్మేలమాడుచు నవ్వె;
పేర్చికూర్చిన పూవుటెత్తు లెవ్వరికె
యనియాఁడుబిడ్డ హాస్యానకు నవ్వె;
బంగారుతొట్లలోఁ బసపుఁబొత్తిళ్లఁ
బొలబుగ్గలలోనఁ బసిపాప నవ్వె;
ఎఱుఁగ మేనవ్వులో నేమున్న యదియొ?
ఏనవ్వనీకిష్టమే పువ్వుబోణి !——
చెలువంపుగనిమైన చిన్నారిమొగ్గ
చిగురుటాకులలోనఁ జిఱునవ్వు నవ్వె;
ముత్యాలమూటయా మురిపంపుఁజుక్క
కటికిచీకటిలోనఁ గలకల నవ్వె;
వెలలేనిరతనాల వెన్నెలరేక
చదలేటితరఁగలోఁ జకచక నవ్వె;

ప్రాణధనంబైన బంగారుప్రకృతి
పరువంపుఁబ్రేమలోఁ బకపక నవ్వొ,
ఎఱుఁగ మేనవ్వులో నేమున్నయదియొ
ఏనవ్వు నీకిష్టమే పువ్వుబోణి!

---

మాకుఁ జెప్పకయున్న మానెదుగాని
తోడిపడంతులతో నైనఁగాని
యిపుడు గాకుండిన నెపుడైనఁగాని
ప్రేమ! చెప్పకయుండ లేవులే—కాని!

(11-8-1918.)



## 76 ఆత్మపూజ.

ఆనందమయు, సచ్చిదానందమయుని
నిర్వికల్పకరూపు నిత్యసంస్థితుని
నభవు ననంతు నిరాలంబు నజరు
నద్వితీయుని నన్ను నర్చించు టెట్లు?
విశ్వమంతయునిండి వెలుఁగొందునిన్ను
నావాహనముసేసి యర్చించు టెట్లు?
అఖిలలోకాధారుఁడై యున్ననిన్ను
నగ్రిపీఠంబిచ్చి యర్చించు టెట్లు?
స్వచ్ఛస్వరూపప్రసన్నుని నిన్ను
నర్ఘ్యపాద్యములిచ్చి యర్చించు టెట్లు?
నిత్యశుద్ధుండవై నెగడెడినిన్ను
నాచమింపఁగఁజేసి యర్చించు టెట్లు?
కమనీయనిర్మలాకారునినిన్ను
నభిషేకమొనరించి యర్చించు టెట్లు?
ముజ్జగంబుల గర్భమునఁ దాల్చునిన్ను
నంగవస్త్రంబిచ్చి యర్చించు టెట్లు?
లక్ష్మహీనుని నిరాలంబుని నిన్ను
యజ్ఞసూత్రంబిచ్చి యర్చించు టెట్లు?

భువనమోహనుఁడవై పొలుపొందునిన్ను
నాభరణాళిచే నర్చించు టెట్లు?
అనిశనిర్లేపకుం డైనట్టినిన్ను
నమలగంధంబిచ్చి యర్చించు టెట్లు?
వాసనాశూన్యత వర్తించునిన్ను
నలరులఁ బూజించి యర్చించు టెట్లు?
గంధహీనుండవై గ్రాలెడునిన్ను
నగరుధూపంబిచ్చి యర్చించు టెట్లు?
స్వప్రకాశుండవై చరియించునిన్ను
నాజ్యదీపంబిచ్చి యర్చించు టెట్లు?
నిత్యతృప్తునిఁ దత్త్వనిష్ఠుని నిన్ను
నమృతోదనంబిచ్చి యర్చించు టెట్లు?
కామ్యశూన్యుండనఁగా నొప్పునిన్ను
నమృతఫలంబిచ్చి యర్చించు టెట్లు?
అఖిలమయుండవౌ నఖిలేశు నిన్ను
నాకులఁ బోఁకల నర్చించు టెట్లు?
శుద్ధతేజస్వివై శోభిల్లునిన్ను
నారాత్రికంబిచ్చి యర్చించు టెట్లు?
అభవు నమూర్తి ననంతుని నిన్ను
నర్థిమై వలగొని యర్చించు టెట్లు?

అద్వితీయబ్రహ్మమై యున్ననిన్ను
నానతిఁ గై మోడ్చి యర్చించు టెట్లు?
అంతర్బహిష్పూర్ణుఁడై యున్ననిన్ను
నాగమముదరిల నర్చించు టెట్లు?
శ్రీమనోజ్ఞవిలాస! చిన్మయహాస!
విదళితభవపాశ! విశ్వలోకేశ!
నిఖిలలోకాధార! నిగమవిహార!
ఆనందమయరూప! యమృతకలాప!
ఏరూపముననైన నేవిధినైన
నేసూత్రమునన్నైన నేసూక్తినైన
నిన్ను సేవింపఁగానేరను గాన
నిన్నుఁ బూజింపఁగానేరను గానఁ
బరమాత్మునకు నీకుఁ బ్రభునకు నీకు
నఖిలంబునిండినయజునకు నీకు
నాత్మస్వరూపుండవై యున్ననీకు
సవరింతు నిదె నీకు సాత్త్వికపూజ—
నిత్యనూతనమయి నెగడునాయొడలె
యీశ్వరునికోవెలయనుచు భావించి
యీదేవళంబులో నేజీవుఁ డుండె
నాతఁడే పరమేశుఁడని తలపోసి

యాతఁడే పరమాత్ముఁడనుచు నూహించి
యాసదాశివుఁడె నేనని నిశ్చయించి
ప్రజ్ఞానమయసుప్రభాతంబుఁ గాంచి
యజ్ఞాననిర్మాల్య మట్లు తూలించి
యానంద మెనయ సోహంభావగరిమ
భావింతు సేవింతుఁ బ్రణుతిఁగావింతు—
ఇదియె సాత్వికపూజ యిదె యాత్మపూజ
యెల్లపూజలయందు నిదె మేటిపూజ
సచ్చిదానందవిజ్ఞానస్వరూప!
శాశ్వతానంతవిశాలస్వరూప!
సమధికానంతవిశ్వస్వరూపంబు
ఆత్మస్వరూపమే యైయున్నయపుడు
నీకు నాకును నాకు నీకును గూడ
నెంచిచూచిన భేద మేమున్నదయ్య?—
అదిగాన నేఁ బరమాత్మరూపునకుఁ
బరమపూరుషునకుఁ బరమధామునకు
నానందమయునకు నాదిదేవునకు
మదిలోననే ప్రణామంబుఁ గావింతు—
ఊపిరిబిగఁబట్టి యొక్కింతనిలిపి
ప్రాణవాయువులను బట్టి సాధించి

హితము సేయఁగఁజాలు నతనిడెందమున
దేహాభిమానమే దీపించుచుండు;
స్నానసంధ్యాద్యనుష్ఠానంబు లనుచు
జపతపోయజ్ఞసంస్కారంబు లనుచు
నఖిలక్రియలఁదీర్చు నతనిచిత్తమున
భోగాభిలాషయే పొడకట్టుచుండు;
సర్వజ్ఞుఁడై యున్న జ్ఞానిచిత్తమున
మొనసూపుచుండును మోక్షాభిలాష;
సతతసోహంభావ సంపన్నుఁ డెవఁడో
యభిమానశూన్యుఁడై యలరారు నతఁడె;
దివ్యతత్త్వజ్ఞాన ధీమంతుఁ డెవఁడో
యభిమానముండఁబో దతనికొక్కనికె;
ప్రళయకాలంబున బ్రహ్మాండమెల్ల
నంబుపరివ్యాప్తమైయుండునట్లు
విధివిశిష్టంబైన విశ్వమంతయును
నాత్మరూపంబుగా నగపడుచుండ
నిది విధాయకమంచు నేమిసేయుదును?
ఇచ్చోటు సతమంచు నేకడ నుందు?
ఇది నాదని గ్రహింప నేమున్నదింక?
ఇది కాదని త్యజింప నేమున్నదింక?
(18—10—18.)

# 77 పరిణామము:

భూతభవ్యభవద్భావబోధ్యమైన
కాలమున కించుకయు మార్పు గలుగఁబోదు
గాని దానిగర్భంబులోఁ గలసిపోవు
వివిధపరిణామసంతతుల్ వేనవేలు.

రక్తవాహినిలోపల రాజ్యలక్ష్మి
రాజ్యశాసనములలోన రక్తవృష్టి
విమలరాగాంకురమున విద్వేషరేఖ
ద్వేషతమసంబునను రాగదీపకళిక
అమృతవారాశిలోపల హాలహలము
నీలమేఘంబులోపల మేలిమెఱపు
పుట్టి పొడసూపుచుండు టబ్బురమె కాని
యేనియతిచేతఁ బుట్టునో యెవ్వఁ డెఱుఁగు?
వెనుక నేమున్నదో కనుంగొనఁగలేము
ఎదుట నేమి కానున్నదో యెఱుఁగలేము
కార్యకారణరూపసంఘటనములకు
మూలసూత్రంబు గనుఁగొనఁజాలఁగలమె ?—
తలఁపుదరఁగలఁ దిరుగురత్నాలనౌక

యబ్ధిగర్భంబులో భగ్న మైనయపుడు
మేలిసాబఁగులఁ దూఁగుముత్యాలపేరు
పాయ లెడలంగఁ ద్రిుటితమై పోయినపుడు
పూవుగుత్తుల విలసిల్లుతీవచెలువ
భూరిదావాగ్ని పాలయిపోయినపుడు
గాంచి యొకసారి విభ్రాంతిఁ గాంచుకంటె
వేఁడినిట్టూర్పు నొకసారి విడుచుకంటె
నూర్చి యొకసారి కంటినీ రొద్చుకంటెఁ
ఇంతిలుటకంటె నెవ రేమి చేయఁగలరు?

(9-10-1919.)

# 78 ఉత్కంఠ.

వేణుగానరవంబు వినవచ్చెనేమొ
యమునలో నప్పుడే యమృత ముప్పొంగ;
ప్రియసఖి! చెప్పవే వ్రేపల్లెనుండి
బయలుదేరెనఁటమ్మ! బాలకృష్ణుండు?
శిఖిపింఛ కాంతులు సెలరేఁగ నేమొ
తరుపత్రములలోనఁ దళతళల్ పుట్టె;
ప్రేయసీ! యప్పుడే బృందావనమునఁ
గొలువు దీర్చునఁటమ్మ! గోపాలమూర్తి?
గిరిమల్లికలతావి గిఱికొన్న దేమొ
యాభీరమండలం బవశమైపోయె;
కల్యాణి! చూడవే కన్నులఁ గప్పి
మోసగించునొ యేమొ మోహనమూర్తి?

(8-11-1919.)

# 79 సాంత్వనము.

కోమలజాతీనికుంజాంతరమున
నోరు తెఱువంగకయుండ నొంటిగా నుండి
యస్ఫుటస్వరముతో నతినిగూఢముగ
నిది యేమొ ప్రియసఖి ! యేడ్చుచున్నావు ?
మనసు ద్రిప్పఁగ లేక మాటాడలేక
మాఱుసేయఁగ లేక మరు లోపలేక
వేఁడి నిట్టూర్పులు విడుచుచున్నావు
తలఁప నెంతటివెఱ్ఱిదానవే తల్లి !—
తులసికావనములోఁ దూఁగుటుయ్యెలలఁ
దూఁగుచు నీమాట దోఁచిన నులికి
ప్రియుఁడు వేణువు నూఁది పిలుచుచున్నాఁడు
లేవమ్మ చెల్లెలా ! లేచి రావమ్మ !

(4-12-1919.)

# 80 ప్రణయగీతములు.

కాళీయఫణిఁ జూచి కార్చిచ్చుఁ జూచి
వెఱ్ఱిగోపికలార! వెఱచెద రేల?
కొదవ లన్నియుఁ దీర్చుగోపాలమూర్తి
మీపాల నుండఁగా మీకేమిభయము?

* * * *

గోపాలకుల వీడి గోవుల వీడి
పాడుచు నాతోడఁ బరుగెత్తి వచ్చి
బాలకృష్ణుఁడు చాలబడలినాఁ డమ్మ!
విరజాజిచెల్లెలా విసరవేమమ్మ!

* * * *

రాసమండలములో రాధికారమణి
బాలకృష్ణునిలీల భావించి సొగసి
తన్మయత్వంబుచేఁ దన్నుఁ దామఱచి
సుఖయించుచుండఁగాఁ జూపోపలేక
షట్పదస్వరముతో ఝంకరించెదవు
మతి లేదఁటే నీకు మల్లికావల్లి?

* * * *

మమత గ్రిమ్మినదమ్మ మధురరూపమునఁ

దెలివి దప్పినదమ్మ ! దివ్య తేజమున
మధురమోహానునిపై మనసు నిల్పుటయె
యపరాధ మౌనఁటే యళినీమతల్లి !

*

ధరణీధరము నెత్తి దావాగ్ని మ్రింగి
చెలువు గందకయుండఁ జిన్నికృష్ణుండు
రాసమండలములో రమణు లందఱకు
వినిపించుచున్నాఁడు వేణుగానంబు
కన్ను లున్నఫలంబుఁ గనుఁగొంద మమ్మ !—
కామినీమణులార ! కలసి రారమ్మ !—
దెసలెల్లఁ దెలివందెఁ దిమిరంబు డిందెఁ
జలువ తెమ్మెర వీచె జాబిల్లి దోఁచె
మనసులోఁ గుందుచు మానదర్పమున
నెన్నాళ్లు లిటులున్న నేమగునమ్మ !
జగదేకవిభుఁ డైన శ్యామసుందరుని
సుందరీమణులార ! చూడ రారమ్మ !

(10-12-1919.)

# 81 శృంగారము.

చ. అలుక వహించనేమొ! హృద
యాధిపుఁ డింటికి రాఁడు; గాలిలేఁ
బిలుకలు వీచెఁ దుమ్మెదలు
పెనొ్రదఁ జేసెను, గూసెఁ గోయిలల్
సిలుకవజీరు బాణహాతి
చేఁ గడుఁ గాసిలఁజేసె, బోనునం
దెలుక తపించురీతిఁ గమ
లేక్షణ! నాహృదయంబు సొక్కెడున్.

చ. అలుక వహించు నేమె చెలి
యా? తడ వయ్యె ననంగఁ; దిట్టు; నో
చిలుకలకొల్కి యిట్టిరె వ
శీకృతభర్తృక లౌదు రం చనన్;
బిలుకవె యంచుఁ ద్రోయఁ గడు
బెగ్గిలు; భర్తృగృహంబుఁ జేర్పఁగా
నెలుకను బోనఁ ద్రోయునటు
లెంతు వనన్ బ్రతిమాలు బేలమై.

చ. చిలుకలు సెట్టు కొక్కటిగఁ
జేవఁదొలంగి మెలంగుచుండెడిన్

చిలుకటి నాతివల్కులు సె
విం బడినంతనె గర్వ మేఁది పా
మెలుకలతావుఁబట్టి చని
యెన్ శెలిగ్రొంజడఁ గాంచి చందురుం
డలుకవహించి క్షీణదశ
నందె సఖీముఖపద్మవీక్షణన్.
(కవిత్రితయము—కల్పలత.)

---

## 82 వీరము.

చ. పిలుకవు నీ వెఱుంగుదువె
విగ్రహమెట్టిదో? పంజరంబునన్
జిలుకనుబోలె నీదు జన
నీజనకుల్ నినుఁ బెంచి రింట; పే
రలుక జనింపనీయక గృ
హంబున కిప్పుడె పొమ్ము లేనిచో

నెలుకను సర్పరాజు మడి
యించినరీతి వధింతుఁబార్థజా.

చ. పిలుకవు నీవు నన్ను వెలి
పించెద వంతర మెంత నీకు నా;
కలుక జనించి నాదు విమ
లాత్ములు గెంజిగురాకుఁ జాయలం
జిలుకక మున్నె పామ్మ యము
శేఖర! దిట్టఁడనంట మాను క
ల్లెలుక నగంబు వ్రచ్చినను
హేంద్రుని వజ్రముఁ బోలనేర్చునే.

చ. అలుక వహించి పట్టఁగ ధ
రాధిపవర్యులు నీకుఁ జిక్క గా
దెలుకలు గారు శౌర్యవని
తేక్షణసంస్తుతపాత్రదోర్బలుల్
పిలుకటి పోవకున్న నన
పేక్షితనాకముఁ జూడఁ బుత్తు నేఁ
జిలుకల గండుపిల్లివలెఁ
జెచ్చెర మత్సరకాండవంక్తిచేన్.

(కవిత్రితయము—కల్పలత.)

# 83 మాతృమందిరము.

శ్రీనిధానంబు నిర్మల ప్రేమధాని
శాంతిధామంబు సౌఖ్యవిశ్రాంతిసీమ
జ్ఞానధనపేటి నిస్తులానందవాటి
మాకు ముమ్మాటికిని మాతృమందిరంబె.

నారదబ్రహ్మ దివ్యవీణాముఖమున
నభినవప్రేమరస మొల్కనట్టిచోటు,
తపసివాల్మీకి కవితామృతస్రవంతి
నాదికావ్యంబుఁ దేలించినట్టిచోటు,
మహితవిజ్ఞానధనులైన మౌనులెల్ల
నాగమాంభోధి మథియించినట్టిచోటు,
నరుఁడు దరియింపఁ గరుణించి పరమపురుషుఁ
డాత్మతత్త్వంబు బోధించి నట్టిచోటు,
అజ్ఞులకు విజ్ఞులను జూపునట్టిచోటు,
అనదలకు నాథ్యులను జూపునట్టిచోటు,
అన్నలకుఁ దమ్ములను జూపునట్టిచోటు,
అందఱకు నాత్మనిలయ మైనట్టిచోటు,
చనవు గలచోటు ప్రేమచేఁ దనరుచోటు

మహితమహిమాన్వితము మాతృమందిరంబె-

* * * *

జనని ! నీసన్నిధియె మాకు స్వర్గలోక
మమ్మ ! నీమాట మాకు వేదాక్షరంబు
తల్లి ! నీసేవయే మాకుఁ దారకంబు
మాత ! నీప్రేమ మా కాత్మమంగళంబు—
అమగుఁదమ్ముల మమఁగులై యంబునిధులు
నిన్ను సేవించుచున్నవి కన్నతల్లి !
అమృతపూర్ణకుంభంబులై యంబుదములు
నిన్నుఁ దేలించుచున్నవి కన్నతల్లి !
కేళికాసౌధసీమలై శైలతతులు
నిన్ను నలరించుచున్నవి కన్నతల్లి !
తావిక్రొవ్విరిసజ్జలై తీవగములు
నిన్నుఁ బూజించుచున్నవి కన్నతల్లి !
దివ్యగంధంబులై కమ్మతెమ్మెరలును
నిన్ను మెప్పించుచున్నవి కన్నతల్లి !
రమ్యదీపంబులై దివ్యరత్నములును
నిన్ను వెలయించుచున్నవి కన్నతల్లి !
పక్వఫలభాజనంబులై పాదపములు
నిన్నుఁ దన్పించుచున్నవి కన్నతల్లి !

భావగీతంబులను సర్వజీవతతులు
నిన్నుఁ గీర్తించుచున్నవి కన్నతల్లి!
అఖిలలోకలోకేశ్వరి వైననీదు
కొలువు సేరనివా రెందుఁగలరు తల్లి!—
జనని! నీసేవ లేక జీవనము లేదు
తల్లి! నీప్రాపు లేక స్వాస్థ్యంబు లేదు
అమ్మ! నీపెంపు లేక సౌఖ్యమ్ము లేదు
దేవి! నీదయ లేక మేదియును లేదు—
కష్టదుస్తరగహనమార్గముల నలసి
కరుణరసవాహినీతరంగముల నీఁది
విలులితాశాప్రభంజనములను దూలి
ఘనతరాభిమతాద్రిదుర్గములఁ బ్రాఁకి
తిమి గాని యిందాఁకఁ దెలివి దప్పి
నిన్నెఱుఁగఁజాల నైతి మో కన్నతల్లి!
ఇష్టవస్తువు లెల్ల నీ విచ్చుచుండ
నందికొనఁజాల మైతి మో యఖిలజనని!
విస్ఫురనినాదములను సంగీతరవము
వినఁబడునఁటమ్మ! నీచెంత [illegible] నని!
తీవ్రకోపాగ్నిలో శాంతదీపకళిక
గనఁబడునఁటమ్మ! నీపొంతఁ గన్నతల్లి!

అనుపమప్రేమభిక్షంబు నందఁగోరి
వెడలివచ్చితి మమ్మ! నిన్ వెదకికొనుచు
నాత్మసంతానమైన మ మ్మాదరించి
దేవి! కరుణించి యాశీర్వదింపుమమ్మ—

* * * *

తల్లి నిన్నుఁ దలంచి ధర్మంబుఁ దలఁచి
కష్టంబు సుఖములోఁ గడపివచ్చితిమి;
చౌర్యవృత్తిఁ జరింపఁ జాలఁగాలేక
యాఁకలి దృప్తిలో నడఁచివచ్చితిమి;
పరుషభాషణములు వలుకఁగాలేక
క్రోధంబు శాంతిలోఁ గూల్చి వచ్చితిమి;
దయ దప్పి రక్తపాతము సేయలేక
వైరంబు మైత్రిలో వదలి వచ్చితిమి;
ఆశాప్రలోభాప్తి నల్లాడలేక
మమతను సమతలో ముడపి వచ్చితిమి;
జయ సుధామయ[illegible] జయ దివ్యశక్తి!
జయ సర్వజనయిత్రి జయ జగద్ధాత్రి!
ఆదిశక్తివి నీ. వనాదివి నీవు
వి[illegible]వవిద్యవు నీవు
[illegible]నీవు వాంఛవు నీవు

దైవతంబవు నీవు తల్లివి నీవు
నీవె మాదిక్కని నెమ్మది నమ్మి
నిన్నుఁ జేరితి మమ్మ నిత్యకల్యాణి—
ఆపగావళులలో నమృతంబు నించి
ఫలపుష్పములు వనస్పతులఁ గల్పించి
భూరికేదారభూములను బండించి
సకలదేశంబుల సర్వస్వ మొంచి
యాత్మసంతతులలో నైక్యంబుఁ బెంచి
మాకోర్కు లీడేర్పు మా కన్నతల్లి !—
వేయిగన్నులతల్లి వేల్పులతల్లి
పాడిపంటలతల్లి బంగారుతల్లి
సింగారములతల్లి సిరిగలతల్లి
కడుపుసల్లనితల్లి గారాలతల్లి
యెత్తి పెంచినతల్లి హితమైనతల్లి
పేరు మోచినతల్లి ప్రియమైనతల్లి
పలుకుదీయనితల్లి పాలించుతల్లి
సైరణ గలతల్ల పసి గలతల్లి
సౌభాగ్యములతల్లి చనవైనతల్లి
సంసారములతల్లి చల్లనితల్లి
పిల్లలు గలతల్లి పెద్దలతల్లి

తల్లులఁ గనుతల్లి తండ్రులతల్లి
'కనికారముల' తల్లి ! కన్నబిడ్డలము
మమ్ముఁ బాలింపవే మాకన్నతల్లి !
(10-4-1920)

---

## 84 ప్రబోధము.

గీ. అందఱకు నొక్కతెయె తల్లి యన్నలార !
అందఱకు నొక్కఁడే తండ్రి యన్నలార !
అందఱకు నొక్కటే గతి యన్నలార !
అన్నలము దమ్ములము మన మయ్యలార !
గీ. దారధనపుత్త్రవాంఛల బాఱిఁ గూరి
తెలివి యుండుటచేఁ బశువులను మించి
విశ్వసోదరభావంబు విస్మరించి
తల్లడిల్లుచునుంటిమో తమ్ములార !—

గీ. తాను దనపండు దినఁబోదు తేనెయరఁటి
తాను దనపాలఁ గ్రోలదు ధన్యసురభి
తాను దనతావిఁ గ్రోలదు తమ్మిపూవు
జగతిలో నరుఁ డొక్కఁడే స్వార్థపరుఁడు :—

గీ. ధారుణీదేవి భరియించుతల్లి మనకు
ధాత్రిదేవత పోషించుతల్లి మనకు
సఖిలజీవులఁ దనకడుపారఁ గన్న
తల్లి భూదేవి యొక్కరిధనము గాదు—

గీ. ఒకని ముట్టుటదోష మొండొకనిచెంత
నొలసి యుండుటదోష మొండొకనితోడ
మాటలాడుటే దోష మిదేఁటిమాట?
హరిహరీ! యేకగర్భజులైనమనకు!—

గీ. పేదలగు సోదరులనోట బెడ్డఁగొట్టి
యనుభవంబునకందు సత్యఫికవృత్తి
ధనము ధాన్య మార్జించి పెత్తనము సేఁత
వసుపతిత్వమె తస్కరత్వంబు గాక?—

గీ. పొట్టకును బట్టకును లేక పొక్కిపొక్కి
కోడిబిడ్డలు మలుమల మాడుచుండఁ
గోటలును బేటలును గల్గి కులుకుచుంట
ముష్కరత్వంబు గాక ప్రభుత్వమగునె?—

గీ. కలిమి గలవారు లేనివారలకు మగలు
లేనివారలు గలవారిలెంక లనుచుఁ
దలఁచి వర్తించుచున్నంతదనుక మనకుఁ
బాపనిష్కృతిలేదయ్య భ్రాతలార!

గీ. సకలజీవసంతతులకుఁ జాలినంత
యన్నమును గూర్చుచున్నది కన్నతల్లి;
కడుపుగాలెడి తమ్ములకన్న మూసి
యారగింప నోరాడునే యన్నలార ?—

గీ. కలిమిలేముల భేదముల్ గొలఁదిగొప్ప
భేదములు జాతిభేదవివాదములును
దలఁపవలదయ్య! సర్వసౌదర్యదృష్టి
నతులం గూర్పుఁడయ్య! మాయన్నలార!—

గీ. ఏకఫలభోగకాంక్షచే నెట్లు పక్షు
లేకవృక్షాశ్రయంబున నెసఁగునట్లు
యేకఫలకాంక్షచే మన మేకదేశ
మాతఁ గొలువంగవలెనయ్య భ్రాతలార!—

సీ. మనమహారాజు లాత్మశ్రీ స్వభోగార్థ
మే కల్గలే దని యెంచుదాఁక
మనభూమినాథు లాత్మకుటుంబభుక్తికే
తమకల్మి గా దని తలఁచుదాఁక

మనవణిగ్వర్యు లాత్మప్రవృత్తి ధనాభి
వృద్ధికే యనుబుద్ధి విడుచుదాఁక
మనలోన మన మొక్కజననిగర్భమునుండి
యరుగుదెంచితి మని యరయుదాఁక
శాత్రవోపద్రవంబుఁ దస్కరభయంబు,
భీమదుర్భిక్షపీడ విభేదబాధ
తొలఁగిపోదయ్య! యిఁక శాంతి నిలువదయ్య
యాత్మసంరక్ష లేదయ్య యార్యులార!

(19-5-1920.)

# 85 గీతాఽసారము.

అమృతబిందు స్వరూపుఁడై యమలుఁడగుచు
నఖిలశక్తిస్వరూపుఁడై యజరుఁడగుచు
నఖిలమునునిండి యఖిలంబు నరయునట్టి
సచ్చిదానందునకు నమస్కారశతము.

---

ఆనంద ముదయించె నాశలు మించె
ననుకూలపవనంబు లల్లనే తెంచె
నాపాశ మరుదెంచె నంద ఱొక్కటిగఁ
జనుకునెచ్చెలులార! చేరి రారమ్మ!—
ఒండొంటి నెడఁబాసి యొంటిగాఁబోయి
ఇనకరానలములో నింకుటేగాని
తలిరాకు నొకటైనఁ దడుపంగఁగలమె?
సేద దేర్తుమె యొక్క చిఱుమొగ్గనైన?
నల్పాణురూపుల మైయున్న మనము
ప్రత్యేకముగ నేమి పనిసేయఁగలము?
పదులు నూఱులు వేలు పదివేలదాఁకఁ
గోటి కోటులదాఁకఁ గూడితిమేని
నఖిలజీవులతోడి యవని మండలము

నందఱ మొకటిగా నైక్యమైనప్పు
డంతరాయములేక యానంద లీల
ధరణీతలమునకుఁ దరలిపోఁ గలము
కాలుపెట్టినచోటఁ గనకంబు గురియు
బంగారు తీఁగల బండింపఁ గలము
నవరత్నములు రాల నవ్వినచోట
విరజాజిపువ్వుల విరియింపఁ గలము
శుభములు వెలయంగఁ జూచినచోటఁ
జిగురుతోరణములఁ జిత్రింపఁ గలము
భూమిరాజముల నెల్లఁ బోషింపఁగలము
పశుపక్షిమృగములఁ బ్రదికింపఁ గలము
నదులలో నౌకల నడిపింపఁ గలము
జనుల కోరికలెల్ల సమకూర్పఁ గలము
అల్ప బిందువులమేమనుకొంటిరేమొ?
మనతోడ నెవరు సమానులున్నారు?
చినుకు లేకుండిన జీవంబు లేదు
చినుకు లేకుండిన సృష్టియే లేదు
చినుకు జీవనమైన జీవులఁ గలసి
ప్రకృతిరాజ్యంబును పాలింపవలయు.
నాషాఢ మరుదెంచె నందఱొక్కటిగఁ

జనుకునెచ్చెలులార చేరి రారమ్మ !—
జననికాదంబిని సమ్మోదగరిమ
విశ్వరూపముఁదాల్చి వినువీథి నిల్చి
విజయమంగళయాత్ర వెడలు బిడ్డలను
వేయిఁగన్నులతోడ వీక్షించుచుండె
దివ్యగీతములతో దీవించుచుండెఁ
బయనంబు సేయించి పంపించు చుండె
నాపాథ మరుదెంచె నందఱొక్కటిగఁ
జనుకునెచ్చెలులార చేరి రారమ్మ !—
మందహాసానన మండలం బలర
ధన్యురాలైన సౌదామనీ దేవి
మన సోదరీమణి మనముందు నిలిచి
యనుపమ ప్రేమ కటాక్షమాత్రమున
నజ్ఞాన తమసంబు నడఁగించి వైచి
సుజ్ఞాన దీపంబుఁ జూపుచునుండె
నాపాథ మరుదెంచె నందఱొక్కటిగఁ
జనుకునెచ్చెలులార చేరి రారమ్మ !—
మన బలంబెఱుఁగక మసలుటే కాని
ప్రకృతిలో మనకంటె బలవంతులెవరు!
ఈనాఁటివారమా యేనాఁటివార

మిప్పటిశక్తియా యీ మనశక్తి
దేశవిదేశముల్ తిరుగఁ గాఁ గలము
పర్వతంబులనైన బ్రాఁకఁ గాఁ గలము
ఎంతవారలనైన నెదిరింపఁగలము
మొనసి శరంబుల ముంపఁ గాఁ గలము
విపుల వాహినులమై వెషలంగఁ గలము
కదలి దిగ్విజయంబుఁ గావింపఁ గలము
ఘళఘళ ధ్వనులతో భేరులు మ్రోఁగ
జయజయ ధ్వనులతో జరగిపోవుదము
ఆషాఢ మరుదెంచె నందఱొక్కటిగఁ
జినుకునచ్చెలులార చేరి రారమ్మ !—

(18-8-1920.)



# 87 ప్రేమోన్మాదము.

సుందరాకారంబుఁ జూచి నే వలచి
యడుగుఁదమ్ములఁ బొరలాడి వేఁడితిని ;
అది యేమిపాపమో యదివఱ కున్న
కాసంతచనవును గడ తేఱిపోయె :—
కన్నులముం దున్న కల్పభూరుహము
చెంగున ముడిచినజీవరత్నంబు
తిలకించుచుండఁగాఁ దెలియకుండఁగను
మంతరించినయట్లు మాయమైపోయె—
మిలమిలఁ గన్నుల మెఱసినరూపు
తలఁపుల కందక దాఁగిపోయినది ;
జిలజిల నమృతంబుఁ జిలికెడివలుకు
చెవులకు దవ్వులఁ జేరిపోయినది ;
ఆతనిపేరైన నతనియూరైన
నించుకంతయుఁగూడ నెఱుఁగలేనైతి :—
ఆతనియడుగులో నడుగులువైచి
తరుణి ! నామదిగూడఁ దరలిపోయినది;
కన్నుఁ గప్పినయట్టి కల్యాణమయుని
చిత్తంబు కరఁగించి సేవింతమన్న

నాతనిపేరైన నతనియూరైన
నడుగంగ లేనైతి నాలింపనైతి :—
కన్నులు కన్నులఁ గలపి చూచితిని
వెఱ్ఱినై హృదయంబు విచ్చిచూపితిని
ఎఱుఁగనివాఁ డను నెడయింత లేక
చిఱునవ్వ్వఁ గన్నులఁ జేర్చి చూచితిని
ఆతనిహృదయంబు నరయకముందె
వేడుకపడి కోరి వెంగలినైతి
నాతనిపేరైన నతనియూరైన
నడుగంగ లేనైతి నాలింపనైతి :—
కాపట్యమును జూపు కనుచూపువాఁడు
చిత్త మాకర్షించు చిఱునవ్వవాఁడు
భావంబుఁ దనియించు పలుకులవాఁడు
నలినాక్షులఁ గలంచు నైజంబువాఁడు
ఒకపూవు విడిచి యొండొకపూవుఁ జేరి
పరిమళంబు గ్రహించు పద్ధతివాఁడు
దేశదేశంబులఁ దిరిగెడువాఁడు
ఆసలఁ గొలిపి నన్నలయించినాఁడు
ఆతనిపేరైన నతనియూరైన
నించుకంతయుఁగూడ నెఱుఁగలేనైతి :—

ముద్దులు గురియించు మోహనమూర్తి
యాకస్మికంబుగా నగపడ్డవేళ
విలసనంబులు సూచి వేషంబు సూచి
యేరాజతనయుఁడో యితఁ డనుకొంటి;
క్రమముగాఁ దెలిసె నాకఠినచిత్తుండు
శ్యామసుందరుఁడఁటే! జలజాయతాక్షి!
విలయసాగరచలద్వీచికాలీల
మునుకొని జగమెల్ల మునిఁగినయట్లు
భువనమోహనుని సుభ్రూభంగలీలఁ
గాంతాకులంబెల్లఁ గంపించుచున్న
నది యేమి వెట్టియో యతనిచెంగటికిఁ
బరువెత్తుచున్నవి ప్రాణవాయువులు
చెలువరో! చెప్పవే! జీవలోకమునఁ
గష్టంబులోననే కలదఁటే సుఖము?

(9-10-1920.)



# 87 వేగుఁజుక్క.

విశ్వసృష్టికి ముందె వెలిఁగిన వెలుఁగు
విశ్వమందిరములో వెలిఁగిన వెలుఁగు
విశ్వవిస్మృతి మాన్పవలసిన వెలుఁగు
విశ్వమూర్తి ధరించి వెలుఁగునుగాక !

కలకలనవ్వులఁ గలువలు విరియ
ముసిముసినవ్వుల ముత్యాలు కురియ
వన్నెలనవ్వుల వజ్రాలు నెరయఁ
బొలపంపు నవ్వులఁ బువ్వులు గురియఁ
దూరపుఁ గోనలోఁ దుహినాద్రిచెంత
నీలాలమేడపై నీటుగా నిలిచి
విశ్వమోహానరూప విజ్ఞానకళల
మెఱయించి జీవుల మేలుకొల్పెదవు ;
ఎవరికేఁ జెల్లునే యిది నీకుఁ దక్క
నెంతచక్కనిచుక్క వే వేగుఁజుక్క !—

* * * *

నాకలోకమునుండి నడతెంచువేళ
నుబుసుపోకకుఁ బాడుచుంటివో యేమొ

ఆకాశవీథిలో నానందరవము
వీనులవిందుగా వినఁబడుచుండె ;
రమణీయవల్లరీ రాగప్రశస్తి
కలకంఠ పంచమ గానానుభవము
షట్పదఝుంకృత స్వరమార్దవంబు
ప్రణవస్వరానంద భవ్యానుభూతి
భువనమోహనగానమున మేళవించి
యున్ముఖం బై యున్న యుదయరాగమున
నభిముఖం బై యున్న యానందలీలఁ
బార్థివలోకంబు పరవశం బంద
సరసగీతానంత చాతురి మెఱయ
స్వేచ్ఛాపదంబునఁ జేరి పాడెదవు ;
ఎవరికిఁ జెల్లునే యిది నీకుఁ దక్క
నెంతటి సుకృతాత్మవే వేగుఁజుక్క !—

* * * *

అరుణకాంతులు లేచు నాశలు తోఁచె
మలయవాయువులు కోమలగతి వీచెఁ
దూరుపుమొగసాల ద్వారముల్ విచ్చెఁ
బొడుపుఁగొండకుఁ దొలి పొడిమి వచ్చెఁ
గడలఁ గ్రిమ్మిన యంధకారంబు వాసె

వృక్షాగ్రములనుండి విహగముల్ గూసె
నిఖిలంబు వెలసెను నీరాక కతన ;
నెంతటి మహిమాఢ్యవే వేగుఁజుక్క !—

* * * *

పుణ్యం బగణ్యమై పొలిసినవేళ
ధర్మంబు మర్మమై తరలినవేళ
వీరం బసారమై వెడలినవేళ
పౌరుషం బడవులఁ బట్టినవేళఁ
బ్రతిభ యంతయు నేల పాలైనవేళ
సర్వశక్తులును నాశన మైనవేళ
నభిమానసామ్రాజ్య మడఁగినవేళ
సిరిఁ బాసి కను మూసి చింతించువేళ
గాఢాంధకారంబుఁ గ్రమ్మినవేళ
నొడలెఱుంగని నిద్రనొందినవేళ
నాత్మబంధునిరీతి నరుగుదెంచితివి ;
మేలెంచి దయయుంచి మేలుకొల్పితివి ;
సుప్రసన్నత నీదు చూపులఁ దోఁచె
సుప్రభాతంబు నీ సొబగులఁ దోఁచె ;
దేశికోత్తముఁ బోలి దేవునిఁ బోలి
మమ్మెల్లఁ గరుణించి మహితమంత్రంబు

నుపదేశ మొనరించి యుద్ధరించితివి
యెంతటియుపకారివే వేఁగుఁజుక్క !
దేవదాత్యముఁ బూని దినదినం బీవు
విచ్చేయుదువు రాత్రి వినువీథినుండి
యెప్పటిదానవో యెఱుఁగము గాని
యెచటికిఁబోదువో యెఱుఁగము గాని
స్వర్గంబు నీ నివాసంబని తెలిసె ;
నీమహాత్వంబు సన్నిధిఁ జేసికొనుట
మాకవీంద్రులకు నీ మంతనంబబ్బె ;
మా యాదికవితోడ మాటాడినావు
బాదరాయణునితో భాషించినావు
కాళిదాసునితోడఁ గలసికొన్నావు
నీనవ్వులోన యన్నిటిఁ జూడఁగంటి
మాగాము లెత్తిఁగింపుమా వేగుఁజుక్క !—

* * * *

స్వార్థంబెఱుంగని స్వర్గధామమున
వీరాసనంబుల విహరించునట్టి
ధర్మాసనంబులఁ దనరారు నట్టి
సింహాసనంబులఁ జెలువొందునట్టి
చిత్రాసనంబులఁ జేరియున్నట్టి

పుణ్యుల మాపూర్వ పురుషులమాట
యూహించి యడిగెద నొకమాట నిన్ను
దూతకృత్యముమాట దూరమందుంచి
ప్రేమచేనైనను బేర్కొనవచ్చుఁ
గృపచేతనైన నెఱిఁగింపవచ్చుఁ
బరమార్థమునిధియైనఁ బలుకఁగావచ్చు
నభిమానవశత నిన్నడుగుచు నుంటి
మాదరంబునఁ దెల్పుమా వేఁగుఁజుక్క !—

* * * * *

శ్రుతిహితాచారవిశుద్ధులు వారు
చిరతరయోగ సంసిద్ధులు వారు
భువనకళ్యాణప్రబోద్ధలు వారు
వీరధర్మాచారవేదులు వారు
నిత్యసత్యవ్రత నిరతులు వారు
పరతత్త్వవిద్యా ప్రభావులువారు
శాంతమూర్తులు వారు సరసులు వారు
ధర్మమూర్తులు వారు తండ్రులువారు
మా విమూఢత నెంచి మమ్ము మన్నించి
విజ్ఞానతేజంబు విలసిల్లుకొఱకుఁ
దీక్షారణంబుగ మమ్ము దీవించినారె ?

యేమైన సందేశ మెఱిగించినారె?
వేవేగ వచియింపవే వేగుఁజుక్క!—

* * * *

కాలవశంబున గతమును మఱచి
యజ్ఞానవశమున నఖిలంబు మఱచి
పెద్దలగతి వీడి పెడత్రోవఁ బట్టి
మలినవృత్తుల మైనమాట నిజంబె;
శ్రుతిబాహ్యులము గురుద్రోహుల మగుట
ననుతాపమునఁ జిత్త మవశమై యుండె;
పాటింప మైతిమి పరమార్థగతుల
నాచరింపఁగనేర మార్యధర్మముల;
వెలయఁ బ్రాయశ్చిత్తవిధి యెఱింగించి
మ మ్ముద్ధరింపు మమ్మ! వేగుఁజుక్క!—

* * * *

నీవు పుట్టినచోటు నీలాలడోల;
నీవు మెట్టినచోటు నీలాలనేల;
నీచుట్టునున్నది నీలాలనేల;
నిర్మలమణిమాల నీదివ్యలీల;
వేదాంతవీథుల విహరింతు వీవు;
వెలుగుచుందు వసంత వీథులందీవు;

శుభ్రమూర్తివి పరంజ్యోతివి నీవు ;
నీకళామాత్ర మీ నిఖలజగంబు ;
ఈప్రపంచంబునందే మెంచి చూడ
నణుమాత్రరూపుల మైనను గాము,
కాని, నీదగు ననుగ్రహ మున్నయెడల
నీవె నేమై యుందుమే వేగుఁజుక్క !

(20-10-1920.)

---

## 88 ఆత్మార్పణము.

పడఁతి నిన్ గోరుట బ్రదికినన్నాళ్లు
నేద్చుటకేయని యేనెఱుంగుదును ;
అగునైన జన్మజన్మాంతరములకు
నీప్రాప్తి కోరుదు నిన్నె యాచింతు-
నిఖిలేశ ! నీకృపాన్వితదృష్టియున్న
సద్ధర్మ మేఁటికి స్వర్గ మేమిటికి ?

దయతోడ నన్ను నీదరిఁ జేర్చుకొన్న
నితరసుఖంబు నా కేమిటికింక—
నీవె సూర్యుండవు నీవె చంద్రుఁడవు ;
నీకాంతిలోపల నే మునిగియుంటిఁ ;
గన్నులు చల్లగాఁ గాంచుటకంటె
నే నేమియునుగూడ నినుఁగోరలేదు;
సుందరాకార ! నాచూపులలోన
వెడలక యేప్రొద్దు విహరింపుమయ్య !—
కొంగున ముడివేసికొనఁగోరలేదు
అరసినీత్రోవల కడ్డురాలేదు
చిరకాలదాసినై సేవించుచుందు
సంతతానందంబు సమకూర్పుమయ్య !

(10-12-1920.)

# 89 కవితాకల్పవల్లి.

అమృత సురభిళ మృదులతాంతములతోడ
నమృత మధుపక్వ ఫలగుళుచ్ఛములతోడ
నమృతరస మాధురీమూర్తి వైననిన్నుఁ
గంటిమోతల్లి! సుకవితా కల్పవల్లి!
భూతభవ్యభవద్భావ పుణ్యసీమ
శాశ్వతేచ్ఛాక్రియాజ్ఞాన సౌధవీథి
భూర్భువస్స్వస్సమాక్రాంతమూర్తి నిన్నుఁ
గంటిమోతల్లి! సుకవితా కల్పవల్లి!
ఆద్యవీవు, కాలాపరిచ్ఛేద్య వీవు
మిన్నవీవు లోకాపరిచ్ఛిన్న వీవు
దివ్యశాంతసనాతన దేవి నిన్నుఁ
గంటి మోతల్లి! సుకవితా కల్పవల్లి!
జనని! ధర్మార్థకామమోక్షములు నాల్గు
నక్షరాకృతిఁ గనిమె నీయాకులందె;
పుట్టు మున్నిటఁ గడవంగఁబెట్టఁ బట్టుఁ
గొమ్మలున్నవి తల్లి! నీ కొమ్మలందె;
అంబ! శృంగారరసనవకం బనంత
రసమయతఁ గాంచె నీఫలరసమునందె;

జన్మజన్మాంతరోగ్ర వాసనలు డిందు
మాత ! నీదివ్యపుసుపరీమళముసందె—
సాధు పితృభక్తి శ్రీరామచంద్రునకును
గురువసిష్ఠుండు గఱపిన మెఱుంగుటాకు,
సత్యశీలంబు శ్రీహరిశ్చంద్రునకు
శిక్షచేసిన కౌశికు చిగురుటాకు,
త్యాగధర్మంబు నాశిబి ధర్మపతికి
మున్ను పక్షులు నేర్పిన మేల్పుటాకు,
భక్తిమార్గంబు ప్రహ్లాద బాలకునకు
నమరముని బోధచేసిన యలరుటాకు,
ధర్మసూత్రంబు పాండవోత్తమునకును
తాత భీష్ముండు చూపిన తలిరుటాకు,
సాంఖ్యయోగంబుఁ దల్లికి శైశవమున
బోధచేసిన కపిలుని ముదురుటాకు,
మోక్షతత్త్వంబు నరునకు మొగ్గరమునఁ
బరమపురుషుండు తెలిపిన పండుటాకు,
విశ్వజనయిత్రి ! నీమూర్తి వెదకి వెదకి
కంటిమోతల్లి ! సుకవితా కల్పవల్లి !—
మృదుల నవనీతమునకంటె మెత్తనైన
యలరులం దాల్చు నీచిగురాకొకప్పు



డలుఁగులకుఁ గూడఁ బుట్టిని ల్లగుట కేమి
కారణముతల్లి ? సుకవితా కల్పవల్లి !
చల్లని సుధామరందరసంబుఁ జిలుకు
చుందు నీపుష్పరాజి నొక్కొక్కవేళ
ఘోరకాకోలధార లొల్కుటకు నేమి
కారణముతల్లి ? సుకవితా కల్పవల్లి !
అఖిలము సృజించుశక్తి నీయందె కలదు
అఖిల మలరించుశక్తి నీయందె కలదు
అఖిల మడఁగించుశక్తి నీయందె కలదు·
కాదె మాతల్లి ? సుకవితా కల్పవల్లి !
విశ్వమంతయు నీలోన వెలుఁగుచుండె
వెలుఁగుచున్నావు నీవె యీవిశ్వమందు
ఇది యెఱింగిన ధర్మాత్ము లెంతమంది
కలరు మాతల్లి ? సుకవితా కల్పవల్లి !—
తల్లి ! నీపుట్టినిల్లు నందనవనంబొ ?
వికటదుస్సహభయద కంటకవనంబొ ?
జనని ! నీయునికి దివ్యతేజంబునందొ ?
ఘనఘనాక్రాంత గాఢాంధకారమందొ ?
దేవి ! నీవిచ్చునది మాకు దివ్యపదమొ ?
నిరతిశయ దుఃఖపరిభూత నరకపదమొ ?

భ్రమసి పలుమాఱు తర్కించి పాలుపోక
కలఁతనొందుట మాపనిగాదు తల్లి !
ఎవరునాఁటిరో ? నీ మొలకెత్తుటెపుడొ ?
ఎవుడు విరియించితివొ ? ఫలియించితెపుడొ ?
ఏది నీమూలమో ? యగ్ర మెచటఁగలదొ ?
తెలిసి తెలియనిబుద్ధితోఁ దెలియఁగోరు
నిట్టి సాంఖ్యప్రవృత్తి మాకేఁటికమ్మ !
మూఁడుగింజలకే యాఱు మొలకలైన
వేయిపువ్వులలో నూఱు కాయలైన
నేది యెటులైననేమి మా కేఁకలిగె ?
జనని ! నీసన్నిధియె మాకుఁ జాలునమ్మ !—
వెన్నుఁ గానంగనేరని వెంగలీఁడు
విశ్వమూలంబుఁ దెలిసికో వెదకులాడు,
అవనిపైఁ బ్రాఁకులాడు కీటాధములకు
హరజటాజూటదర్శన మౌనఁటమ్మ !
ఘనవసంతాప్తి విలసిల్లుఁ గనకవల్లి
జలదవేళ విరాజిల్లు జాతివల్లి
శరదుదయవేళ రంజిల్లు జలజవల్లి
నీకుఁ గలకాల మొక్కటే నియతి తల్లి !—
తర్కరాద్ధాంతముల మిన్న దన్నుఁగాక

వ్యాకరణసూత్రముల జాల మల్లఁగాక
ఆదిభౌతికదృష్టుల కందరాని
నిన్నుఁ గనలేఁడు సుకవి గాకున్నవాఁడు!
పదమలాకాశవాహినీజలకణములఁ
గురిసి నిన్నభిషేకించు శరసుకంటె
దేవి! నీకమ్మఁగొ్రవ్విరి దేనెఁగ్రోలి
సోలి యాడెడు తేఁటియే సుకృతిగాదె?
నీకుఁ గ్రొందళ్కునగల నెన్నిటినొ కూర్చి
సమ్మతి నలంకరించు వసంతుకంటె
నమ్మ! నీవిచ్చు కెంజిగురాకు మెక్కి
సొక్కి పాడెడుపిక మదే సుకృతిగాదె?
అమృతకరములఁ దనిపి నిన్నలరఁజేసి
కళలఁ బోషించు యామినీ కాంతుకంటె
జనని! నీఫలరసముల చవులుదెలిసి
సొలసి పలికెడు చిలుకయే సుకృతికాదె?
తావకీన మనోజ్ఞ సందర్శనంబు
పదమలానుభవైక గోచరము తల్లి!
వ్యాస పరమేశ్వరుని ధనుర్వల్లినుండి
ధర్మకర్మదివ్యాస్త్రముల్ తాఁకుటకును,
బుద్ధదేవుని మోహాస మురళినుండి

ప్రేమశాంతసంగీతముల్ వెడలుటకును,
శంకరుని విశ్వరూప తేజంబునుండి
విమల విజ్ఞానదీపముల్ వెడలుటకును,
లక్ష్మణాచార్య తద్గతోల్లాసలహరి
నిర్మలానందవీచికల్ నెగడుటకును
భవ్యనూత్నసనాతన ప్రకృతినిహిత
తావకీన సుగంధలతాంతకలిత
కమ్రమకరంద లేశంబె కారణంబు
గాదె మాతల్లి? సుకవితా కల్పవల్లి!
చల్లచల్లగ నమృతంబుఁ జల్లుచుండు
నీవిమలపాదపీఠంబు నీడఁ జేరి
కొల్లకొల్లగఁ దావులు గుమ్మరించు
నీవిలాసంపు టలరుఁ దేనియలఁ గ్రోలి
కమ్మకమ్మనిరుచుల మైకమ్ముఁ గ్రమ్మ
నీరుచిర పక్వఫలరసం బారగించి
కొదలుదీఱంగ మనసారఁ గోర్కెలూర
హాయి చేకూరఁ బారవశ్యంబుమీఱ
మమ్ము ననయమ్ము నాడుకోనిమ్ము తల్లి?
మమ్ము సతతమ్ముఁ బాడుకోనిమ్ము తల్లి!
మమ్ము నిత్యమ్ము వేఁడుకోనిమ్ము తల్లి!

కరుణాగలతల్లి ! సుకవితా కల్పవల్లి !
(3-12-1921.)

# 90 ఉదయగానము.

ఏడుకుండలు పొంగి యేకమైపోయె
ఏడుకొండలు క్రుంగి యిట్టట్టులాయె
ఏడేడులోకాల కెడము లేదాయె
ఏదిరా ! నీబుద్ధి యెందాఁకఁబోయె?
లేదురా ! నిద్రలో లేదురా ! సుగతి
చూడరా ! కన్నెత్తి చూడరా ! జగతి—

౨

అన్నదమ్ములు చేతు లందుకొన్నారు
ఆలుబిడ్డలు తారు లాడుచున్నారు
కన్నుమూయఁగ గంత గట్టుచున్నారు
కర్మమా ! యిదియేమి కదలకున్నావు
లేదురా ! నిదురలో లేదురా ! సుగతి
చూడరా ! కన్నెత్తి చూడరా ! జగతి-

3

నిలుపుచున్నారురా! నీటిలో నిప్పు
మెలపుచున్నారురా మెప్పులో ముప్పు
తెలుపుచున్నారురా! తెలివిలోఁ దప్పు
తేటుకోవేమిరా తెల్లవాఱినది
లేదురా! నిద్రలో లేదురా! సుగతి
చూడరా! కన్నెత్తి చూడరా! జగతి-

౪

ప్రొద్దు చెంగట సంజ పొంచున్నవేళ
సద్దుచేయక రేయి చనుచున్నవేళ
మిద్దెలోపలి దివ్వె మిన్నకున్నవేళ
తమ్ముఁడా! యీజోగు తగదురా నీకు!
లేదురా! నిద్రలో లేదురా! సుగతి
చూడరా! కన్నెత్తి చూడరా! జగతి-

౫

కొండకొమ్ములఁ బెద్ద గోలముట్టినది
నిండువెన్నెల చెట్ల నీడఁ బట్టినది
గండుతుమ్మెదలలోఁ గాటుపుట్టినది
గుండె లెట్లుండెరా గుఱ్ఱుపెట్టెదవు?
లేదురా! నిద్రలో లేదురా! సుగతి

చూడరా! కన్నెత్తి చూడరా! జగతి-

౬

మంచుపెందెరలపై మంచురేఁగినది
కంచుమేడలలోన గంటమ్రోగినది
పంచమధ్వని మింటఁ బర్వసాగినది
మించిపోయె నిఁకైన మేలుకోవేర?
లేదురా! నిద్రలో లేదురా! సుగతి
చూడరా! కన్నెత్తి చూడరా! జగతి-

౭

చిగురుఁగొమ్మలఁ జేరి చిన్నికోయిలలు
వగరుతుత్తుకలు నొవ్వఁగఁ బల్కుచుండ
నగరులోపలఁ జేరినారెల్లవారు
పగలయ్యె నింకేటి పడకరా నీకు ?
లేదురా! నిద్రలో లేదురా! సుగతి
చూడరా! కన్నెత్తి చూడరా! జగతి-

౮

భవబంధములెడల్చు బ్రహ్మణ్యమూర్తి
కాలపాశముఁ ద్రెంచు కైలాసమూర్తి
వారుణీశ్వరు నొంచు వైకుంఠమూర్తి
ఈత్రయీమూర్తి నీయెదుట నున్నాఁడు

వేయిచేతులు సాఁచి వెలుఁగుచున్నాఁడు
పేరుపేరునలేపి పిలుచుచున్నాఁడు
లేదురా! నిద్రలో లేదురా! సుగతి
చూడరా! కన్నెత్తి చూడరా! జగతి-
(11-12-1921.)

## 91 వేంకటేశ్వరస్తుతి.

శా. శ్రీ నీచెంతనె యుండ దివ్యతమ సు
శ్రీ దిక్కులందుండ నుం
తైనన్ దృప్తి వహింపలేనికిఁయ ని
త్యశ్రీసమాదాన దీ
క్షానైష్ఠుర్యమునందె భక్తజన వి
శ్వాసంబుఁ గల్పించి క
ల్యాణశ్రీలిడు నిన్నుఁగొల్తు మలమే
ల్మంగా మనోనాయకా!

శా. నీ కారుణ్యవిశేషసూత్ర మిటు రా
నీ కూర్తు మీపద్యముల్
నీకే పూవులదండఁగా మృదువుగా
నీ కాకపోనీ మదిన్
మా కాచింతయె లేదు నీవు గొనినన్
మాచేఁత లీడేరవే
మాకీ సేవయొసంగి ప్రోవు మలమే
ల్మంగా మనోనాయకా!

మ. నినుఁ గన్గొంటిమి, నీకటాక్ష మిటు రా
నిమ్మంటి మాపావనా
శనతీర్థంబునఁ గ్రుంకినార మఘముల్
శాంతించెనో లేదో మే
మనుమానించితిమా! స్వధర్మమిది మా
యందయ్యె; నీవిశ్వపా
లనధర్మం బెటులైన నేమి యలమే
ల్మంగా మనోనాయకా!

మ. తనివార న్నినుఁ జేర నేనెపుడు నీ
దాసానుదాసుండనై
యనయంబు న్వినయంబునం గొలుతు ని
త్యానంద సద్మంబులౌ

ననుచు న్నన్మనుచుంగదా యనుచు దే
వా నీపదాబ్జాతముల్
ననుమన్నింపు గటాక్షముంపు మలమే
ల్మంగా మనోనాయకా!

మ. కలవాఁడా భువనైకమాత కమలా
కల్యాణి వక్షంబునం
గలవాఁడా యపవర్గనిర్గమన మా
ర్గశ్రేణులో నేకుగోం
డలవాఁడా జిగిమించు కొండలకు బం
డారంపు బంగారువ
ల్వలవాఁడా యని నిన్నుఁబిల్తు మలమే
ల్మంగా మనోనాయకా!

మ. ప్రకటామోద విముగ్ధచిత్తమున నా
స్వాదింపఁగాఁగోరి మా
టికమం దొయ్యన వ్రాలి లేచుటకు శ
క్తిం గానలే కీల్గు మ
క్షికరూపంబున సంసృతిం దవిలి పి
క్షీణుండనై యుంటి మా
మక రక్షాగతిఁ జూపవేమి యలమే
ల్మంగా మనోనాయకా!

శా. పాపవ్యాధి దురాపతాపమున నిన్
బాడంగలే మక్కటా
వ్యాపించె న్నిలువెల్ల; దీనిగతి దు
ర్వారంబు; పాల్పోదు మా
కేవట్లన్; భువిఁ గల్గుమందులు వృథా
యీపట్ల; మమ్మేలవే
మాపుం దీనిని నీకటాక్ష మలమే
ల్మంగా మనోనాయకా!

శా. ఈసంసారమునందు ముగ్గి యొకమె
ట్టే నెక్కఁగాలేక యా,
యాసంబందెదు మమ్ము మెట్టుపయి మె
ట్లన్నింటి నెక్కించి తెం
తే సంతోషము; కొండ యెక్కినటుల
య్యెన్ దర్శనం బీయవే
మాసంకల్పము లెల్లఁ దీరు నలమే
ల్మంగా మనోనాయకా!

మ. మనమం దెప్పుడు నిన్నె నమ్మకొని దు
ర్మానంబు వోనాడి వ
ర్తనమం దెప్పుడుఁ దప్పులేక నిను నా
రాధించు నీభక్తులన్

ఘనకష్టంబులఁ బెట్టనేల, ముడుపుల్
గట్టించుకోనేల నీ
మన మెవ్వారికిఁ దెల్పవేల యలమే
ల్మంగా మనోనాయకా!

మ. కలఁ డన్నింట నటన్నఁ జుల్కనగు న
గ్రిత్వం బటం చేదుగొం
డలపై నెల్లర కంటికిన్ దొరకకుం
డన్ నిల్చి నావంట ని
శ్చలతత్త్వంబగు నీకె లోపమగు నీ
సంవాస సంసిద్ధి ని
ర్మలభక్తావళి కెంతదూర మలమే
ల్మంగా మనోనాయకా!

శా. ఎన్నో కొండలఁ జాటుసేసికొని నీ
విందున్న నేమాయె నా
కెన్నోపన్నులు సెల్లఁగట్టుఁడనఁగా
నేమాయె నిట్లైన నా
పన్నానేకశరణ్య నిన్నుఁ గొలువన్
భావించు సద్భక్తిసం
పన్నుల్ బన్నము లెన్నఁబోవ రలమే
ల్మంగా మనోనాయకా!

శా. కైంకర్యంబున భక్తసంతతులకున్
కైవల్యముం గూర్పఁగా
నోంకారాకృతివయ్యు మంగళతనూ
యుక్తుండవై కాంచనా
లంకారంబులఁ దాల్చి నిత్యవిభవో
ల్లాసంబుతోఁ దోఁచు నిన్
బంకేజాక్షు ననంతుఁ గొల్తు మలమే
ల్మంగా మనోనాయకా !

శా. ఏయేవంకల నెట్టికష్టములు రా
నీ యెంతవా రెట్టి య
న్యాయోద్బోధము సేయనీ మనసు నీ
యందుంచి నిర్బంధమో
హాయత్తుం బొనరింప ముక్తి దొంకున్
బ్రారబ్ధముల్ దీఱు నో
మాయామోహనదివ్యరూప యలమే
ల్మంగా మనోనాయకా !

మ. ఇతరం బైనవిచారముల్ మఱచి ని
న్నే నమ్మియున్నాము దు
ర్గతులం దూలితి మస్వతంత్రులము నీ
కాగుణఁ జేసె యూఁతగా

గతిగా మోక్షముగాఁ దలంచుకొని దీ
క్షం బూనియున్నాము నీ
మతముం దెల్పి యనుగ్రహింపు మలమే
ల్మంగా మనోనాయకా!

శా. నీ నామామృతసేవకు న్మరగనే
నిర్మానవుం డన్యమున్
గానంగోరఁడు సుమ్ము మానససరో
నాళీకనాళాదనే
చ్ఛానీతంబకు రాజహంస మదిఁ గాం
చంగోరునే నత్తలన్
మౌనీంద్రార్చిత పాదపద్మ యలమే
ల్మంగా మనోనాయకా!

మ. ఇలపైఁ జావకయుండ మోవి యమృతం
బే? బేరఁ గైలాసమే
యలవక్షోజ? మయూరె! కౌఁగిటను డా
యన్ మేరువే మేను? ప
ల్కులు వాణీశ్వరులోకమే? కలయికల్
మోక్షంబె? యింకేల కో
మలియన్నంబడి చత్తు గెల్ల రలమే
ల్మంగా మనోనాయకా!

శా. ఈవిశ్వంబున నగ్రగణ్యులము మే
మే దీనులం దెల్లెడన్
నీవో దీనశరణ్యులౌ విభుల నెం
తే నగ్రగణ్యుండవే
కావా? కావున నిన్ను మమ్ము నొకయ
గ్రత్వంబె సంధించె నే
లా వైలక్ష్యము నీకు మాకు నలమే
ల్మంగా మనోనాయకా!

(22-12-21.)



# 92 గోవర్ధనోద్ధారణము.

కాళియఫణిఁ జూచి కార్చిచ్చుఁ జూచి
వెఱ్ఱిగోపకులార వెఱచెద రేల ?
కొదవ లన్నియుఁ దీర్చు గోపాలమూర్తి
మీపాల నుండఁగా మీ కేమి భయము ?

* * * *

౧

గోపాలకృష్ణుఁడు :—
మీకంటఁ బడలేదు మిముఁ జూడలేదు
మీమాట వినలేదు మిముఁ బిల్వలేదు
మీపూజ గొనలేదు మిముఁ బ్రోవలేదు
దేవేంద్రుఁ డేలాటిదేవుఁడో మీకు ?
అన్నదమ్ములభాగ మపహరించుటకు
బ్రహ్మహత్యలకైనఁ బాల్పడువాఁడు
సోమపానము సేసి సోలెడువాఁడు
దేవేంద్రుఁ డేలాటి దేవుఁడో మీకు ?.
తనబాగె నిరతంబుఁ దలపోయువాఁడు
తనకునై తపసుల దలఁగించువాఁడు
అపరక్షేత్రాపహారి పాకారి

తలపోయ నేలాటి దైవమో మీకు ?
ఈలోక మాలోక మెంత దూరంబో ?
ఈయూరి కాయూరి కేతోవ గలదో ?
ఈమొక్కులకు ఫలం బేమైనఁ గలదో ?
ఎవరైనమదిలోన నెంచుకొన్నారె?:—
తాతతండ్రులనుండి తరములనుండి
స్వర్గమా ? మోక్షమా ? సర్వస్వ మిచ్చి
కొలు వొసంగనివానిఁ గొలుచుచున్నారు
కులదైవమా యేమి గోత్రారి మీకు ?—
సంతుష్టిగలమాట చల్లనిమాట
చెప్పెద నొకమాట చెవి యొగ్గి వినుఁడు-
అంతర్బహిశ్శక్తు లడరెడుచోట
సన్నియు నొక్కటై యమరినచోట
సందఱు నేకమే యనుకొన్నచోటఁ
దెలిసి కన్గొనుచోట దేవుఁడున్నాఁడు
విజ్ఞాననిధు లయ్యు విభవాఢ్యు లయ్యు
వెట్టిగొల్లలమంచు వెఱఁగొంద నేల ?
అమరావతీనాథుఁడైన మీకేమి ?
అమృతాన్నభోజనుండైన మీకేమి ?
గడపఁ ద్రొక్కఁగనీక గద్దించువాని

మన సిచ్చి కొలువంగ మతిలేదెమీకు ?—
తనయున్నతికి మెచ్చి తమకంబు హెచ్చి
మనపెద్దలందఱు మన్నించువాఁడు;
తనవిలాసముఁజూపి తనివునొందించి
మనకష్టములనెల్ల మఱపించువాఁడు ;
తనశాద్వలావనీ తలములయందు
మనగోగణంబుల మననిచ్చువాఁడు !
తన సెలయేటి మొత్తములఁ బర్వించి
మనచేలఁ బండించి మదిఁ దన్పువాఁడు ;
అచలుఁ డున్నతుఁడు నిత్యప్రసన్నుండు
కులవంతుఁ డఖిల సద్గుణ రత్నరాశి
చిరత్రరాశ్రయుఁడు సంజీవనదాత
గోవర్ధనుఁడు వీనిఁ గొలువఁగా రాదె ?—
కాలంబుఁ గదలించి కదలనివాఁడు
మాఱుపుల్ పుట్టించి మాఱనివాఁడు
గోవర్ధనుఁడు వీఁడె కొలువున్నవాఁడు
కొలువుఁడీ కొలువుఁడీ గోపకులార !
మూఁడులోకంబుల ముందటివాఁడు
మూఁడుకాలంబుల మొగదలవాఁడు
మూఁడుమూర్తులకును మొదలింటివాఁడు

కొలువుఁడీ కొలువుఁడీ గోపకులార !
జన్మసార్థక మౌను శంకింప నేల
యభిమతం బీడేరు నఱమఱలేల
ముక్తిమార్గము దక్కు మూర్ఖతయేల
కొలువుఁడీ కొలువుఁడీ గోపకులార !

* * * *

౨

దేవేంద్రుఁడు :—

గగన భాగంబెల్లఁ గడచుట్టికొన్న
పుష్కలావర్తకాంభోదంబులార
త్రిజగంబులను ముంచి తేల్పంగఁజాలు
సంవర్తకాభీల జలదంబులార !
వృత్రారివిజయభేరీవిరావంబు
ననుకరించెడి భీషణాభ్రంబులార
బలభేది నేను మీాపని గోరినాఁడు
కాలాంబుదములార కదలి రారండు !
గోకులంబున నున్న గొల్లవారెల్ల
బాలకృష్ణునిపల్కు పాటించినారు
కన్నుఁగానక ముందుగతిఁ గానలేక
యొమ రెఱుంగక యందఱేకమైనారు.

మామాట బొత్తిగా మఱచియున్నారు
మాపూజలను జేయ మానుకొన్నారు
కొండలఁ జెండాడు గోత్రారి వీడి
గోవర్ధనాద్రినే కొలుచుచున్నారు
త్రిభువనేశ్వరుఁడైన దేవేంద్రు నెదుట
గోపబాలకుఁ డెంత గొల్లవారెంత ?
గురుతరంబైన నాకులిశంబునెదుట
శౌరిచెంగట నున్న చక్రంబదెంత ?
యసహాయశూరుల మనుకొని వారు
క్రిందు మీఁ దెఱుఁగక కెరలుచున్నారు
కడుపులోపలి చల్ల గదలక యుండ
వలపించు సిగపూవు వాడకయుండఁ
గాపాడు దేవుని గాదని వారు
గుట్టల మెట్టలఁ గొలుచుచున్నారు
"ఇంద్రుఁ డెవ్వఁడు యాగ మేమిటి" కనుచుఁ
గండకావరమున గర్వించినారు
గోకులంబెల్ల గగ్గోలుపడంగఁ
గాలాంబుదములార కదలి రారండు !
బలిమి దిక్పాలురఁ బాలించుశక్తి
కులపర్వతంబులఁ గూలించుశక్తి

పోరిఁబోరి వారిధుల్ పొంగించుశక్తి
దుర్జయారాతులఁ ద్రుంగించుశక్తి
యెదురెఱుంగని నిర్జరేంద్రునిశక్తి
గాంచుచుండియు మీఁదుగానకున్నారు
గోకులం బంతయుఁ గొందలంబంద
నాభీరమండలం బట్టిట్టు గాఁగ
బాలకృష్ణునిగుండె భగ్గురనంగ
బలభేదితత్త్వంబు బయలుపడంగ
నుఱుములమెఱుముల నుల్లంబు గలఁచి
వడగండ్లఁ బిడుగుల వర్షంబు గురిసి
వ్రజమెల్లఁ జిందఱవందఱచేసి
యాగోపకుల గర్వ మడఁగింపవలయుఁ
గూడి రాఁగలఁ డేమొ గోవర్ధనుండు
పాలింపఁగలఁడేమొ బాలకృష్ణుండు ?
వల్లవాని బలంబు నాబలం బిపుడు
గొల్లవారే చూచికొందురుగాక !
శరభీకరాకాలజలదంబులార !
కాలాంబుదములార కదలి రారండు !—

* * * *

3

గోపాలకృష్ణుఁడు :—

భక్తశేఖరులార పావనులార!
ముక్తికై వెదకు ముముక్షువులార!
వ్రజసతీమణులార వల్లవులార!
భయ మేది రండు గోపాలకులార:—
భయము దూరంబుగాఁ బాఱంగఁ ద్రోలి
భావంబు నద్వయిా భావాబ్ధిఁ దేల్చి
భవము సార్థముసేయఁ బనిగొన్న మీకుఁ
బరతంత్రులకుఁ బోలె భయ మేఁటికయ్య!
ఒక్కమాటనె నమ్మి యున్నట్టిమీకు
నొక్కత్రోటనె నిల్చి యున్నట్టిమీకు
నొక్కటే గతిఁ గోరి యున్నట్టిమీకు
నిందు నందును భయం బేమున్నదయ్య?—
ఈవు నే నను భేద మెంచనివాఁడు
పూజాతిరస్కారములు లేనివాఁడు
మానావమానముల్ మనలనివాఁడు
సమవర్తి దేవుండు సర్వాత్మకుండు
గోవర్ధనంబుగాఁ గొలువున్నయట్లు
భావించి సేవించు పావనుల్ మీరు

స్వామిభక్తులు మీరు సాధులు మీరు
సహనశీలురు మీరు సౌమ్యులు మీరు
వినయవ్రతులు మీరు విమలురు మీరు
మిమ్ము మీ రెఱుఁగరు మీ కేమి భయము?—
భయములో నున్నది భవబంధనంబు
భయములో నున్నది పామరత్వంబు
భయములో నున్నది పారతంత్ర్యంబు
భయమేల మీకు గోపాలకులార!—
పుడమికి నడఁగని భువనైకశక్తి
వారికిఁ గరఁగని వరణీయశక్తి
కీలలఁ గాలని కేవలశక్తి
గాలికిఁ దూలని ఘనతరశక్తి
యాకసం బందని యద్భుతశక్తి
యాదిమధ్యాంత శూన్యంబైనశక్తి
యతిపురాతనతత్త్వ మగుపరాశక్తి
మీలోన నుండఁగా మీ కేమిభయము?—
మిఱుమిట్లు గొలుపు నీ మెఱపుతండములె
కర్పూరహారతుల్ గాఁబోవు నింక
యులజడిం గూర్చు నీ యశనిఘోషములె
శ్రమసంగీతముల్ గాఁబోవు నింక

వడివడిన్ దొరగు నీ వడగండ్లజడియె
కల్పవర్షసవవృష్టి గాఁబోవు నింకఁ
జిటికెనలోనె సిల్చినది మోక్షంబు
గొడుగు గానున్న దీ గోవర్ధనంబు
తలఁపు లొక్కటి చేసి ధైర్యంబుఁ జేసి
ధర్మ మూఁతఁగఁ జేసి తరలి రారండు!
ఎదుట నున్నది ముక్తి యింకేమి వలయు?
భయ మేది రండు గోపాలకులార!

* * * *

౪

దేవేంద్రుఁడు:—

శ్రీమనోజ్ఞవిహార! శ్రితజనాధార!
గోవర్ధనోద్ధార! గోపాలవీర!
సర్వశక్తివి నీవు సమవర్తి వీవు
శాశ్వతుండవు నీవు శాంతుఁడ వీవు
జ్ఞానదాయివి నీవు జ్ఞానంబ వీవు
కర్మసాక్షివి నీవు కర్తవు నీవు
ని న్నెఱుంగఁగలేక నే నింతదాఁక
యమరేంద్రపదవి కే నధికారి ననుచు
అఖిలలోకేంద్రుని న్నసదుగాఁ దలఁచి

కలుషాపచారంబుఁ గావించినాఁడ—
నిరహంక్రియుండవౌ నీ యెట్టయెదుట
"శ్రితులు శరణ్యులు సేవ్యసేవకులు
నధికు లల్పులు, మర్త్యు లమరు" లటంచు
నీభేదభావంబు లెక్కఁడివయ్య ?
నాగర్వము నశించె నాక్రోధ మడఁగె
నాయహంభావంబు నాశన మయ్యె
సర్వేశ నీదివ్య సాధుసంసేవ్య
చరణాంబుజములకు శరణార్థి నైతి—
మర్త్యు లందఱు నిల్లి మముఁ ద్రోసి నైవ
నిత్యోపవాస మౌ నిర్జరావళికి
నాతప్పు మన్నించి నామొఱాలించి
యీలోకమందుండి యెప్పటియట్ల
మాహావిర్భాగముల్ మాకందునట్లు
కట్టడ గావించి కరుణింపుమయ్య
సర్వరక్షక ! మమ్ము సమదృష్టిఁ జూచి
కారుణ్యమున నొక్కగతిఁ జూపు మయ్య !—
నారాయణాయ నలినాయతలోచనాయ
నామావశేషిత మహాబలి వైభవాయ
నానాచరాచర విధాయక జన్మదేశ

నాభీపుటాయ పురుషాయ నమః పరస్మై.

*　　*　　*　　*

౫

గోపాలకృష్ణుఁడు :—

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు.

(29-12-21.)



# 93 నహుషస్మృతి.

క. త్రిజగంబులఁ బాలించెడి
భుజవీర్య ముదారధర్మబుద్ధిబలంబున్
నిజతేజము నశియింపఁగ
నజగరమై తేమిపాపమయ్యా నహుషా!

సీ. హరిహరీ! యిది యేమి హయమేధశతకర్తృ
యాత్మమహత్త్వ మేమయ్యె నయ్య?
శివశివా! యిది యేమి భువనశాసనపవి
త్రాదేశశక్తి యేమయ్యె నయ్య?
రామరామ! యిదేమి రాజర్షివంశవి
ఖ్యాతచారిత్ర మేమయ్యె నయ్య?
హరహరా! యిదియేమి యమరపూజితమహో
దారప్రభావ మేమయ్యె నయ్య?
అమరమానవలీల యేమయ్యె నయ్య?
ఆర్యసన్నుతశీల మేమయ్యె నయ్య?
ఆదిగర్భేశ్వరత్వ మేమయ్యె నయ్య?
మహితరాజన్యకులదీప! నహుషభూప!

సీ. అమరేంద్రుఁ డసురవిక్రమము నాఁగఁగలేక
యలసి యంతర్హితుండగుట కతనఁ

త్రైలోక్య రాజ్యలక్ష్మీలలామంబు ని
రాధారదుస్థ్సితి నందుకతన
శాంతవస్త్రములు త్రింశత్కోటిదేవత
లధినాథ వాంఛితులగుట కతన
సత్యదయాధర్మశౌచవీర్యములు నీ
యం దప్పు డున్నతినందు కతన
దొరలి యాదృచ్ఛికంబుగా దొరకినట్టి
పరమపద రాజ్య మనుభవింపంగలేక
పామరై పోయి తిది యేమి పాపమయ్యె?
మహిత రాజన్యకులదీప ! నహుషభూప !

సీ. ధన్యసంప్రాప్త సుధర్మ సింహాసనా
స్థాన వైభవములు చాలలేదొ?
నవకల్పవిలసిత నంద నానందవి
లోల విహారముల్ చాలలేదొ?
అఖిలోకనిర్మల వ్రిత్రభావిశాల ది
క్పాల సంసేవలు చాలలేదొ?
ఐరావతోచ్చైశ్శ్రవాది సద్వాహన
స్వర్గప్రచారముల్ చాలలేదొ?
దివ్యమణి కామధేనువుల్ దీర్పలేని
వలవని దురాశ యేమైనఁ గలిగెనొక్కొ?

పామనై పోయి తిది యేమి పాపమయ్య?
మహిత రాజన్యకులదీప నహుషభూప!

క. అమృతము విషమైనదియో
సముదారవిధి క్రియప్రచారంబులు వ
క్రములై పోయినవో, స
ర్పమనై పోవుట కిదేమిపాపము నహుషా!

సీ. ఎప్పటికైన దేవేశ్వరత్వము నిర్జ
రేంద్రునిదే యన్న యెఱుకలేక
ఎప్పుడు దేవతలెల్ల మానవులకుఁ
బూజనీయులె యన్న బుద్ధిలేక
ఎప్పటికైన ధర్మేచ్ఛయే సద్గతి
గలిగింపఁగలదన్న తెలివిలేక
ఎప్పుడు సాధుల నొప్పించునప్పుడే
యొదవు నాశనమన్న యూహలేక
మనుజమాత్రుండ నేనన్న మాటలేక
కండకావరమునఁ గన్నుఁ గానలేక
చెట్టలెవ్వరి కేమేమి చేసినావొ
పామవై పోయి తిదియేమి పాపమయ్య?

సీ. తమకంటె నెందు నుత్తముఁడవుగాకున్న
దిక్పాలకులు నిన్నుఁ దెచ్చినారు

పెరవాఁడ వని నిన్ను నిరసింపఁబోక ము
  క్కోటిదేవతలు నిన్ గొలిచినారు
పదగౌరవంబునే పాటించి సన్ముని
  శ్రేష్ఠులు నినుఁ బెద్దఁజేసినారు
ఎవఁడైన నిపుడు దేవేంద్రుఁ డీవెయటంచు
  యజమానులు హవిస్సు లంపినారు
దుర్లభపదంబు చేతికి దొరకినపుడు
మాట దక్కించుకొనలేక మాననీయ
గౌరవము నిల్పుకొనలేక కడలుద్రొక్కి
యీగతి నధోగతికి వచ్చితేమి నహుష !
సీ. ఆశ్రయంబిచ్చిన యమరావతీ రాజ
  ధాని నిత్యస్వార్జితంబటంచు
నధికార మొసఁగిన యష్టదిక్పాలకు
  లానతిఁ దలఁదాల్చు దీనులనుచుఁ
జేరి నిత్యంబు దర్శించిపోయెడి మునుల్
  జీవికల్ గాంచు నాశ్రితులటంచుఁ
గాలవశంబునఁ గరతలామలకమా
  స్వారాజ్యపదవి శాశ్వతమటంచు
మిన్ను మన్ను నెఱుంగక మేను మఱచి
మఱవరాని పరక్షేత్రహరణవాంఛఁ

జేసిన యఘాంకురం బిట్లు చెట్టుగ కట్టిఁ
గట్టి కుడుపకమానునే కర్మఫలము ?
సీ. ధారుణ కామాంధకార మొక్కటె చాలు
నిమిషంబులో నిల్వ నీఱు సేయ
సాధుసతీతిరస్కార మొక్కటె చాలు
సకలసంపదలు భస్మంబు సేయ
కులదేవతాప్రజాఘోష మొక్కటె చాలుఁ
గూఁకటివ్రేళ్లతోఁ గూల్చఁగఁ జేయుఁ
దాపసలోక సంతాప మొక్కటె చాలు
సర్వసద్గతుల నాశనముసేయఁ
గలసి యిన్నియనర్థముల్ గలిగె నీకు
పాపము ఫలించె దుర్గతి దాపురించె
నమరపతివయ్యు నజగరంబైతి వీవు
పట్టి పీడింపకుండునే పాపఫలము ?
క. తిట్టును దీవనగాఁ జెవిఁ
బెట్టంగల యట్టి తత్త్వవేత్తలకైనన్
బుట్టక మానదు పాపపుఁ
గొట్టులమొదఁ నాఁపరాని కోపము నహుషా!
క. గురువులకుఁ బంగనామము
దరిసి వసంతంబు కన్నతల్లికిఁ బెట్టిన్

దొరకొన్న నీకుఁ బాపము
బరువై యిట్టిగతిఁ గూలఁబడితివి నవాబుషా!
గీ. ధర్మసందర్శనం బెంతదాఁక నీకు
దొరక దందాఁక నిట్టులే దొరలవలసె
" ధర్మమే రక్షు దారుణా ధర్మరతున "
కనఁగ నీమాట స్మృతియయ్యె నయ్యొ నవాబుష!

(7-1-1922.)



## 94 శ్రీవేమనయోగి.

సీ. కలిమిలేముల నొక్క కంటనే చూచిన
ప్రాకృతఫలభోగి! రాజయోగి!
తప్పు నొప్పును నొక్కతీరునే తూఁచిన
నిర్మమతోత్యాగి! కర్మయోగి!

తెలివి మఱపు నొక్క తెరలోనె దాఁచిన
సంగవిరాగి! విజ్ఞానయోగి!
భవము నాశము నొక్కబండినే పూఁచిన
గురుగుహాంతర్త్యాగి! పరమయోగి!
రాజదమరేంద్రనిభమహా రాజభోగి!
తర్కసిద్ధాంతతథ్య మిథ్యావిభాగి!
తత్త్వమస్యాని సత్యమంత్రప్రయోగి!
విశ్వమాయాపరిత్యాగి వేమయోగి!

సీ. వెలినుండి సకలంబు వెలయింపఁ గలవెల్గు
కడమూలనుండియే కన్నవాఁడ!
విశ్వమంతట నిండి వినరాని గానంబు
వెలుపలనుండియే విన్నవాఁడ!
అందక యూరించు నారముగ్గినపండు
నున్నచోటనె యందుకొన్నవాఁడ!
చిక్కక జగములఁ జిక్కించుకొనుచిక్కు
కొనసుండియే విప్పుకొన్నవాఁడ!
గులకరాళ్లలో మణు లేరుకొన్నవాఁడ!
ఘోరవిషములో నమృతంబుఁ గొన్నవాఁడ!
కటికిచీకటిలో వెల్గుఁ గన్నవాఁడ!
పరమయోగీంద్ర! వేమభూపాలచంద్ర!

సీ. చికురాకులందు సంజీవనీఫలముల
నుంచి యందఱకు నందించినావు
పూవుగుత్తులలోన బోధామృతరసంబు
నుంచి యందఱకు వడ్డించినావు
తేటమాటలలోన దివ్యసంగీతంబు
నుంచి యందఱకు విన్పించినావు
అంతరంగంబులో నానంద కైవల్య
ముంచి యందఱకుఁ జూపించినావు
మంచిచెడ్డలగతు లేర్పఱించినావు
పొంచిన విరోధులను నిరోధించినావు
పంచకరణంబులను సమాళించినావు
పరమయోగీంద్ర ! వేమభూపాలచంద్ర!

సీ. కన్నులఁ దెఱవని చిన్నిపాపయుఁ గూడఁ
దిలకింపఁగలిగె నీతెలివిలోనఁ
జైతన్యమెఱుఁగని జాతిబొమ్మలుఁ గూడఁ
బులకింపఁగలిగె నీపలుకులోన
నోరైన నెఱుఁగని క్రూరజంతులుకూడఁ
బ్రేమింపఁగలిగె నీప్రేమలోన
జీవంబెఱుంగని చీకుమ్రాకులుగూడఁ
జిగురింపఁగలిగె నీచేతిలోన

అమృతమోహానవిగ్రహా! యమృతభాషి!
యమృతభావసమన్విత! యమృతకరుఁడ!
పరమపదభోగి! నిజకర్మఫలవిరాగి!
సకలగుణసాంద్ర! వేమనసుకవిచంద్ర!

సీ. కవితిక్కనింబోలి కవితఁ జెప్పఁగవచ్చు
వేదంబులను వల్లెవేయవచ్చుఁ
దర్కసిద్ధాంతముల్ తప్పు దిద్దగవచ్చు
షడ్దర్శనంబులఁ జదువవచ్చు
మౌనముద్రకు మార్చి మనసు నిల్పఁగవచ్చు
జీవంబుఁ దపియింపఁ జేయవచ్చు
జగము మిథ్య యటంచుఁ జాటింపఁగావచ్చుఁ
బరమేశ్వరునిపాటఁ బాడవచ్చు
సుకవులను వేదవిదులఁ దార్కికులలోన
దార్శనికులందు మునులందుఁ దపసులందు
జ్ఞానులను భక్తులను నీకు సాటియెవరు?
పరమయోగీంద్ర! వేమభూపాలచంద్ర!

సీ. ఆదివర్ణంబుతో నంత్యవర్ణంబును
సమకూర్చి పద్యంబు చదివినావు
దివ్యవిభూతిలోఁ దిరుమణిచూర్ణంబు
ఘనయోగముద్రలోఁ గలపినావు

అల్లాపట బున హరిహరబ్రహ్మలఁ
బంచవర్ణములఁ జతిరించినావు
బ్రహ్మసూత్రంబుతోఁ బ్రకృతి సూత్రింబును
బిరివెట్టి త్రాడుగాఁ జేసినావు
సకలమతముల నొకత్రోవ జరపినావు
నిఖలజాతుల నొకయింట నిలిపినావు
అఖలశక్తుల నొకచోటి కనిపినావు
పరమయోగీంద్ర! వేమభూపాలచంద్ర!

సీ. విబుధవర్యులు మొదల్ వెఱ్ఱివారలదాఁక
వేమన్న నీసూక్తి వేదమయ్యెఁ
గాలవృద్ధులు మొదల్ బాలపాపలదాఁక
వేమన్న నీమాట విశదమయ్యె
సోమయాజులు మొదల్ కామచారులదాఁక
వేమన్న నీత్రోవ విదితమయ్యె
బ్రహ్మతత్త్వము మొదల్ పరమాణువులదాఁక
వేమన్న నీశక్తి విపులమయ్యె
సఖిలమతముల నీబోధ లతుకువెట్టె
సఖిలజాతుల నీనేమ మానవెట్టె
సఖిలశక్తుల నీతత్త్వ మాశవెట్టె
సఖిలగుణభాగి వీవు వేమన్నయోగి!

(19—1—1922)

# 95 భీమలింగేశ్వరస్తుతి.

సీ. శ్రీమంతుఁడయ్యె నీ చెలికారమునఁ జేసి
గవ్వకన్నుల యక్షగణ విభుండు
అర్ధాంగియయ్యె నీ యాదరంబునఁ జేసి
కాలరూపిణి చండికాభవాని
తలవేలుపయ్యె నీతాత్పర్యమునఁ జేసి
యోరిమిలేని జాలారిగంగ
మండనంబయ్యె నీ మమకారమునఁ జేసి
పడగ విసంబున్న పాపఱేఁడు
నిఖిల కల్యాణ గుణరాశి నీదుకొలువు
గన్నవారికిఁ గొదవ లేమున్నవయ్య ?
దురితసంహార ! కైలాస పురవిహార !
కామశతకోటి రుచిరాంగ ! భీమలింగ!

సీ. లక్షపత్త్రిములలో నక్షయుండగు నీకు
శ్రీదళంబొకటి చేరినను జాలు
పంచామృతములలో భవదూర నీవొక్క
శీకరంబును గ్రహించినను జాలు
సంకీర్తనములలో జగదీశ నీవొక్క
చిన్నివ ల్కాలకించినను జాలు

సంసేవనములలో సర్వేశ నీచిత్త
మొక్కింత సుముఖమై యున్నఁ జాలు
నభవ ! నీదయ యొక చిన్నమంత యైన
నదియె పదివేలు పదికోటులగును మాకుఁ
బ్రభుని మన్నన దాసుని భాగ్యమొకద
కామశతకోటి రుచిరాంగ ! భీమలింగ !

సీ. పాపపుఁ గొండల బరువుదింపుము వెండి
కొండ నిమ్మని నిన్నుఁ గోరలేదు
అజ్ఞానతిమిరంబు నడపుము బాలచం
ద్రావతంసంబు ని న్నడుగలేదు
దీనత్వమను బాధఁ దీర్పుము నిధినాథ
పట్ట మిమ్మని పట్టుఁ బట్టలేదు
ఈహీను నొక్క మెట్టెక్కింపుము వృషేంద్రి
యాన మిమ్మని పంత మూనలేదు
ఆశ్రితుల కిచ్చు ప్రభుఁడ వీ వగుట కతన
దాసుఁడను గోరితిని నాకుఁ దగినకోర్కి
కోర నావంతు, నీవంతు కోర్కిఁదీర్పఁ
గామశతకోటి రుచిరాంగ ! భీమలింగ !

సీ. ఏను విన్నది యొక్కటేమాట దీనుల
కాధ్యుండు భీమేశుఁ డన్నమాట

ఏను నేర్చిన దొక్కటేపాట పరమేశ!
నన్ను దాసునిఁ బ్రోవుమన్న పాట
ఏనాఁడు నది యొక్కటేయూట భక్తిలో
మనసు జల్లనఁగ మైమఱచునాట
ఏ నెఱింగిన దొక్కటేబాట భవమును
నాశంబు నెఱుఁగని నాటుబాట
ఒక్కటేమాట చెప్పితి నున్నమాట
యింతకంటె నేమున్నదో యెఱుంగ
దిద్దుకొనుమయ్య తప్పున్న దేవదేవ!
కామదుర్వార మదభంగ భీమలింగ!

సీ. తల్లి! మాణిక్యాంబ! తనయుని ననుఁగూర్చి
విభునిచెంగట విన్నవింపుమమ్మ!
నాసామిగణనాథ! యీసోదరునిమాట
జనకుని జ్ఞప్తిలో నునుపుమయ్య!
నెచ్చెలీ నందీశ! నీమిత్త్రివరుకోర్కి
నొడయనితోఁ జెప్పుచుండుమయ్య!
సఖులార! ప్రమథనాయకులార! నాయున్కి
గిరిజావిభుని కెఱింగింపుఁడయ్య!
సమయము నెఱింగి వచ్చి దర్శన మొసర్తుఁ
బ్రేమగతం నప్పుడపు డెచ్చరింపుఁడయ్య!

హితులు మీ కింకెవరు నింక నా కెవరుగలరు?
అభయదానంబొసంగి న న్ననుపుఁడయ్య?
(24-2-1922.)

# 96 దుందుభిధ్వానము.

తూరుపుఁగోనలో దుందుభిస్వనము
వీణారవంబులో వినవచ్చుచుండెఁ
బరిణయనాదంబులో భావముల్ నిండె
దుర్మతీ! దుర్మతీ! తొలఁగి పొ మ్మింక—

పరితారణము.

భువనకళ్యాణైక పుణ్యరంగమున
సదమలస్వేచ్ఛాపరిచారరంగమున

సత్యశౌచదయాప్రశాంతరంగమున
సాధుప్రబోధవిశ్రాంతరంగమున
నఖిలమానవసుఖాశాంతరంగమునఁ
బ్రణయతరంగితప్రథనరంగమున
విశ్వంబు పులకింప విజయనాదమున
విజయదుందుభిఘోష వినవచ్చుచుండెఁ
బశ్చిమద్వారంబు పడిపోవుచుండె
దుర్మతీ! దుర్మతీ! తొలఁగి పో యింక!—

సీ. పగలు రే యనక యెప్పటి కప్పుడే ప్రాణ
ధనమానములచింత మునుఁగవలసె
నాఁడు నేఁ డనక యేనాఁడుఁ గష్టంబుల
జోడించుచేఁతలే చూడవలసె
ఇందు నం దనఁబోక యెందు నుల్లముఁ గలం
గించువార్తలె యాలకింపవలసె
వారు వీ రనక ముప్పదిమూఁడుకోట్లు న
ట్లుడికిపోయినయట్లు లుడుకవలసె
నీవు వచ్చిన దాదిగా నేఁటిదాఁకఁ
బూఁటపూఁటకుఁ దపియించిపోవవలసెఁ
జాలు నీఁక మాకు నీపొత్తు చాలుఁజాలు
దుర్మతీ! దుర్మతీ! వేగ తొలఁగి పొమ్ము!—

మంజ. కామవికారంబు కడ లంటిపోయెఁ
గ్రోధానలజ్వాల కుములి చల్లారె
లోభపంకం బింకి లోపించిపోయె
మోహప్రవాహంబు మున్నీట మునిఁగె
మదవికారము సదమద మయిపోయె
మాత్సర్యరోగంబు మటుమాయమయ్యె
సురలోకమున వేగుఁజుక్క దోఁచినది
కొక్కొరోకో యంచుఁ గోడి కూసినది
యుదయాద్రిపై నరుణోదయం బయ్యె
ననుకూలపవనంబు లరుదెంచుచుండె
విజయదుందుభిఘోష వినవచ్చుచుండె
దుర్మతీ! దుర్మతీ! తొలఁగి పొ మ్మింక—

సీ. తనువు గందక యుండ మనసు నొవ్వక యుండఁ
దడిపోతలను గొంతు దఱిగినావు
అడుగు పెట్టక యుండ మడమ ద్రిప్పక యుండ
మెట్టుత్రోవలఁ గంచెఁ గొట్టినావు
విప్పి చెప్పక యుండఁ జెప్పి చూపక యుండ
శివ శివా యన బూతు సేసినావు
తొలఁగి పోవక యుండ నిలువరింపక యుండ
నట్టింటిలో నిప్పు వెట్టినావు

నీవు వచ్చిన దాదిగా నేఁటిదాఁక
నొక్కరీతిగ మానోళ్ళు నొక్కినావు
చాలు నిఁక మాకు నీపొత్తు చాలుఁజాలు
దుర్మతీ! దుర్మతీ! వేగ తొలఁగి పొమ్ము—

మంజ. ఆరామవైభవం బడుగంటఁజేసి
కొమ్మలసంపత్తిఁ గూలఁద్రోసితివి
రసగౌరవమున నైరస్యంబుఁ గూర్చి
ఘనతరుల్ వెతఁగుందఁగా నొనర్చితివి
ఆశావకాశంబు లట్టిట్టు సేసి
శుష్కపత్త్రింబుల సుళ్లు వెట్టితివి
పచ్చపైరులఁ గత్తిపాలు గావించి
పంటవలంతిని బాడుచేసితివి
నీపేరు గుండెల నీరుచేసినది
నీయేఁడు పూర్తిగా నిండిపోయినది
నీవాదు జగమెల్ల నిండిపోయినది
పాపంబు నీ కిట్లు పండిపోయినది
రాజవీథులలోన రథములు తిరిగ
శివశివా యనుకొంచు శిశిరంబు జరగ
విజయదుందుభిఘోష వినవచ్చుచుండె
సుమతిచైత్రుఁడు వచ్చు సూచనల్ దోఁచె

నీకొక్కఁడను నిల్వ నీడలే దిచట
నివురు గ్రమ్మినయట్టి నిప్పాఱినట్లు
కనుఁగొనకుండఁ జీకటిజాఱినట్లు
దుర్మతీ! దుర్మతీ! తొలఁగి పొ మ్మింక——

## స్వాగతము.

సీ. ప్రతిశబ్దమునుగూడఁ బాపపుణ్యంబుల
బాటలు సూటిగాఁ జేటపఱుప
ప్రతినిస్వనంబును బంధమోక్షంబుల
భావముల్ వెలయించి బయలుపఱుప
ప్రతినినాదంబు దుర్మతసన్మతంబుల
గాథలు సులువుగా బోధపఱుప.
ప్రతివిరావంబును బహుదివ్యబలముల
పరిమాణములఁ దూఁచి యెఱుకపఱుప
ప్రణయనాదంబు నిన్నుండి బయలు వ్రాఁక
ప్రకృతిశాంతాంతరంగంబు పల్లవింప
పలుకుపలుకున శుభవార్త దెలిపికొనుచు
దుందుభీ! రమ్ము! 'స్వాగతం' బందుకొనుము!

సీ. అసిచాలనము లేని యాహవభూమిలో
నార్భట మెఱుఁగని యట్టిపలుకు
రక్తపాతము లేని రణమహీతలములో
నట్టహాసములేని యట్టిపలుకు
ఉద్ధతుల్ సేరని యుద్ధరంగంబులో
నలజడి గొలుపని యట్టిపలుకు
శాత్రవంబులు లేని సమరాంగణంబులో
నాగ్రహం బొలయని యట్టిపలుకు
ప్రణయరస మొల్కు నీపల్కు ప్రకృతియెల్ల
మంగళాలాపములతోడ మాఱుమ్రోయ
మసృణమోహనగంభీరమధురగతుల
దుందుభీ! రమ్ము! 'స్వాగతం' బందుకొనుము!

---

## సంబోధనము.

---

ప్రణయపల్లవముల రాగంబు మెఱసె
ప్రేమకోరకముల రేకులు విరిసె
ప్రమదపుష్పముల సౌరభములు విరిసె
నాశ్వాసఫలముల నమృతంబు గురిసె

శాంతవాహినులలో సమగతుల్ దొరసె
భావనాపరిష్కృతిలోఁ బ్రణయంబు నెరసె
లక్ష్యంబు చెడకుండ లయ తప్పకుండ
సుగతి మీఱకయుండ శ్రుతి గందకుండ
విజయఘోషంబులు విశ్వంబు నిండ
మ్రోగవే దుందుభీ! మ్రోగవే యింక—
సుఖదుఃఖభావప్రచోదితజీవ
సతతపరిచారవిస్తారశబ్దములు
యోగవియోగసంయుక్తసంకీర్ణ
భూతపంచకసముద్భూతశబ్దములు
అపకర్షణాకర్షణాత్మసంచలన
ఘనఖేటఋజువక్రగమనశబ్దములు
విలయసర్గక్రియావిశ్రాంతకాల
చక్రవిభ్రమణసంజనితశబ్దములు
సౌఖ్యావహములైన సరళశబ్దములు
భయదాయకములైన పరుషశబ్దములు
భవదీయమధురశబ్దములతోఁ జేర్చి
ప్రణవశబ్దంబుతో బరిహ్మించ మెల్ల
మధురశబ్దబ్రహ్మమయము గావింప
మ్రోగవే దుందుభీ! మ్రోగవే యింక—

ఆనందలహరిలో నమృతవీచికల
దివ్యవాయువులలోఁ దేలించుకొనుచు
శాంతిగీతములలో సరళస్వరములఁ
బ్రణయతంతువులలోఁ బలికించుకొనుచు
ధర్మపుష్పములలోఁ దత్త్వగంధముల
నచలభావములలో నలరించుకొనుచు
సత్యమండలములో సౌఖ్యచంద్రికల
విశ్వసౌధంబుల వెలయించుకొనుచు
అఖలశబ్దంబుల నైక్యంబుచేసి
అఖిలార్థములకు నేకార్థంబుఁ దెలిపి
అఖిలచిత్తముల నేకాగ్రతఁ గూర్చి
అఖిలశ్రుతుల కభేదానంద మిచ్చి
అఖిలభూలోకకల్యాణంబుకొఱకు
మ్రోగవే దుందుభీ! మ్రోగవే యింక—

## గా న ము.

---

### చాటవే !—దుందుభి !—చాటవే !—

౧

చేఁదుపువ్వులఁ బంచదారకుఁ
జేరఁదీసి గ్రహించునార్యుల
వాదములలో భేదభావము
లేదు లేనే లేదు లే దని—చాటవే—

౨

దారుణక్రియ లెన్ని చూపిన
నోరు పనివెడి మూలమంత్రము
గోరుముద్దలతోడ నేర్చిన
భారతీయులు భయముపడ రని—చాటవే—

౩

నల్లమడుగులు నింపఁ గురిసెడి
బొల్లిమబ్బుల దుళ్లఁగొట్టెడి
చల్లగాడ్పులు భరతభూముల
నెల్లదిక్కుల నల్లుకొనె నని—చాటవే—

౪

ప్రేమసింధుతరంగములలో

సామగానము వెడలె భారత
భూమిలోఁ గలవార లందఱు
సోమయాజులవార లై రని—చాటవే—

౫

నిప్పుఁగొండలనుండి పన్ని
దుప్పతిల్లఁగఁ జేయుమంత్రము
తప్పకుండఁగ నెల్ల హైందవు
లొప్పఁజెప్పఁగ రండు రం డని—చాటవే—

౬

చల్లచల్లఁగ జాతి దుర్మతి
తెల్లమొగమై పోవుచుండెను
మెల్లమెల్లఁగ మేలుకొండో
తెలవాఱిన దంచు నెలెడ—చాటవే—

(27-2-1922.)

# 97 ప్రణయసంగీతము.

శాంతమయమ్మైన పరిణామమైక శాసనంబుఁ
గడచి సుఖియించునాతఁ డొక్కఁడును లేఁడు ;
మధురమయమైన ప్రణయసామ్రాజ్యమునకుఁ
బ్రతినిధులు కానివార లెవ్వరును లేరు.

---

ఆఁకటికిఁ దాళఁజాలని మేఁకపిల్ల
వచ్చి బాలెంతపులిచెంతఁ బాలు ద్రావు ;
గుఱుపటెక్కలచిన్న పావురపు బిల్ల
లీలమై డేగకడఁ బల్లటీలు నేర్చు ;
నలసి నిద్రించు మృగరాజు నంటఁ జేరి
చేటచెవులూఁచి గజరాజు చెమట లార్చు ;
ముసలువేసవిఁ దూలునుంగిసను జేరి
నడ దగులుకొండ సర్పంబు పడగఁ బట్టు ;
అగ్గిరాళ్లను బన్నీటి బుగ్గ లెగయుఁ
జేదుపూవులఁ దేనియల్ చిందువాఱు
ఫణిఫణంబుల సంజీవమణులు జాఱుఁ
గంటకంబుల నవకోరకములు విరియుఁ
బ్రణయగానంబు వీనుల బడినయంతఁ

బ్రణయరసమయమాధురీప్రకృతి యెల్ల
విషమసమభిన్నభావముల్ విస్మరించి
మధురమోహనప్రణయతన్మయతఁ గాంచు.
తలిరుఁబొత్తిళ్లఁ బూఁపమొగ్గలను బెంచి
గుప్పుగుప్పునఁ దావులఁ గుమ్మరించి
చిటుకుచిటుకునఁ దేనియల్ చిలుకరించి
యలరి యలరించు నెలఁదీగకులుకులాడి
బాలసహకారమునకు నై కేలు సాఁచి
లలితకలకంఠరవమునఁ బిలుచుపిలుపు
ఆణిముత్యాలపూవుల నలకరించు
కటికిచీకటిచీరమేల్కట్టుక్రిందఁ
గన్నుమిన్ను నెఱుంగక యున్నచోట
నన్నిరూపులఁ దనరూపమందు దాఁచి
కన్నులను మూసి యామినీకాలమూర్తి
పాంథు నదలించి బెదరించి పలుకుపలుకు,
నిండుజాబిల్లికళలు పన్నిటియేటి
మించుఁదరఁగల మిలమిల మెఱయుచుండఁ
దొలఁకుభావంబులను మేను పులకరింపఁ
బ్రణయరాగంబు నిలువెల్లఁ బల్లవింపఁ
బారవశ్యంబు మీఱంగ భక్తవరుఁడు

పలుకుఁ దలఁ పేకముగఁ జేసిపాడుపాట
చేర నంతంబు లేనియెడారిలోన
దృష్టి కాశల నిడు మృగతృష్ణలోనఁ
దిరుగఁజాలక యమృతంబుఁ దివియలేక
గొంతు తడియార బ్రిదుకుపైఁ జింత జాఱఁ
బరితపించువియోగినీతరళనయన
మొగచి దిక్కేది పలవించి యేడ్చునేడ్పు
పిలుచుపిలు పైనఁ బలికెడు పలుకులైనఁ
బాడుపాటైన నేడుచు నేడుపైన
బహుళభావార్థశబ్దప్రపంచ మెల్లఁ
బ్రణయసంగీతమునఁ బ్రతిధ్వనియ కాదె?
దిగులుపడుచున్న జానకీదేవితోడ
శుద్ధశోకవరాళి నశోకవనము,
పరవశతఁ గాంచు రాధికాతరుణితోడ
మధురమోహనలీలఁ దమాలవనము,
తలఁగఁజాలని పాండునందనులతోడ
మెలపుతోడి రాగమున శమీవనంబు,
కరుణరసమూర్తి సిద్ధార్థపరునితోడ
రుచిరమలహరిగతి వటప్రియవనముఁ
గలసి సర్వస్వరంబు లైక్యముగఁ జేసి

ప్రణయరస మొల్క నొక్కటే పాటపాడె:-
రామచంద్రుని శాతశిలీముఖముల
యామినీచరగణయాతనాముఖముల।
గరళకంఠుని మిక్కిలికంటిమంటc
గాముదేవేరి కాటుకకంటివెంట
దారుణంబైన శకునిదుస్తంత్రమందు
మానితంబైన విదురుసన్మంత్రమందు
నొక్కగతి నొక్కటేశ్రుతి నొక్కరీతిc
బ్రణయసంగీతనాదమే బయలువడియె—
భావరాగతాళము లేకభంగిc జేసి
ప్రకృతి గరcగంగ నానాcడు పాడినట్టి
ప్రణయగీతంబు లెల్ల నిప్పటికిcగూడ
వనతరులయందు శైలగహ్వరములందు
ఘనరసాతలవాహినీ గతులయందు
గగనకల్లోలినీతరంగములయందు
దశదిశలయందు భూనభోంతరములందు
విమలనూత్నపురాతనావిదితవిదిత
యోగగతులైక్యముగ మాఱుమ్రోగుచుండె-
ఇంద్రియవిలోలురకు విజితేంద్రియులకు
ద్వంద్వనిర్ద్వంద్వభావసంధానమునకుc

ప్రకృతికిఁ బరంబునకును సర్వమున కెల్ల
గతులఁ బ్రణయంబె కద మూలకారణంబు—
ప్రణయగీతంబు బోధించు పరమగురునిఁ
బడయ వెదకంగఁ బనిలేదు ప్రకృతియుండ;
ప్రణయరాగ మాలాపించి పాటఁ బాడ
సహజపాండిత్య మున్నది జగతి కెల్ల
వినఁ దలంచినఁ బాడఁగా వేడుకైన
నధ్యయన మాచరింపఁగా నాశయున్న
సులభసాధ్యంబు సుశ్రుతి లలితమైన
ప్రణయసంగీత మింతలోఁ బట్టువడును.
ప్రణయరాగంబునను జొక్కువడకయుండఁ
బ్రణయసంశ్రుతులఁ గట్టువడకయుండఁ
బ్రణయగీతంబులను మాఱువలుకకుండ
విడివడిన దొక్కటియు లేదు విశ్వమందు.
ప్రణయభావంబు లేని శబ్దంబు లేదు
ప్రణయసత్కళ లేని రూపంబు లేదు
ప్రణయరససీకరము లేని రసము లేదు
ప్రణయగుణలేశమే లేని ప్రకృతి లేదు.
ప్రణయగానామృతంబునఁ బ్రకృతి బ్రదుకుఁ
బ్రణయగానరసంబునఁ బ్రకృతి వాడలుఁ

ప్రణయగానతానంబునఁ బ్రకృతి యొడఁగుఁ
బ్రణయసంగీతరావమే ప్రణవరవము.

(4-3-1922.)

---

# 98 ధర్మపత్ని.

పనులలోఁ జేయి, పలుకులోపలను బలుకు
మనసులోపల మనసు జీవనములోన
జీవనముఁ జేర్చి యొక్కటై చేరుకొనిన
కాంతకంటెను సాయంబు గలదె జగతి.

---

ఆ. ఆత్మసుఖము రోసి యభిమానమును బాసి
మమత విడిచి, కామితముల నడఁచి
తనకు దాసియైన ధర్మగేహినికంటెఁ
బతికి నెందుఁ బ్రేమపదము గలదె?

సీ. పరమోదారిద్ర్యంబుఁ బాసి యెప్పటికైన
వైభవరాశి గావచ్చు దాసి
పారతంత్ర్యంబును బాసి యెప్పటికైన
స్వాతంత్ర్యశీల గావచ్చు దాసి
పరిచారికాత్వంబుఁ బాసి యెప్పటికైనఁ
బట్టంపురాణి గావచ్చు దాసి
పరపుష్టజీవికఁ బాసి యెప్పటికైనఁ
బరమాన్నదాత్రి గావచ్చు దాసి
కాని, నిదురించువేళ, మేల్కాంచువేళ
సుఖపడెడువేళ దుఃఖంబు సోఁకువేళ
గలిమి గలవేళ, లేవడిఁ గన్నవేళ
దాసి యే భర్త కెపుడైన ధర్మపత్ని.
క. ఆదాసీత్వమునకుఁ దుది
యాదాసీత్వమున కర్థమై తగుమూల్యం
బాదాసీత్వమునకు మితి
వాదంబునకైనఁ గానవచ్చునె యెందున్.

(27-5-22.)

# 99 విరహసంగీతము.

విశ్వంబు వెలయించు వెన్నెలపాట
భువనంబు లలరించు పువ్వులపాట
కోరికల్ చిగురించు కోకిలపాట
కడలేనిపాటలోఁ గలసిన దేమొ?

గీ. మేటి వనవాటి సెలయేటి నీటివాలు
పచ్చ గొజ్జంగిపూవు జప్పరముక్రిందఁ
జలువపన్నీటఁ బెరిఁగిన వలపుఁదీవ!
వేఁడికన్నీటిలో నిన్ను వెదకవలసె.

గీ. ఆశ లన్నియుఁ గూడ శూన్యంబులయ్యెఁ
గటికిచీకటి లెల్లెడఁ గ్రమ్ముకొనియె
నిండుపున్నమ నవ్వె వెన్నెలవెలుంగు
మొఖుఁగుజక్కులగుంపులో మఱఁగిపోయె;

గీ. దీటు గనరాని చదలేటి నీటిలోని
యూర్మికలలోన నుయ్యాల లూఁగియూఁగి
వెలఁదిచిన్నెలఁ గన్నులవిందు సేసి
తరలిపోయితె వినుత్రోవఁ దప్పినావ?

ఆ. చిగురుతొగరుఁ జూచి చిన్నారిపొన్నారి
పూవుతావి చూచి పోల్చుకొంటి
భావలతిక గానఁబడకుండ నిట్టూర్పు
సెగలఁ బొగులుచున్న చిన్నెలెల్ల.

గీ. సంజకెంజాయ వెలిసిన జాడలోన
నాకనులలోన క్రొన్నెలరేకఁ జూపి
కడకుఁ గన్నీటికాలువగట్టుమీఁద
నెవరు చీకట్లఁ బెట్టిరో యెఱుఁగనైతి.

గీ. [illegible]కళామాధురీమూర్తి రాక వోయి
భావసాగర ముప్పొంగు పక్ష మరిగి
నయనకువలయములు విచ్చునాళు లేఁగి
నిండుచీకటిరాత్రియే నిలిచెఁ దుదకు.

గీ. చల్లగాఁ దోఁచునాదుజాబిల్లి నెవరొ
దాఁచుకొన్నారు నీలాంబుదంబులోన
నట్లు గాకున్నఁ గనరానియాశ లేల ?
చిటుకు చిటుకున జాఱునీచినుకు లేల ?

గీ. పతగి ! నీమనోహరభావగతులఁ గనుల
విందు సేయుచు నెగిరెడి వేళలందు
నీదు బంగారుటెక్కల నీడ నాదు
నేను నొక గేస్తు ననుకొంటి నేఁ డ దేది ?

ఆ. మాటలాడినట్లు పాటపాడినయట్లు
తోఁచితోఁచి నిన్నుఁ జూచుకొఱకుఁ
గనులఁ గడుగుచుంటిఁ గడవెఁడునీళ్లతో
రమణి! యింకఁ గానరావె నాకు?

ఆ. కలలనైన నిన్నుఁ గాంచు భాగ్యము వోయె
నిముసమైనఁ గనుల నిదురలేక
పవలు రేయి దోఁచు ప్రకృతి లేకయ పోయె
జీవధనమ వైన నీవు లేక.

ఆ. చిలుకపలుకు లేవొ చెలువంపుఁగోకిల
పదములేవొ తేఁటిపాట లేవొ
మాట లేవొ నన్ను మఱపింప మఱపించి
నావసంతలక్ష్మి నన్నుఁ బాసె.

గీ. అదియె సుమధురదివ్యగానానుభవము
అదియె సుమధురమందానిలానుభవము
అదియె సుమధురపుష్పగంధానుభవము
కాని నావసంతేందిర గానరాదు.

(13-8-1922.)

# 100 రవీంద్రుఁడు.

సీ. సుకవితారసవాహినికిఁ బుట్టినిల్లైన
చొక్కంపువిరిదేనెసోన వీవు
సరసభావసుగంధసరణికి నిరవైన
తోరంపుఁ బువ్వులతోఁట వీవు
ప్రణయకళాపరంపరకు మూలంబైన
నిద్దంపుఁబండువెన్నెలవు నీవు
దివ్యవిజ్ఞానకాంతికి నిధానంబైన
తెల్లంపురతనాలదివ్వె వీవు
గీ. మోటుమాపులఁ జిగురించు పాట వీవు
పాటలోఁ జొక్కి చొక్కించు పక్షి వీవు
పక్షిలో భావగతిఁ జూపు ప్రౌఢ వీవు
ప్రణయరససాంద్రసుకవిచంద్రా! రవీంద్ర!
సీ. కన్నులలోఁ బొంగి కరుణామృతరసంబు
గంగాభవానికి గతులు నూప
మాటలలోఁ బుట్టి మధురసంగీతంబు
ప్రణవగీతమునకుఁ బటిమ నూప
నవ్వులలోఁ దేలి నవ్యకళాలీల
శీతాంశురేఖకుఁ జెలువు నూప

తలఁపులలోఁ దోఁచి తత్త్వదివ్యజ్యోతి
వేదాంతసరణికి వెలుఁగు చూప
గీ. శాంతిసదనంబునందుండి సరసమధుర
మృదులకవితారసంబుగో మేను మఱచి
యఖిలము నెఱుంగఁగలరాజహంస వీవు
ప్రణయరససాంద్రసుకవిచంద్రా! రవీంద్ర!

ఉ. పువ్వులతోఁటలో విరిసి
పొంగిన వెన్నెలవెల్లి తేటలో
నవ్వులమూటలో నిలువు
నం బులకించిన వీణెపాటలో
మవ్వపుఁ రూపుఁ గన్నరస
మంజరి నీకవితాలతాంగి కిం
కెవ్వరు సాటివత్తురు సు
ధీంద్ర! రవీంద్రకవీంద్రశేఖరా!

సీ. వాసంతికానందవైభవంబును బాడు
రమణీయకోకిలారవముఁబోలి
ఉన్ముఖబ్రాహ్మముహూర్తంబుఁ గీర్తించు
వరతామ్రచూడారవంబుఁ బోలి
అమృతప్రపూర్ణవర్షాగమంబు నుతించు
బర్హికేకావిరావంబుఁ బోలి

సర్వేశ్వరాత్మసాక్షాత్కారమును దెల్పు
ప్రణవఘంటావిరావంబుఁ బోలి

గీ. పుణ్యమయవిశ్వభారతీమూర్తి వైన
ధన్య నినుఁగూర్చి మాకవితాలలామ
సరసగతిఁ బాడుచున్నది సాధుగీతి
ప్రణయరససాంద్రసుకవిచంద్రా! రవీంద్ర!

మ. నవలీలాలలితంబుఁ బ్రేమమయ మా
నందోజ్జ్వలం బాత్మవై
భవసంపూర్ణ మనంతశాంతరససం
పన్నంబునై యొప్పునీ
కవితాలోకమునందుఁ గన్గొనిన యా
కల్యాణతేజంబు స
త్కవిరూపంబునఁ గంటి మిప్పుడు రవీం
ద్రా! సాంద్రతేజోనిధీ!

ఉ. కూనల నైనమిం గుపులి
కోరలఁ బువ్వులు పూయ నెంతవి
జ్ఞానుల నైన నోంచు ఘన
శంకల సంకులు మ్రోయ రేపవల్
మానక లోకముం గలఁచు
మాయల వెన్నెలగాయఁ బ్రేమలోఁ

దానముఁ జూపు నీకవిత
ధన్యుఁడ వీవు రవీంద్రసత్కవీ!
(9-9-22.)

# 101 ఏకాంత సేవ.

చ. ప్రభువిరహాంబునం గవిత
పాడినపాటలరీతులున్ మనః
ప్రభువిరహాంబునన్ దయిత
పాడినపాటలభంగులున్ జగ
త్ప్రభువిరహాంబునం బ్రకృతి
పాడినపాటలలీలలున్ సమ
ప్రభల సమానురాగరస
భావములం దగు నొక్క-టేగతిన్.

క. సేవ్యులకు సేవకులకున్
భవ్యమనోమయసమృద్ధానుబంధ మామృతమై

దివ్య మగునెడల సుజన
స్త్రవ్యం బేకాంతసేవ జరగు నచలమై.

క. లోకోత్తర మగుప్రణయసు
ధాకల్లోలినిసహాస్రధారలు నెచ్చో
నేకముఖం బగు నచ్చో
నేకద యేకాంతసేవ లెవ్వరికైనన్.

(17-10-22.)



# 102 రత్నహారము.

అవతారిక.

శ్రీయోగమయమైన సిద్ధరత్నంబు
ఆరోగ్యమయమైన యమృతరత్నంబు
రఘుపతి వేంకటరత్నంబునకును
ఆయురారోగ్యభాగ్యంబులఁ గూర్పఁ
దొలి షష్టిపూజలోఁ దోఁచినరీతి
మలిషష్టిపూజకు నాటలుదాఁచి
యెలమి వేంకటపార్వతీశ్వరకవులు
పరమేశ్వరుని గూర్చి పాడినపాట :—

(మంజరి.)

శ్రీపుష్పహారంబు చేతిలో నుండ
ముత్యాలహారంబు ముంగొంగునుండ
నీరత్నహారమే యింపయ్యె నేమొ
నాథుండు ధరియించి నవ్వుచున్నాఁడె!
పొలపంపునవ్వులోఁ బువ్వులు విరియ
ముసిముసినవ్వులో ముత్యాలు గురియ
గలకలనవ్వులోఁ గన్నులు మెఱయ
నాప్రేమరత్నంబు నవ్వుచున్నాఁడ

౨

తెమ్మెరపాటలోఁ దేరినచలువఁ
దుమ్మెదపాటలోఁ దోఁచునాదంబుఁ
బువ్వులపాటలోఁ బొడమినతేనె
వెన్నెలపాటలో వెడలిననిగ్గు
రాగమాలికఁ జేర్చి రతనాలపాట
సుకవినై పాడుచు సొగయుచు నుండ
నీప్రేమకరముల నెమ్మేను నిమిరి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

3

మధువనస్పతులతో మందు సేవించి
యజ్ఞానరోగంబు నడఁగింపలేక
మధురాక్షరములతో మంత్రముల్ చదివి
యాశాపిశాచంబు నదలింపలేక
విస్మృతారణ్యముల్ విశ్వకోశములు
శోధించి శోధించి చూచుచు నుండ
సిద్ధామృతం బిట్టె చేతిలోఁబెట్టి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౪

విరిదండలకు నెంతొ విలువ లేదనుచు
స్వర్ణభూషణవ్రతుల సంతరించితిని ;
బంగారునగ లెంతొ బరు వయ్యె ననుచు
మెఱుఁగులకై గుడ్డ్లు మిసుకరించితిని ;
యాసించువారికే యలజడుల్ గాని
కోరుకోరికలకుఁ గొదలు లేవనుచు
నాజ్ఞానమూర్తివై ననుఁ బ్రబోధించి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె !

౫

జోడుదివ్వెలు వెల్గు చూపించుచున్న
సూర్యచంద్రులు కాంతి సూచించుచున్న
మనసులో నేమాయ మబ్బుపట్టినదొ
కడలెల్ల గాఢాంధకారమే యయ్యె ;
ఈచిమ్మచీకటి కీవెల్గునకును
నేనాఁటిసంబంధ మెఱిఁగింపు మనిన
నామాటతోడనే నను హెచ్చరించి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె !

కనుఁగొన్నయట్లుగాఁ గలలఁ గాంచితిని ;
గద్గదస్వరముతోఁ గలవరించితిని,
మెఱసినచోటెల్ల మెలపుతో వెదకి
దొరకినమణి యెల్ల దొలిచి చూచితిని,
ఇన్నింటఁ గనరాని యీరత్నమూర్తి
కిన్నిటిలోననే గానవచ్చుటకుఁ
దాత్పర్య మేమని తలపోయుచుండ
నా ప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౨

చేయిజాఱెడుబిడ్డ చెలువంబుఁ జూచి
చిదిమివైచెడుకొమ్మ చిగురాకుఁ జూచి
యారిపోయెడుదివ్వె యందంబుఁ జూచి
జాఱిపోయెడుచుక్క చందంబుఁ జూచి
వట్టిపోయెడు నేటివడినీటిఁ జూచి
వాఁడిపోయెడిపువ్వు వగనవ్వుఁ జూచి
ప్రకృతిలీలలఁ జూచి ప్రణయంబుఁ జూచి
నా ప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౮

కళల జాతించెడి కడసారివెలుఁగుఁ
జుక్క పుట్టిననాఁడె చూడలేనైతి ;
నెత్తావులెడలించు నిట్టూర్పుఁ బొగలఁ
బూవు పుట్టిననాఁడె పొడగాననైతి ;
నిఖిలంబు వెలిఁగించు నీచిత్రకళల
సకలంబు మఱఁగించు చాయ లెక్కడివో
నీదివ్యతత్త్వంబు నేఁటికిఁ జూపి
నాజ్ఞానరత్నమా నవ్వుచున్నావె !

౯

ప్రేమరత్నము స్వర్ణపేటికఁ బెట్టి
మమకారమునఁ జిక్కి మఱచిపోయితిని ;
భావరత్నము జాళువాపూల దాఁచి
మదవాసనలఁ జొక్కి మఱచిపోయితిని ;
జీవరత్నముఁ బైఁడిచెంగున ముడిచి
మాయలోపలఁ జిక్కి మఱచిపోయితిని ;
నన్నె నే మఱచిన నావంకఁ జూచి
నాజ్ఞానరత్నమా నవ్వుచున్నావె !

౧౦

నానాఁటికిని దోఁచు నాయింటిమువ్వ
యేనాఁటి కానాఁడ యెత్తి పోసితిని ;
ఏమూల నుంటివో యీ వందులోన
బంగారుతీఁగలఁ బండించినావు ;
కనుపాపలో నున్న కల్యాణమూర్తి
నిందాఁకఁ గనలేని యీమందమతికి
దివ్వెఁ జూపఁగ దివ్వెఁ దేవలెనంచు
నాప్రేమరత్నమా సవ్వుచున్నావె !

౧౧

ఘనపుటంబులనైనఁ గ్రాఁగనినీవు
కన్నీటివేఁడికే కరఁగుటఁగాంచి
తొమ్మిదినిధులైనఁ దూఁగనినీవు
తీయనిమాటకే తేలుటఁ గాంచి
యీరేడుజగములం దిముడనినీవు
నలుసంతకంటిలో నటియింపఁ గాంచి,
యీవింత లేమంచు నేనెంచుచుండ
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె !

౧౨

ఏపుణ్యగరిమనో యీతళుకు గలుగ
నేయదృష్టముననో యెగురుట గలుగ
నిర్మలజ్యోతిని నేనే యటంచు
మిణుఁగురుపురుఁగన్నై మిడిసిపోయితిని;
నిఖిలంబు వెలయించు నీమూర్తి యెదుట
మినుమానికము గూడ మిణుఁగురేయనుచు
నీదివ్యతత్త్వంబు నేఁటికిఁ జూపి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౧౩

పాదాలకడఁ బుట్టి పసిపూపసిందె
తెలియకుండఁగఁ దన్ను దిగమ్రింగుచుండ
భావింపలేనియీ ప్రసవంపుబాల
కమ్మఁదావుల నెల్ల కడలఁ బ్రాఁకించి
యింతమాత్రానకే యెదలోనఁ బొంగి
ముకుతవాఱిన తనమొగ మింతచేయఁ
జింతలో నింతలోఁ జిఱునవ్వు లనుచు
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౧౪

ఏమూలనుండియో యెప్పుడో వచ్చి
చిగురుఁగొంగుల నున్న జీవధనంబుఁ
బొంచుండి యెవ్వరో పుణుకుచునుండఁ
దెలియంగలేనియీ తీవతన్వంగి
వలపించుచిన్నెల వన్నెలఁ జూపి
సహకారమునఁ గోర్కి సాగించుచుండఁ
జింతలో నింతలోఁ జిఱునవ్వులనుచు
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౧౫

వాలుకాకణముల వరమణుల్ చేసి
వెలిఁగింపఁజాలు నీవిమలతేజంబు
వారిశీకరముల వాహినుల్ చేసి
ప్రవహింపఁజేయు నీప్రణయామృతంబు,
అల్పరేణువుల బ్రహ్మాండముల్ చేసి
యాడింపఁ జాలు నీయద్భుతశక్తి
నేనొక్కసారిగా నీకళాలీలఁ
దెలిసి కన్గొనఁగంటి దివ్యరత్నంబ!

౧౬

కరుణాపయోరాశి గర్భంబునుండి
యమృతకుంభంబుతో నవతరించితివో?
కనకభూమీధర గర్భంబునుండి
యమృతవాహినులతో నవతరించితివో ?
గగనకల్లోలినీ గర్భంబునుండి
యమృతాంశుకళలతో నవతరించితివో?
నాజ్ఞానమూర్తివై ననుఁ బ్రబోధించి
పరమార్గ మెఱిఁగింపు ప్రణయరత్నంబ !

౧౭

కాలజీమూతాంధకారగర్భమున
నేమియుఁ దోఁపక యేనున్న వేళ
సన్నిధిఁ బెన్నిధి చాడ్పునఁ దోఁచి
కన్నుల వెన్నెలఁ గాయించినపుడె
కాననికన్నులఁ గళఁగూర్చువెలుఁగు
నీలోపలివెలుంగు నేఁజూడఁగంటి
నేవెల్గునుండి నీ కీవెల్గు కలిగెఁ
జెప్పవే చెప్పవే జీవరత్నంబ ?

౧౮

చిన్ని చెక్కులఁ బాల జిడ్డులు మెఱయు
చిన్నారిపసుఁబాప చిఱునవ్వు వెలుఁగు,
బారలు సాఁచి పైఁబడుబిడ్డ నెత్తి
కౌఁగిలించెడితల్లి కన్నుల వెలుఁగు,
ప్రథమదర్శనమునఁ బ్రణయంబు నించు
తరుణులవలచూపుఁ దరఁగలవెలుఁగు
నీవెల్గులోపలనే యెట్లు తోఁచెఁ
బలుకు మీచిత్రంబు భావరత్నంబ!

౧౯

సంజకెంజాయల సానదీరితివా
చక్కనిచుక్కల జిగలఁ జేరితివా
తొలుకారుమెఱుపుల తోఁట దేలితివా
వెలలేనివెన్నెల వెల్లిఁ దేలితివా
విజ్ఞానదీపిక వెలుఁగులోనుండి
విశ్వంబు వెలయింప వెడలి వచ్చితివా
నిజముగా నీవెల్గు నీ కెట్లు గలిగెఁ
దెలుపవే తెలుపవే దివ్యరత్నంబ!

౨౦

తల్లిదండ్రులు లేక తనయులు లేక
యిష్టబంధులు లేక యిల్లాలు లేక
కుడువఁ గూడును గట్ట గుడ్డయు లేక
దిక్కేది విలపించు దీనమానవుల
యాఁకటిమంట వెన్నంటినకడుపు
లగ్గికొండలరీతి నదరుచునుండ
నార్తులఁ దొలఁగించు నమృతంపుఁగళలఁ
బ్రసరింపవే నీవు ప్రణయరత్నంబ !

౨౧

కామాదివికృతులు కంచెలఁ గొట్ట
వాతాదిదోషముల్ వడిపుడుల్ వెట్టఁ
దనవార లైనను దరిఁ జేరరాని
ఘనరోగముల నుఱ్ఱికి కడగండ్లఁ జిక్కి
కన్నవారలకెల్లఁ గడుపులు దఱుగ
దుస్సహబాధల దురపిల్లువారి
సదయుండవై చూచి సంజీవకళలఁ
జిలికించి ప్రోవవే సిద్ధరత్నంబ !

౨౨

నిత్యకళ్యాణంబు నిప్పచ్చరమున
నూషరక్షేత్రాన నుద్యానవనము
కమ్మనివిరిదమ్మి గలుషపంకమునఁ
జివికించుచింతలోఁ జిఱునవ్వు మొలక
యమృతకాసారంబు నమ్మరుభూమి
దుఃఖసాగరములో దుగ్ధఫేనంబు
సంతరింపఁగఁజాలు సౌవర్ణకళలు
కలవుగా నీలోనఁ గాంతిరత్నంబ!

౨౩

ఆర్తస్వరంబులో నానందగీత
మాలకింపఁగఁజాలు నమృతమూర్తులకుఁ
దీవ్రశాపంబులో దీవనపదము
పట్టిపాడఁగఁజాలు పరమశాంతులకు
మోహజాలంబులో ముక్తిమార్గంబు
తరిచికన్గొనఁజాలు తత్త్వవేత్తలకు
నీదివ్యకళ కళానిలయమో యేమొ
సత్యంబుఁ దెలుపవే జ్ఞానరత్నంబ!

౨౮

అద్దించి రెవ్వరో యాకారలీలఁ
జిత్రించి రెవ్వరో చిత్రవర్ణముల
మెఱపించి రెవ్వరో మింటి కెక్కించి
మఱపించి రెవ్వరో మాయఁ జిక్కించి
యేనింద్రధనువనై యిన్నాళ్లదాఁక
నెండవానలనంది నిఱుకుచుఁ దుదకు
నీనిత్యకళ్యాణ నిర్మలకళలఁ
దెలిసి కన్గొనఁగంటి దివ్యరత్నంబ!

౨౯

చక్కనిచుక్కల చకచకల్ సూచి
నిద్దంపుమొగ్గల నిగనిగల్ సూచి
తామరపైనీటి తళతళల్ సూచి
మింటిపై మిణుఁగురు మిళమిళల్ సూచి
వాడెంబు దెలియని నాశైశవమున
వవి యెల్ల రత్నాలె యనుకొంటిఁ గాని
బొగ్గులలో మణుల్ పుట్టించు నిన్నుఁ
దెలియంగలేనైతి దివ్యరత్నంబ!

౨౬

ఎఱుఁగనితనములో నేమువుఁగో నె
పకపకనవ్వితిఁ బసుపుఁబొత్తిళ్ల;
నానవ్వు లావేళ నాతల్లి ప్రేమఁ
దళుకొత్తుకన్నులఁ దళతళలాడె;
ఆనవ్వు లాతళ్కు లానాఁటినుండి
యీనాఁటిదాఁక నే నీక్షింపనైతి
నేఁటి కాచిఱునవ్వు నీకంట మెఱయ
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౨౭

ఆనాఁడు పసిపాప నై యున్ననాఁడు,
తూగుటుయ్యాలలోఁ దూగెడునాఁడు
జోలపాటలలోనఁ జొక్కెడునాఁడు
తెలివియు నిద్రయుఁ దెలియనినాఁడు
ఈవు నే ననుభేద మెఱుఁగనినాఁడు
చూచి చూడనిరీతిఁ జూచితి నాఁడు;
నాయదృష్టంబున నాఁటికి నేఁడు
తెలిపి విస్మయఁగంటి దివ్యరత్నంబ!

౨౮

నిడుదపెన్నెలులలో నీలాలఁ జూచి
పక్వాధరములలోఁ బగడాలఁ జూచి
మొలకదంతములలో ముత్యాలఁ జూచి
రమ్యహాసములలో రతనాలఁ జూచి
రతనాలగను లన్న రమణులే యనుచు
యౌవనమదముచే నలరితిఁగాని
నిత్యమోహనకళల్ నీసొమ్ము లనుచు
భావింపలేనైతిఁ బ్రణయరత్నంబ !

౨౯

తొలఁగిపోయినదాఁకఁ ద్రుళ్ళింపఁజాలు
సౌభాగ్యవైభవ సంపత్తిఁజూచి
వయసు తీరినదాఁక వలపింపఁజాలు
కామినీమణుల సింగారంబుఁ జూచి,
కామాంధకారంబు గన్నులఁ గప్ప
నీవంకఁ గనలేక నేనున్నవేళ
నాదివ్వె వెలిఁగించి నావంకఁ జూచి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె !

౩౦

కలికివాలూపుల కలకల లేక
క్షణము యుగంబుగాఁ గడపిననేను,
మిసిమిబంగారంపు మిలమిల లేక
గడియ కల్పంబుగాఁ గడపిన నేను,
ప్రాణంబునకుఁ బ్రాణమైయున్నని
మఱచియుండినయట్లు మది నెంచనైతి;
ఈమందమతిఁ జూచి యిన్నాళ్లదాఁక
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౩౧

కన్నులలో వెల్గు కనుఁగొనలేక
పవలింటిలో వెల్గు పరికింపలేక
పాడింటిగోడల పైసందులందుఁ
జీకటిగూటిలోఁ జిక్కిపోయితిని;
ఇంతింతకనులున్న యీగుడ్లగూబ
తిమిరరోగము మాన్పఁ దెలివిమం దిచ్చి
చీకటిపారఁ దీసి చేతిలోఁ బెట్టి
నా ప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౩౨

గాజువారిన చిల్లిగవ్వలఁ జూచి
పనికిమాలిన గడ్డిపరకలఁ జూచి
గాలిఁదూలెడు పొల్లుకాయలఁ జూచి
పిటిలిపోయెడి కుండపెంకులఁ జూచి
పేరానవోని నాపెద్దకాలమున
హేమరత్నము లంచు నెంచితి, గాని
కోరుకుల్ పండించు గుణమణి నిన్ను
సాధింపలేనైతి జ్ఞానరత్నంబ!

నను బ్రాణముగ నెంచు నాకన్నతల్లి
యడిగిన వెల్ల నా కందించుచుండఁ
దనివి తీరక యాస తల కెక్క త్రిప్ప
దేశదేశంబులఁ దిరుగుచు నుండఁ
దిరిసి కూర్చినతేనె తెరఁ గొంచుఁబోవు
నెఱుకువానిని దేనెటీఁగలఁ జూపి
నాచూపుతోడనే ననుఁబ్రబోధించి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౩౮

చీకటు లడఁగించు చేదివ్వెతోనె
కనకసౌధంబులఁ గాల్చివైచితిని,
ఆమయంబు లడంచు నమృతంబుతోనె
తీయనిప్రాణముల్ తీసివైచితిని,
సత్యంబు బోధించు చదువులతోనె
మఱపించి జగమెల్ల మాయఁజేసితిని
నాతప్పు మన్నించి ననుఁ గటాక్షించి
దర్శనం బిచ్చితే దైవరత్నంబ !

౩౯

పన్నీటఁ బెంచిన ప్రణయంపుఁదోఁటఁ
గ్రొన్నెత్తురులసోనఁ గురిసి ముంచితిని;
మాళిఁదాల్చుచునుండు మణికిరీటంబుఁ
బాదరక్షల మట్టి పగులఁగొట్టితిని;
కోఱివిదయ్యముఁబోని కోపంబుచేత
నిలువెల్ల నిప్పుగా నేనున్నవేళ
నీశాంతకరముల నెమ్మేను నిమిరి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౩౮

దోమనై గజరాజు దొరసి మొట్టితిని,
రిక్కనై రేరాజు రెక్కఁబట్టితిని;
ఈఁగనై ఖగరాజు నెదిరి నిల్చితిని,
పురుగనై ఫణిరాజుఁ బోరఁబిల్చితిని;
ఒడలెఱుంగని గర్వ ముప్పొంగిపోవ
నెదిరి న న్నెఱుఁగక యే నున్నవేళ
నాపుస్తకంబులో నాపేరుఁ జూపి
నా ప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౩౯

ప్రకృతిరాజ్యంబునఁ బలుమాఱుఁ దిరిగి
స్వప్నరాజ్యంబుతో సరిచూచి చూచి
సౌఖ్యవాహినులలో స్నానంబులాడి
దుఃఖవాహినులతోఁ దులఁ దూఁచితూఁచి
తలక్రిందు గావించి తల కంటగించి
తెలిసియుఁ దెలియక తిరిగి వేసారి
యాకస్మికముగ నీ యానందకళల
వెలుఁగున మేల్కాంటి విమలరత్నంబ!

౩౮

నిరుపేదలకుఁ బొట్టనిండుటఁ జూచి
నిధినాథు లాఁకట నీల్గుటఁ జూచి
కోరక సౌఖ్యముల్ కూడుటఁ జూచి
త్రోయక సంపదల్ తొలఁగుటఁ జూచి
చూచి చూడనిరీతి సుఖదుఃఖములకు
నీశ లౌదురుగాని నీయున్నచోటుఁ
గోటి కొక్కఁడుఁ జేరుకొనఁజాలఁడనుచు
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౩౯

నీపుస్తకంబులో నీయాకులోన
నీపాట నీపేరు నేఁ గానలేక,
నీచరిత్రంబులో నీకీర్తిలోన
నీమూర్తి నీవెల్గు నేఁ గానలేక,
సారస్వతంబెల్ల సాధించి చూచి
విశ్వకోశంబెల్ల వెదకి గాలించి
యింకేది గతి యంచు నెదఁ గుందుచుండ
దర్శనం బిచ్చితే దైవరత్నంబ!

౪౦

సుడిగాడ్పు టెండల సోలిపోకుండఁ
బక్షినై నినుఁ గూర్చి పాడుకోనిమ్ము !
మబ్బు పెందెరలలో మాటు గాకుండఁ
జక్కనై నీసొంపుఁ జూచుకోనిమ్ము!
ఇసుకకొండలదండ నింకిపోకుండ
సెలయేటినై నిన్నుఁ జేరుకోనిమ్ము !
నీకొల్వుఁ గోరితి నిరతంబు, నిన్ను
సేవించుకోనిమ్ము జీవరత్నంబ !

౪౧

అమ్మలపాదులతో నమృతరసంబుఁ
బువ్వుఁదీవలకును బోసెడివేళఁ
గొదమతుమ్మెద నొవ్వఁ గుట్టినచేత
గున్న పొన్నకు బోదెఁ గూరుచువేళ
ముల్లునాటినపాదముల నల్లనరిగి
మల్లెతీవకు నీరు మలపించువేళఁ
బ్రణయంపుఁబూఁదోఁటఁ బచ్చికబైట
నా ప్రేమరత్నమా నవ్వుచున్నావె !

౪౨

పాపపుఁగొండలు బరువంటిఁగాని,
పైఁడికొండలకునై ప్రాఁకులాడితిన ?
నిలువుమీ నన్ను సన్నిధి నంటిఁగాని,
పెన్నిధు లివ్వుమని పెనఁగులాడితిన ?
కఱకురాళ్లను గూడఁ గన్నీరు గురియ
వెత్తినై నినుఁగూర్చి విలపించుచుండ
నేమూలనో దాఁగి యిన్నాళ్ళుదాఁక
నా ప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౪౩

నీమాట లనుచుంటి నిను మెచ్చుచుంటి
నీకలల్ గనుచుంటి నిన్నెంచుచుంటి
నీపాట వినుచుంటి నీచెంతనుంటి
నీలీలఁ గనుచుంటి నీలోననుంటి
నివియెల్ల నిట్లుండ నిన్నాళ్లదాఁక
నెన్నియో జన్మంబు లెత్తితిఁగాని
కన్నుండి నీమూర్తిఁ గననైతి ననుచు
నా ప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౪౮

నీరెండలోనఁ బన్నీరు పొంగించి
వెన్నెలవెలుఁగులో వెన్నదీయించి
చుక్కలలోఁ దేనెచుక్క లొల్కించి
పలుకులలోననే భావముల్ చూపి
కవితచే లోకంబు కన్నులమూయు
కవిని నీలీలాసుకవిని గావించి
ప్రణయరాగమున నీపాట పాడించి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౪౯

నీనామగానంబు నేఁ జేయువేళ
నగుఁగాక మలహరి యానందలహరి;
నీమంత్రము జపంబు నేఁజేయువేళఁ
బ్రత్యేకబీజంబుఁ బ్రణవమౌఁగాక;
నీగుణధ్యానంబు నేఁజేయువేళ
ఘనకీర్తి యగుఁగాక కల్యాణమూర్తి;
గుడి నిల్పుకొనువేళఁ గుటిలచిత్తంబు
చెదరకుండినఁ జాలు జీవరత్నంబ!

౫౦

కృపణత్వమునఁ జేసి కృషి చేయలేక
పండువంటిపొలంబు పసిబీడు చేసి
పెఱవారిమళ్లలోఁ బేరాసఁ జేసి
పక్షులఁ దోలుచుఁ బరిగెల నేఱి
యాఁకలి దీరక యాయాసపడుచుఁ
దప్పు దారులలోనె తడఁబడుచుండ
నాయదృష్టమున నిన్నాళ్ల కీవేళఁ
బ్రత్యక్ష మైతివే భాగ్యరత్నంబ !

౫౧

నీలంపుఁ దెరవెన్క నిధు లున్నవనుచు
నేలకు నింగికి నిచ్చెనల్ గట్టి
యేవేళఁ దప్పక యెక్కుచు దిగుచు
నడియాసఁ దూలుచు నడలుచు నుండఁ
బ్రొద్దుమూసినమబ్బు పొర నొత్తగించి
నిలిచినచోటఁ బెన్నిధులు చూపించి
వాంఛితంబులు నాకు వలదనిపించి
నాభాగ్యరత్నమా నవ్వుచున్నావె !

౫౨

నీవెల్గు నామది నిండుటే కాక
నిఖిలదిగంతముల్ నిండిపోయినది ;
నీయీవి నాయొడి నింపుటే కాక
నిఖిలసంసారముల్ నింపివైచినది ;
నీమూర్తి నాచెంత నిలుచుటే కాక
నిఖిలలోకంబుల నిలువరించినది ;
నేనింతవాఁడనై నీయంతవానిఁ
దెలియ టబ్రిము గాదె దివ్యరత్నంబ!

౫౩

విశ్వంబు నేలు నీవిభుత సూచింప
దినమణియే కరదీపిక యయ్యెఁ ;
భవదీయసేవావిభవము సూచింప
రాజరత్నంబె నీరాజనం బయ్యెఁ ;
దిలకింపరాని జ్యోతిర్మూర్తి వీవు
లక్షింపరాని కళామూర్తి వీవు
నీదివ్యమూర్తి వర్ణింప నేనెంత ?
దయఁజూడు దయఁజూడు దైవరత్నంబ!

౧౮

గాలివాన కొకింత కలఁగిపోకుండ
సుడిగుండములలోన సుడిసిపోకుండ
బలితంపుఁ గొండలఁ బగిలిపోకుండ
మొత్తంపుఁదరఁగల మునిఁగిపోకుండఁ
దడఁబాటుతో దారి తప్పిపోకుండ
నడిసముద్రంబులో నాయోడఁ ద్రిప్పు
నావికరత్నంబు నక్షత్ర మగుచు
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె !

౧౯

సత్యమే జయమని చదివిన నేను
సాధింపలేనైతి జయకేతనంబు ;
శాంతమే సుఖ మని చదివిన నేను
శోధింపలేనైతి సుఖనిధానంబు ;
తెలియనితెలివితోఁ దిరిగెడి నాకుఁ
జదువులో మర్మంబు జగతిమర్మంబు
గరతలామలకంబు గాఁ దోఁచురీతిఁ
దెలిపి చూపితిగాదె దివ్యరత్నంబ !

౯౬

ప్రేమమైకమూర్తి నాపజ్జను నిలువఁ
గష్టంబు లెల్ల సుఖంబులే యయ్యెఁ
గల్యాణమూర్తి నాకన్నుల నిలువ
దుఃఖంబులెల్ల సంతోషంబు లయ్యె
నిర్మలమూర్తి నా నెమ్మది నిలువ
నానంద మెల్ల బ్రహ్మానంద మయ్యె
నజ్ఞాన మెడలించు నానందకళలఁ
దేలియాడెద నింక దివ్యరత్నంబ!

౯౭

లోకంబులను గుక్షిలో దాఁచి ప్రోచు
దివ్యమూర్తిని నిన్నుఁ దెలియంగలేక
తరుణియో పురుషుఁడో తలఁప నేమూర్తి
వీవని వెఱ్ఱినై యేనెంచుచుండి
మధురప్రణయ సుధామయమాతృమూర్తి
మంగళవాత్సల్యమయ పితృమూర్తి
నీమూర్తిలోపలనే నాకుఁ జూపి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౫౭

వసువు రాచినయట్టి పసిఁడిరేకులను
బైఁడిగంటములతోఁ బద్యముల్ వ్రాసి
చదువులగని యైన సర్వజ్ఞమణికిఁ
గృతకృత్యతను గోరి కృతి నీయఁగంటిఁ;
బరిత్యక్తురమునందుఁ బరిణయరసంబు;
ప్రసరించెనో లేదొ పరికింపుమంటి
హృదయంబు గ్రహియించు నింగితజ్ఞునకు
విన్నపంబు లిఁకేల విబుధరత్నంబ!

౫౮

నవనిధు లర్పింప నావల్లఁగాక
నవరసంబులు నింప నాచేతఁగాక
నవరత్నములమూట నామాట గాక
నవరాత్రిదీక్షలో నాశక్తి కొలఁది
నేనుగూర్చినయట్టి యీపద్యరత్న
హారంబుఁ గానుకగా నందింప నంటి
నామాట లాలించి నాచేత లెంచి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౬౦

ఒక్కొక్కవిధముగా నూహఁ గావించి
యున్నంత తెలివితో నోపినరీతి
నిత్యనిర్మలమైన నీమూర్తిలోన
నణువదింటెని గంటి నానందకళల ;
ఈలీల నీలీల లెన్నెన్ని గలవో
కన్నులు చల్లగాఁ గనుఁగొనఁగోరి
నినుఁజేరి నామది నినుఁ జేర్చుకొంటి
నభిమతంబును దీర్పు మమృతరత్నంబ !

౬౧

నీవు గల్గినచోటు నిధు లున్నచోటు
నిర్మలం బగుచోటు నీవెల్గుచోటు
నిత్యనూతనవేల నీకళాలీల
నిత్యసత్యస్ఫూర్తి నీదివ్యమూర్తి
నిత్యపవిత్రంబు నీచరిత్రంబు
నిత్యకళ్యాణంబు నీపురాణంబు
సుగుణరత్నమ ! నీకు శుభమౌనుగాక !
విబుధరత్నమ ! నీకు విజయమౌఁగాక !

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# 103 భావాభిజ్ఞత.

ఉ. మవ్వపు దోరమొగ్గ లలి
మంజుల మంగళ గీతి కల్లనన్
నవ్విన నవ్వు గ్రొన్ననలు
నవ్విన నవ్వును గమ్మతెమ్మెరల్
నవ్విన నవ్వు వెన్నెలలు
నవ్విన నవ్వును వాలకింపఁగా
నెవ్వఁడు నేర్చు నాతఁ డొకఁ
డే తెలియున్ గవి భావలీలలన్.

ఉ. వెన్నెలతీవియల్ తలిరు
వేదికల న్నటియించు నవ్వడిన్
గ్రొన్నన దేనెచుక్క తళు
కుల్ తలముక్కలఁగ్రోల్చు నవ్వడిన్
గన్నియచూపు మించు దరఁ
గల్ దెసలన్ జెలరేఁచు నవ్వడిన్
సన్ననిపాట పాడఁగల
జాణలె భావరహస్యకోవిదుల్.

క. నెలబాలుని నవ్వులకును
బులకించు మెఱుంగుఁదీవపువ్వులకును, వ

న్నిలఁ దావుల నేర్పుటుపం
గల నేర్పరులైనవారె గద భావజ్ఞుల్.

ఉ. సంజలఁ దోఁచు రాగమును
జానల తేనెల మోవిరాగమున్
గెంజిగు రాకు రాగమును
గెంపుల నింపులు సూపు రాగమున్
మంజుల విశ్వగానరస
మంజరి రంజిలు రాగమాలికా
పుంజముగా గ్రహింపఁగల
ప్రోడలె భావరహస్యకోవిదుల్.

ఉ. సారవచోవిలాస ఘన
సార సుగంధముతోడఁ జిత్తకా
సార నవారవింద మృదు
సౌరభసారము, భావచంద్రికా
సారగళత్సుధామధుర
సారముఁ గూరుచు ధీరులన్ మహో
దారుల భావనందనవి
హారులుగా కితరుల్ గ్రహింతురే?

చ. దివిఁ దోలుకాడు క్రొమ్మెఱుఁగుఁ
దీవల నుయ్యెలలూఁగి యంతకుం

దవులకునేఁగి నందనవ
నంబులఁ బువ్వులనేరి కోయుచున్
గవికలకంఠితోఁ బ్రణయ
గానముసేయుచు నెల్లదిక్కులన్
దవిలి చరించు ధీవిభవ
ధన్యులె భావరహస్యకోవిదుల్.

క. పలికిన పలుకులయర్థముఁ
దలఁచిన తలఁపులను దోఁచు తాత్పర్యముతోఁ
దిలకించి సుకవి సుకృతుల్
దెలియంగలయట్టి దిట్టలే భావజ్ఞుల్.

సీ. సరసాశ్రయంబైన సురసాలమందైనఁ
గలకంఠి చిగురుటాకులనె చూచు
మధురాభిమతఫల మందారమందైన
వలిగాలి కమ్మతావులనె చూచు
సర్వోత్తమంబైన సంతానమందైన
నెలఁదేఁటి విరిదేనియలనె చూచుఁ
గామితార్థప్రద కల్పకంబందైనఁ
జిలుక తీయనిఫలంబులనె చూచుఁ
గాని సర్వపదార్థసంకలితకావ్య
పారిజాతంబుఁ గని పల్లవప్రసూన

పరిమళమరంద పరిపక్వఫలరసముల
నన్నిటి రసజ్ఞుఁ డొక్కఁడే యనుభవించు.
(26-10-22.)

---

# 104 చంద్రాభినందనము

మ. కలశాంభోనిధి మధ్యసీమ నమృతా
గారంబునన్ విద్రుమో
జ్జ్వలమంచోపరినూత్నమౌక్తికలస
త్పర్యంకమందాత్మకాం
తలె లోకంబుగ నుందువేని కవు లె
వ్వండైన నిన్బోల్తురే
తలిదంబోఁడుల ముద్దుమోములకుఁ జం
ద్రా! యామినీవల్లభా!

ఉ. పుట్టినయిల్లె స్వర్గమని
భోగమె జీవనధర్మమంచుఁ జే

పట్టిన యిర్వ దేమగురు
భార్యల గౌఁగిలి వీడకుండ నీ
వెట్టులొ కాలముంగడపు
దేని లఘుక్రియ నీకు దోషముల్
గట్టక రాజపట్టమును
గట్టుదు రే సుకవుల్ కలానిధీ!

మ. కమలానాథుని మానసంబుననొ, గం
గానాథు చెంగావి జూ
టమునందో నివసించి లోకముల కం
టన్నివు నీకంట లో
కమువారుం బడకుండ నుండుటయె నీ
కౌతూహలంబైన నీ
యమృతాంశుత్వము నెంచువార లెవర
య్యా! తారకానాయకా!

చ. కువలయపాలనంబున న
కుంఠిత తేజము గన్న రాజవై
దివిజుల కెల్లవేళఁ బరి
తృప్తి ఘటింపఁగ నిష్టదాతవై
నవనవచంద్రికావిలస
నంబున లోకముకంటి వెందవై

వరివిమలమూర్తి వౌట నినుఁ
బాడుదు రెల్లకవుల్ సుధానిధీ!

శా. నీలాకాశమునందుఁ దారకలతో
నీవాడుకోఁ బోవుచో
బాలుం బల్లవ చేతులెత్తి నిను న
స్పష్టామృతాలాప వా
చాలత్వంబునఁ బల్కరించి పిలువన్
జాగెంచ కొక్కింతసే
పాలీలారతుతోడ నాడి మజిపా
వ్మా కౌముదీ భూషణా!

సీ. వెన్నెలలోనాఁడు చిన్నిపాపలఁద్రిప్పు
బంగారుపూవుల బంతి వీవు
ఎలజవ్వనంపుఁ జిన్నెల వన్నెలాఁడుల
మువ్వంపుటాసల దివ్వె వీవు
దెసఁదప్పి తిరుగాడు తెరువరులకు రేలఁ
దోవఁజూపించు సైదోడు నీవు
మొదలింటి చెఱువుల ముసలి కన్నుల
కగ్గించు తలఁపుల యద్ద మీవు
బడుగువారల వాకిటిబంట వీవు
మాయదొంగల కన్నుల మంట వీవు

పడుచువారల కోర్కెల పంట వీవు
చలువనిగ్గుల తొలిసీమ ! చందమామ !
(15-11-22.)

---

# 105 శ్రీసూక్తము.

శ్రీమనోహరనూపురాశిర్నినాద
మాదిసుకవీంద్రహృదయవీణారవమున
మృదుమధుర సుస్వరములతో మేళవించి
యఖిలసృష్టికి శ్రీసూక్త మగునుగాక !

---

శ్రీ :—(సమీపించి) ఆర్యా ! ఇంకను మోగని ద్రాముదిరితుండవై యుంటివేమి ?

పురుషుఁడు :—(మేల్కాంచి తనలో) నన్నుమే ల్కొలిపిన యీ మనోహరనూపురారవ మెవ్వరిది? (పరికించి) కల్యాణీ ! నీ వెవ్వరు ?

శ్రీ:—కల్యాణము నపేక్షించి వచ్చినకన్యను.
పురు:—వత్సా! నీవు ధన్యురాలవు.
శ్రీ:—పురుషోత్తమా! నీయాశీర్వాదసూక్తిచే నే ననుగ్రహింపఁబడితిని.
పురు:—శోభనాంగీ!

ఆ. మఱపులోన మందమధురగానములోనఁ
తెలియఁబడనియట్టి తెలివిలోన
మనసునిలిపి మేను మఱచియుండిననన్నుఁ
గలఁచి యేల మేలుకొలిపినావు?

శ్రీ:—సుకవిచంద్రా! కల్పనాతీతములగు నీభావములవలెనే నీపలుకులును దలఁపుల కందకున్నవే! నన్ను నీవు మేలుకొలిపితివా; నిన్ను నేను మేలుకొలిపితినా?
పురు:—ఏమిది! నిన్ను నే నెఱుంగనైననెఱుంగనే!
శ్రీ:—మేరువును దృణముగను దృణమును మేరువుగను జేయుటకై మింటికిని మంటికిని సూత్రములను బన్ను నవసరమున నిన్ను నీవే మఱచిపోవుచుందువు. ఇఁక నామాటఁ జెప్పవలయునా?
పురు:—నీపలుకులు గడువింతగా నున్నవే! అట్లయిన నో నిన్నే నేను పిలిచి మేలుకొలిపితినా?

శ్రీ:—కాకున్నచో స్వయముగ నేనే వచ్చితినా ?

క. కలఁగనుచుంటివో, సరిగా
మెలఁకువరాలేదో మతి భ్రమించినదేమో
పిలువని పేరంటమునకు
బలిమిని వచ్చితినె తెలిసి పలుకఁగవలదే!

ఆ. చదువుకొన్నవారు సామంతు లగువారు
కులము గుణము గలుగు గొప్పవారు
తలలు గొట్టుకొనుచుఁ బిలిచినఁ బలుకని
చెలువ నింతయలఁతిఁ జేసె దేల ?

పురు:-ఇన్నిమాట లేల ? నీ వెవ్వరో చెప్పరాదా?

శ్రీ:—చెప్పుట కే మున్నది ? నేను కన్యను.

పురు:—కన్యకవా? అయినచో నీయవగుంఠనమేల!

శ్రీ:—అది కాంతలకు—కులకాంతలకు రక్షకమైనదిగదా !

పురు:—ఏమనుచున్నావు? కులకాంతవా! నీపలుకులు పరస్పరవిరుద్ధములుగా నున్నవే !

శ్రీ:—మీరే యిట్లనుచున్నచో నిదియును నాకొకయలంకారమే.

పురు:—అసత్యవాదినులగు నాఁడువాండ్ర కన్నియు నలంకారములే.

శ్రీ:—ఆ యలంకారము లన్నియు మీరు కల్పిం
చుకొనుచున్నవేగావా ?

ఆ. మెఱుపుఁదీవియలను విరులగుత్తులుగోయ
వెలఁదివెన్నెలలను వెన్నఁ దీయ;
కలికిచూపులఁ గఱకుటమ్ములు సేయ
నేర్చుమీకుఁ బలుకు నేర్పవలెన ?

పురు:—ఓహో! నీవు చదువులసానివలె నున్నావే!

శ్రీ:—ఈచదువులసానితనమునకు మీయయ్యవా
రితనమే కారణము.

పురు:—(ఆశ్చర్యముతో) నీవు నాశిష్యురాలవు
కూడనా ?

శ్రీ:—అవును. నీవే న న్నింతదానిని జేసితివి.

పురు:—నే నేమి చేసితిని ?

శ్రీ:—సృష్టి.

పురు:—ఓహో! నాకంటె నన్ను నీవే బాగుగ నె
ఱింగిన ట్లున్నావే! నేను సృష్టికర్తను గూడనా?

శ్రీ:—కాదా మఱి!

ఆ. కన్నుపాపలో జగంబులఁ బుట్టించి
మనసుతెరలఁ జాటుమాటు చేసి
తోఁచి తోఁపకుండ దాబూచులాడించు

కవిశిరోమణీ! నన్ను సృష్టించినవాఁడవు నీవే కావా? నాతరళకటాక్షములచేఁ గలువపూవులతోరణములఁ గట్టించినవాఁడవు నీవే కావా? నాచిఱునవ్వుదొంతరలచే వెన్నెలమేలుకట్టుల వెలయించినవాఁడవు నీవే కావా? నాపరువంపుమొగ్గదంతంపునిగ్గులచే ముత్యాలముగ్గులు పెట్టించినవాఁడవు నీవే కావా? నాయలవోకవలపుటూర్పులచేఁ గడలెల్లఁ గమ్మతావులఁ గుమ్మరించినవాఁడవు నీవే కావా? నా జిలిబిలికలికిపలుకులచే సరసంపువిరిదేనియలఁ గురియించినవాఁడవు నీవే కావా? నామొయ్యారంపువింతసోయగముచే మాయఁజేసి లోకంబును మఱపించినవాఁడవు—

పురు:—ఏమి యిక్కవితాధోరణి! నిరంకుశముగా నున్నదే!

శ్రీ:—నిరంకుశులు కవులు; నీవు కవివి—నీధోరణియే నేను—నేను కవితను, నీవిందుఁడవు—నేను శచిని, నీవు చంద్రుఁడవు—నేను చంద్రికను; నీవు దినకరుఁడవు—నేను దీప్తిని; నీవు పరబ్రహ్మస్వరూపుఁడవు—నేను భారతిని; ఈ

సృష్టిలో నీవు కావింపని దేమున్నది? నేను గాని దేమున్నది? నేను నీదానను-నీవు నావాఁడవు.

పు:—(ఆశ్చర్యముతో) కల్యాణీ! నీవేనా! ఎంత వెఱ్ఱినై పోయితిని!

గీ. తెలిసితెలియనితెలివితోఁ దెలిసికొంటిఁ
జూచిచూడనిచూపుతోఁ జూచికొంటిఁ
గాని, నీదివ్యమూర్తి, నిక్కముగ, నేఁటి
తీరున నొకప్పుడును జూడ నేరనైతి.

నీవె నాజీవనతరంగిణివి; నా ప్రేమామృతలతికవు; నాకీర్తిపతాకవు; నాదివ్యశక్తివి; నాసూక్ష్మబుద్ధివి; నాతపస్సిద్ధివి—అవును. నాకు నీవు గాని దేమున్నది?

శ్రీ:—పురుషోత్తమా! నీవు స్రష్టవు; నీసృష్టికిని నీకును భేదము లేదు—నేను సృష్టిని; నీకును నాకును భేదము లేదు. కావుననే నేనెప్పుడును నిన్నుఁ దలఁచుకొన్నాను.

గీ. పలుకకుండవచ్చి మెలఁగుచుందును జెంత
బలుకరింపకుండఁ బలుకుచుందు,
నిశ్చయముగఁ జూడ నీతోడిలోకమే
కాక, వేఱేకేమి గలదు నాకు?

పురు:—ఓదివ్యమూర్తీ ! తెలిసినది. నిత్యసత్యస్వ
రూపిణి వగునీవు నాలోనుండియే నన్నింతవానిఁ
గాఁ జేసియున్నావు.

శ్రీ:—కావుననే యోపురుషోత్తమా! నిరంతరము
నన్ను నీలో నుండనిమ్ము.

పురు:—దేవీ ! నేనెప్పుడు నీకటాక్షకింకరుఁడనే నై
యున్నాఁడను. నేను నీయవ్యాజప్రేమకు వశీ
భూతుఁడనై పోయితిని.

సీ. నీమేనిచాయల నిగ్గుదేఱినమించు
తీఁగల నుయ్యాలలూఁగినాఁడ
నీసోయగంబున నెఱిమించుచక్కని
చుక్కలతేరిపై నెక్కినాఁడ
నీప్రేమరసమున నిండినమిన్నేటి
కొలఁదమ్మిపువ్వులఁ గోసినాఁడ
నీనవ్వువెన్నెల లానిన నిద్దంపు
టద్దంపుమేడల నలరినాఁడఁ

గీ. దలఁచుకొన్నవేళఁ బులక లెత్తినవేళఁ
గన్నవేళ మఱపుఁ గన్నవేళ
నింతలేసి పనుల నేఁ జేయఁగలుగుట
నీదయార్ద్రదృష్టిఁ గాదె దేవి !

శ్రీ:—ప్రభూ! మన యిరువురి నడుమను సేవ్యసేవకభావము లేదు. తన్మయత్వమున నన్ను నీవు కలిసికొనుచున్నావు—నిన్ను నేను గలియుచున్నాను.

పురు:—ఓదివ్యప్రకృతీ! నీసాక్షాత్కారముచే నేను ధన్యుఁడ నైతిని.

శ్రీ:—ఓసనాతనపుకృతీ! నీయాశ్రయ మొసంగి నాకును సనాతనత్వమును బ్రసాదింపుము.

పురు—శుభాంగీ! భారతీ! మన యీ నిత్యసమ్మేళనము లోకము నానందతరంగితముగఁ జేయుఁగాక! ఇఁకఁ గోరఁదగిన దేమున్నది?

శ్రీ:—ఆర్యా!

ఆ. భావవీథిఁ దోఁచు పరమార్థతత్త్వంబుఁ
బలుకుఁదీవలందుఁ బల్లవించి
దిశల మేలుకొలుపు దివ్యసంగీతమై
విశ్వ మెల్ల నిండి వెలయుఁగాత!

పురు:—తథాస్తు.

(16-12-23.)

# 106 కలువకన్నె.

కిలకిలను నవ్వి నన్నాలకింపఁ జేసి
సొంపుపెంపున ననుఁ దమకింపఁ జేసి
కేలిగిలిగింత ననుఁ బులకింపఁ జేసి
చక్కఁబోయెద విదియేమి చందమామ!

గీ. మోము నెత్తితి నీముద్దుమోము జూడఁ
గనులఁ దెఱచితి నీచక్కఁదనముఁ జూడ
మనసు విచ్చితి నీచల్లఁదనమునీడ
క్షణము నిల్చినఁ దప్పేమి చందమామ!

గీ. నావలపుఁజూపు తనకంట నాటెనేమొ
చుక్క నీకంటనే నన్నుఁ జూచి నవ్వె;
చెంతచెలి మెచ్చి నన్నిట్లు చిన్నవుచ్చి
చనుటయే నీకు న్యాయమా చందమామ!

ఆ. కమ్మఁదేనెసోనఁ గలదు [illegible]టంచు
వలపుగాలి మరులు గొలు[illegible]నుచుఁ
గలువకన్నెఁ బ్రమసు గారడి[illegible] జేసి
చనుట తగునె నీకుఁ జందమామ!

ఆ. మంతనంబు లయ్యె మాటలు లేకుండ
మోహముద్ర లయ్యె ముట్టకుండఁ

గలలఁ గాంచుటయ్యె గనువెూడ్పు లేకుండ
నింద లేల నాకుఁ జందమామ!
(18—12—23.)

## 107 విహంగవిమానము.

క. లలితకుహూకలరవమా !
అల వనరమయింటివింద వగు కవివరమా !
అలరు వసంతునిరాకం
దలఁపించెడి నీకు స్వాగతము ! కోకిలమా !

ప్రస్తావము.

వసంతాభ్యుదయ మైనది. శిశిరవికలయగు ప్రకృతి చిత్రచిత్రముగ సింగారించుకొని చిగురుఁగేలెత్తి జీవలోకము నాహ్వానించుచుండెను. వనరమామాధవుల వైవాహికశుభసమయమున నఖిలజగంబును నానందప్రపూర్ణమై యుండెను. అప్పుడు విహంగవిమానమునుండి వివిధస్వరములతో విశ్వగీతములు వినవచ్చుచుండెను. ఆమధురస్వరము లప్రి

యత్నముగ శ్రవణగోచరములై యంతరంగమునఁ బ్రతిధ్వనించి యనేకసంకల్పముల నంకురింపఁజేయుచుండెను. అభిన్నస్వరముల యేకీభావమే వసంతగానము. అభిన్నప్రకృతుల సముత్సాహ సమీకరణమే వసంతకల్యాణమహోత్సవము. సమస్తబంధుమిత్రపరివారసమాకీర్ణంబగు నాకల్యాణమండపమే విహంగవిమానము.

జగముచుట్టమగు వసంతుని పెండ్లికి బంధువులుగాఁ జేరనివా రెవ్వరును లేరు అతని కందఱును జుట్టములే. కాని, వారందఱును దమలోఁ దాము పరస్పరబంధులు మాత్రము కారు. అందు సజాతీయులును, విజాతీయులును, శత్రులును, మిత్రులును, సములును, విషములును గూడ సమావేశులై యుండిరి.

పురోహితుఁ డగుపూర్ణకాముఁడు పుష్పాక్షతలను జల్లుచుఁ బవిత్రప్రణయమంత్రములను బఠనము సేయుచుండెను. వధూవరుల ప్రథమావలోకన సమయమునఁ బరస్పరహృదయములే కాక ప్రకృతి యంతయును బులకించి పోయెను. ఆయానందములో నాటలు, పాటలు, వింతలు, వినోదములు,

ముద్దులు, ముచ్చటలు జరిగిపోవుచుండెను.

కొందఱు రసజ్ఞులు పెండ్లిపాటల నాలకించుచుండిరి. కొందఱు విచక్షణులు పెండ్లివేడుకలఁ దిలకించుచుండిరి. కొందఱు సమర్థులు పెండ్లిపనులలోఁ బాల్గొనుచుండిరి. కొందఱు ముగ్ధులు ప్రకృతిచిత్రములకు ఱిచ్చపడుచుండిరి. కొందఱు విదగ్ధు లీశ్వరవిలాసములకు మెచ్చుకొనుచుండిరి. కొందఱు వాచాలురు తర్కవితర్కములలోఁ దత్త్వమును మఱచిపోవుచుండిరి. కొందఱు క్రియాశూన్యులు లోకాభిరామాయణమున నిమగ్నులగుచుండిరి. ఇట్టి యనేకభిన్నప్రకృతుల భిన్నభావము లన్నియు నీపెండ్లివేడుకలలో నలక్షితములై యుండెను.

భావప్రపంచమున విహరించు పరమహంసల నవలోకించుచున్న యొకకవికులభూషణుఁ డప్పుడు పర్ణకుటీరాంగణమునఁ గూర్చుండి ప్రణయగానమునకు శ్రుతులను సవరించుకొనుచుండఁగా నెలమావిచిగురుజొంపమునం దూగుచుఁ దూగుచు వసంతకోకిల పంచమస్వరంబున "కుహూ! కుహూ! కుహూ!" అని పాడఁ దొడంగెను. ఆపల్లవిలో బ్రమదావన మంతయుఁ బల్లవితమయ్యెను. ప్రసవ

మంజరు లన్నియును బరిమళించెను. ప్రకృతియం
తయును బరవశమైపోయెను. భావగానలోలుఁడగు
కవి యప్పుడు:—

"పరిసవరస మానునెలఁ దేఁటి పాటకంటె
ఫలరసముఁ గ్రోలురాచిల్క పల్కుకంటెఁ
గనరుజివురాకుఁ గసిగాటుగా గ్రసించు
మత్తకోకిల్లరవ మింత మధుర మేమొ?"

అని భావింపఁ దొడంగెను.

ప్రదేశము — మధువనము.

ప్రవేశము—రసాలశాఖపైఁ జిలుక, గోరవంక.

చిలు—(మెడ త్రిక్కించి) ఆహా! ఏమి యీ
యమృతగానము!

గోర—ఔను. అది యీఫలరసముకంటెను
మధురముగా నున్నదే! కాకులలోఁ బెరిగినదానికిఁ
గలకంఠ మెట్లువచ్చినదో?

చిలు—ఎక్కడఁ బెరిగిననేమి, ఎవ్వరు పెంచిన
నేమి? అది దాని జన్మస్వత్వమే కాదఁటే!

గోర—అక్కా! నీకుమాత్రము కలాలాపత్వ
ము జన్మస్వత్వము కాదా?

చిలు—ఇదియెట్లు? పలుకులు నేర్చినంతమాత్ర

మునఁ బాటలు పాడఁగలమా? మన మిరువురము
ను గలాలాపలమే కాని కలకంఠుల మెట్లగుదుము?

గౌర—మనముకూడ దానివంటి పక్షులమే క
దా! ఆపాట మన మేల నేర్చుకొనఁగూడదు?

చిలు—అది సహజముగఁ బుట్టవలయునే గాని
నేర్చుకొనిన వచ్చునది కాదమ్మా!

గౌర—మనము మాత్రము రసజ్ఞలముగామా?
కోకిల నాశ్రయించినచో మన కీరహాస్యము బోధ
పడునేమో?

చిలు—కోకిల కెవ్వరివలన బోధపడినది? మన
కు సహజముగా రసానుభవమే కాని, రాగరిమ
యెక్కడిది?

గౌర—ఫలరసము మాని మనముకూడఁ బల్ల
వసేవనముం గావించిన నేమగునో?

చిలు—సోదరీ! పువ్వులలో మసలినంతమాత్ర
మునఁ దేనెటీఁగ తేఁటి కాఁగలిగినదా? ఊరక యూ
నపడి చిగురుమేయుట కారంభించినచో నాగరుబిగు
వుచే మన కున్న పలుకుబడికూడఁ జెడిపోవును.
కష్టపడి ప్రయత్నించినంతమాత్రమున మనము కల
కంఠులము కాఁగలమా?

(కోకిల మరల మృదుస్వరముతో కుహూ! కుహూ! కుహూ!)

(గోరవంక తత్తఱముతో ఱెక్కల నప్పళించుచు మెడఁ గుంచి పైకిఁ జూచుచు నటునిటుఁ దిరుగుచుండును.)

చిలు—(కిలకిలనవ్వుచు) సోదరీ! ఈయావేగ మంతయు నేమే!

గోర—అక్కా! వినఁబడలేదా? ఆకోకిల మన లను బిలుచుచున్నది!

చిలు—చెలీ! ఎంత వెఱ్ఱిదానవే! అది మనవంకఁ జూడనైనఁ జూచినదా? పలుకరించినట్లు పరాకుఁ దెలిపినట్లు - ప్రత్యుత్తర మిచ్చినట్లు - ప్రబోధించినట్లు - బహుభావములు దానిపాటలోనే యున్నవి.

గోర—అక్కా! నీమాటలు నిజమే నే! చూడుము! తమ్ముఁ బలుకరించినట్లుగా దెసలు మాఱుమ్రోలుచున్నవి. తమకుఁ బరాకుఁ దెలిపినట్లుగాఁ దరుణావల్లికలు పల్లవాంచలముల సవరించుకొనుచున్నవి తమకుఁ బ్రత్యుత్తర మిచ్చినట్లుగాఁ బక్షిసంతతు లన్నియును బ్రతివాదముఁ జేయుచున్నవి. తన్నుఁ బ్రబోధించినట్లుగాఁ బ్రకృతి యంతయును దన్మయ మగుచున్నది. ఆహా! ఒక్కపాటలోనే యిన్నిభా

వములా ?

చిలు—అదియే బహుజన్మతపఃపరిపక్వమగుప్రతిభ ! అట్టి యమృతవృష్టిచేతనే జీవచైతన్యమంతయు నానందవిలసితమగుచుండును. అట్టి యమృతప్రభచేతనే జీవలోకమంతయు నాలోకరమణీయమగుచుండును.

గౌర—ఆకోకిల నిట్లు పాడుమన్నవారెవ్వరే!

చిలు—అది యొక్కరికొఱకుఁ బాడుటలేదు. ఉత్సాహము పొంగి పొరలినప్పు డది యూరక పాడుకొనుచుండును. దాని కెట్టికోరికయును లేదు.

గౌర—లేకేమి? మన మందఱము నిట్లుమెచ్చుకొనుచుంటిమిగదా! వన మంతయు నిట్లానందకందళిత మగుచున్నదిగదా! దెసలన్నియు నిట్లు ప్రతిధ్వనించుచున్నవిగదా! జగమంతయు నిట్లభిముఖమగుచున్నదిగదా! లోకమును మోహింపఁ జేయుటకుఁ గాకున్నచోఁ గోకిల కీపాట యేల ?

చిలు—సోదరీ! నీవు పొరఁబడుచున్నావు. కొమ్మ లెవ్వరిమెప్పుకొఱకుఁ బల్లవించుచున్నవి? తెమ్మెర లెవ్వరిమెప్పుకొఱకు వీతెంచుచున్నవి? పువ్వులెవ్వరి మెప్పుకొఱకుఁ బరిమళించుచున్నవి? ఫలము

లెవ్వరిమెప్పుకొఱకు ఫలించుచున్నవి ? ఆనందో చ్ఛ్వాసముచే నగుచుండు దీనింగూర్చి యనుభవజ్ఞు లభినుతించుచుందురు. రసజ్ఞులు రంజిల్లుచుందురు. కోకిలపాటకూడ నట్టిదే.

గౌర—అక్కా! నీవు కవిత్వమును గూర్చి ప్రశంసించినట్లు ప్రశంసించుచున్నావే!

చిలు—కాదా మఱి! హృదయమును రసమయముగఁ జేయువెలుకుపొందికయే కవిత్వము.

(కోకిల—కుహూ ! కుహూ ! కుహూ!)

చిలుక—గౌర—(ఆనందపారవశ్యమునందును.)

కవిపరమానందముతో.

సీ. ఆనందమయ వసంతారామమోహన
దివ్యతేజంబుపై దృష్టి నిలిపి
ఆనందరాగరసామోదపల్లవ
మృదులపీఠంబుపై మేను నిలిపి
ఆనందరసతరంగాయితనవసుధా
మధురభావంబులో మనసు నిలిపి
ఆనందగుప్తమంత్రాధారపావన
ప్రణవనాదంబులోఁ బాట నిలిపి
అఖిల మానందపారవశ్యమున మునుఁగ

వాస్తవానందతన్మయత్వంబుఁ గాంచి
చల్లఁగా రాగవల్లరుల్ పల్లవింపఁ
గోయిలా! హాయిగాఁ బాడుకోఁగదమ్మ!

కోకిల—కుహూ! కుహూ! కుహూ!—

గౌర—(ప్రకృతిస్థయై స్మృతినభినయించి) అక్కా! ఈమధురగానమునకు లోకమంతయు నిట్లు మైమఱచిపోవుచుండఁగాఁ దనబిడ్డగా నెంచి పెంచికొన్న కాకి యీకోకిల నెట్లు తన్నివైవఁగలిగినదో?

చిలు—దాని కారసజ్ఞత యెక్కడిది! పురుగులను బొడిచికొనితినుపులుగునకుఁ బువ్వులపరిమళ మెట్లు తెలియును?

("తురుతురుతురుతురుతుర్" అను ధ్వనియగుచున్నది.)

గౌర—(ఉలికిపడి) ఇదియేమి! ఈయనంత సుఖస్వరమునఁ గిందినుండి యేదో యపస్వరము వినఁబడుచున్నది!

చిలు—అది యేదో కఠినవక్త్రమునుండి వెలువడిన కఠోరస్వరమువలె నున్నది.

("ఠక్ ఠక్ ఠక్" అను ధ్వనియగుచున్నది.)

గౌర—(భయములో) అక్కా! ఎవ్వరో చెట్టుఁ

గొట్టుచున్నట్లున్నది !

చిలు—(ఆలోచించి) తెలిసినది. భయములేదు. ఈవికృత చేష్టలు వడ్లంగిపిట్ట వని తోఁచుచున్నది.

గోర—(క్రిందవంకఁ జూచి) ఔనే! తనయినుప ముక్కుతో నది యీతరుస్కంధమును టక్కుటక్కు మని పొడుచుచున్నది. చూడుము!

చిలు—(పరికించి) ఫలవృక్షములను బగులఁగొట్టుటయే దానిపని.

గోర—ఈశుభసమయమున నిది యెంత రస భంగము చేయుచున్నది !

చిలు—అచ్చటికిఁ బోయి దాని నెట్లయిన మర లింతము రమ్ము.

(చిలుకయు, గోరవంకయు నెగిరి క్రిందికొమ్మపై వ్రాలుచున్నవి.)

వడ్లంగిపిట్ట—(చప్పుడు విని తల పైకెత్తి) ఓహో! చిలుకా గోరింకలవలె నున్నారు.

గోర—వలె నుండుట యేమి? మేము చిలుకా గోరింకలమే!

వడ్ల-మీయంతటి రసజ్ఞత నాకు లేదనియా నీవు నేనన్నమాటకుఁ బ్రత్యాఖ్యానముఁ జేయుచున్నావు? పై

చిలు——నీకు రసజ్ఞత లేదనియా? నీచేష్టలు——

వడ్లం——(అర్ధోక్తియందే) నాచేష్టలు మీ రే మని గ్రహించితివి?

గౌర——రసభంగములుగా నున్నవని——

వడ్లం——ఓహో! తెలిసినదానివలె రసము రస మనుచున్నావు! రసస్థానమేదియో నీవెఱుఁగుదువా?

గౌర——ఎఱుఁగ కేమి? పాటల్లో రసమున్నది. పలుకులో రసమున్నది.

వడ్లం——అలాగా? వానికి మూలము?

గౌర——చిగురులో రస మున్నది. పువ్వులో రస మున్నది. పండులో రస మున్నది.

వడ్లం——అంతేనా? మఱి యెచ్చటను లేదా? సరే. వానికి మూలము?

గౌర——రసజ్ఞునిహృదయములో రసమున్నది.

వడ్లం——ఆఁగు మాఁగుము! గోరింకా! నీవొక్కసారిగాఁ గప్పగంతులు వైచుచున్నావు వానికి మూలకారణ మగు కేంద్రస్థానము ఇప్పుడు నేను నిలిచి యున్నచోటే! ఇందేమైన రస మున్నదేమో యని యే నేను పరీక్షించు చుంటిని.

గౌర——ఏమైన నగపడినదా?

వజ్రం—ఇంతవఱకు నాకేమియు నగపడలేదు.

గౌర—(నవ్వుచు) ఇది మూలచ్ఛేదప్రయత్న ముగాని, రసగ్రహణప్రయత్నము గాదు.

వజ్రం—చెట్టునలేనిరసము చిగురున కెక్కడనుం డి వచ్చును? వెఱ్ఱిదానా! తత్త్వజ్ఞానములేని పాండి త్యముతోఁ దప్పులు దిద్దవచ్చితివా?

గౌర—అల్లాగా? అట్లయినచో నీతలకు మించిన శక్తి ముక్కున కెట్లు వచ్చినది?

చిలు—(సాధుభావముతో వజ్రంగిపిట్టం గాంచి) అన్నా! ఈశుష్కతర్కములవలన నేమిప్రయోజన మున్నది? కోయిల హాయిగాఁ బాడుచున్నది. ఒక్కిం తసేపు నిశ్శబ్దముగా నుండి యానందింపరాదా?

వజ్రం—ఆహా! ఏమి యీచిలుకపలుకులు! మూనుగోయిలమాట చిగురుగోయిల పాటపాటిది కాకపోయె నేమి?

చిలు—వాదము వల దంటినిగాదా?

వజ్రం—వాద మక్కఱలేదు గాని వస్తుతత్త్వ మును గ్రహింపవలదా?

గౌర—(విసుగుతో) నీవిందు గ్రహించిన దేమి? రంధ్రాన్వేషణమే కాని నీకు రసగ్రహణశక్తి యేదీ?

ఎంత పట్టిపాగ్రకులాడినను, ఎంతపోట్టుపోట్టుచేసినను నీబగ్రిదు కింతే.

చిలు—అన్నా! రసజ్ఞులపని యిదిగాదు. అమృతతరంగమాలికాఖేలనమున కానందింపక యడుగున నేమున్నదో తెగ్రివ్వఁగోరుట యవివేకము కాదా?

గోర—ఔను, అమృతఫలముల నారగింపవలయును గాని, గిల్లి గింజలను లెక్కించుటవలన నేమి ప్రయోజనము?

వడ్లం—(కోపముతో) అమృతము, రసము, హాయి, యని మీరేమేమో కొసవెట్టిమాటలు చెప్పుచున్నారు. గుగ్రిడ్డినమ్మకమేగాని గుణాగుణపరిశీలన మక్కఱలేదా?

చిలు—దేనిగుణాగుణములను దానినిబట్టియే గ్రహింపవలయును పనసతొనలరుచి పైపెచ్చుల ను నమలిన నెట్లు తెలియును?

వడ్లం—సరే. పగ్రికృతమును విమర్శింతము. కోయిలపాట హాయిగా నున్నదంటిరిగదా! ఎట్టిదాహాయి?

చిలు—సకలజీవహృదయములను రసమయములుగాఁజేయుమధురభావము లందు మూర్తీభవించి

యున్నవి.

వడ్లం—సరిసరి ! ఈమాటలవలన నాకేమి బోధపడినట్లు ? పెండ్లిపాటయా? వసంతపుఁబాటయా?

చిలు—నీకెట్లు తోఁచుచున్నది ?

వడ్లం—ఏమియుఁ దోఁచుట లేదు. ఒక్కటే పాలిపాటవలె నున్నది.

గౌర—మధురకోకిలగానము మాలినుగోయిలకెట్లు రుచించును?

వడ్లం—(కోపముతో) మర్యాద నతిక్రమించి మాటాడుచున్నావు !

గౌర—ఉన్నమాట యన్న నులుకేల ?

వడ్లం—(కోపముతో) అలాగా? ఇం దెక్కువ తక్కువలు నీవేమి గ్రహించితివి?

గౌర—గ్రహింపకేమి? చిదుకఁబొడిచి చెట్టుఁ దొలుచుదానవు నీవు—పాట పాడి చిగుళ్లను బెట్టించునది—

వడ్లం—(అసహ్యభావముతో) నోరు మూయుము! గట్టిగ మాటాడుచున్నావు.

గౌర—నీ యినుపముక్కుకంటె, నీటెక్కుటెక్కులకంటె నామాటలు కఠినముగా నున్నవా ?

(వడ్లంగిపిట్ట కోపమును బట్టఁజాలక గొరవంకను బొడువఁజూచుచుండఁగా గాలిపాటున రసాలఫలము జాఱిపడి నచప్పు డగును.)

“తురుతురుతురుతురు తుఱ్ఱో.”

అని వడ్లంగిపిట్ట యెగిరిపోవును.

చిలు-గొర—(యథాస్థానమున కెగిరిపోవును.)

కోకిల—కుహూ! కుహూ! కుహూ!

కవి

“చివ్వురు దినుము! పాడుము! మఱి
చివురులు వెట్టింపు మలరఁ జేయుము వనమున్!
నవనవగీతాచాతురి
మివుల మరల మరలఁ బాడుమీ! కోకిలమా!”

(27-3-1924.)



# 108 మహారాజాభినందనము.

శ్రీయు, విద్యయు, సంపత్తి, సిద్ధకీర్తి
యున్నతోన్నతపదవి, నీ కొసఁగినట్టి
యీశ్వరుండు చిరాయువు నిచ్చుఁగాక
రావువేంకటశ్రీసూర్య రాయభూప!

ఆ. చెవుల నమృతరసము చిలుకరించినయట్లు
భాగ్యరాశి కంటఁ బడినయట్లు
నలరఁ జేసె నీమహారాజబిరుదాభి
రామవార్త పత్రికాముఖమున.

సీ. పల్లవించినవేళఁ బాడవే పఱతెంచి
కుతుకంబు చిగురింపఁ గోకిలములు
పూవు పూచినవేళఁ బాగడవే విచ్చేసి
భావముల్ వికసింప బంభరములు
పండు పండినవేళఁ బలుకవే యరుదెంచి
కోరికల్ ఫలియింపఁ గీరతతులు
గొప్పఁగాంచినవేళఁ గొలువవే యేతెంచి
కలకల నుప్పొంగి కవికులములు

గీ. సకలజీవులు సమయాను సారమతిని
ఘనతరులఁ జేరి యలరుట గలదు గాన

శ్రీమహారాజబిరుదాభిరాము నిన్ను
నభినుతించు మాకవిత సూర్యావనీంద్ర!

గీ. పారిజాతంబున కొసంగు ఫలములట్లు
కామగవి కిచ్చుకొను పాలకడవలట్లు
మామహారాజునకు నీకు మహితమతికిఁ
జిన్నిపద్యంబులను గాన్కఁ జేసినాము.

గీ. రాజవైనప్పుడే జగద్రంగమందుఁ
గళల నలరించితివి నీవు కౌతుకమున
నమృత మొలికింపవే యింక నఖిలదిశల
సూర్యరాయ మహారాయ సుజనగేయ!

ఆ. రావువంశ సూర్యరాయ మహారాజ
చంద్రునకును సుగుణసాంద్రునకును
సరసు లంపుకొన్న శతపత్త్రములను మా
కవ్వగింప్ప ప్రియము గాకయున్నె.

(7-6-1922.)



అభినందననవమాలిక.

శ్రీనిధులన్, వచోనిధుల
సేవ్యుల, సేవకులన్, బ్రదాతలన్
దీనుల నొక్కరీతిఁ గరు
ణించువిభుండు చిరాయురర్థభో
గానుభవాఢ్యుఁ జేయుత ని
రంతరము న్నిను సార్వభౌమస
న్మానిత రావువేంకటకు
మారమహీపతిసూర్యరాణ్మణీ!

సీ. రావుగంగాధర రామరాయావనీ
పాలసంపూర్ణ తపఃఫలంబు
పరమపతివ్రతాభరణ మంగాంబికా
సదమలానంత పూజాఫలంబు
రఘుపతి వేంకటరత్న సుధీవర
సద్గురుకృతపరిశ్రమఫలంబు
హితనిరంతర సమాశ్రిత సాధుసజ్జన
ప్రకరనిస్తుల మనోగతఫలంబు

గీ. మధురగుణపాళితోఁ గూడ మధురమహిమ
మధురబిరుదాళితోఁ గూడ మధురకీర్తిఁ

బడసి వెలయుట మాపుణ్య ఫలముగాదె
సూర్యరాయ! మహారాయ సుజనగేయ!

సీ. రాజచంద్రున కబ్బురంబు చేకూర్చునే
రమణీయ చంద్రహారముల కాన్క
సుగుణరత్నాకరు సొగయింపఁజాలునే
కమనీయ రత్నహారముల కాన్క
కుంభినీధవునకుఁ గోత్రగాఁ దోఁచునే
క్రమమౌక్తిక హారకముల కాన్క
దీనచింతామణిఁ దేలింపఁజాలునే
రమ్యప్రవాళహారముల కాన్క

గీ. యనుచు భావించి సరసభావార్థగంధ
బంధురంబగు నక్షర ప్రసవమాల
గుణనిధికి నీకుఁ బేరుగాఁ గూర్చినాము
సూర్యరాయ! మహారాయ సుజనగేయ!

సీ. తిన్నని సన్నని తెల్లని మొనలేని
మొగ్గలలోనుండి నిగ్గుఁ దీసి
చక్కని చిక్కని సరిలేని కమ్మని
పూవులలోనుండి ప్రోవుఁ జేసి
విఱుగని తఱుఁగని వెలలేని తీయని
తేనియలోనుండి తేటఁ దీసి

నలఁగని తలఁగని నలిలేని తొలిలేని
చివురాకుదొన్నెల సేకరించి
గీ. సరసకవితావిలాస రసాయనంబుఁ
బ్రేమరసమునఁ గూర్చి యర్పించినార
మెలమిఁ బాసీయముగ గ్రహియింపుమయ్య
రమ్యగుణసాంద్ర! శ్రీమహారాజచంద్ర!
సీ. విద్యకు గర్వంబు వెనకయ్య గాకుంట
వినయసంపత్తి ని న్ననుగమించె
వినయంబు కైతవంబును దోడుగొనకుంట
గౌరవపదము నిన్ గాంచఁగలిగె
గౌరవంబునకు వికారంబు లేకుంట
నైశ్వర్యలక్ష్మి నిన్నాశ్రయించె
నైశ్వర్యమునకు మదావాప్తి లేకుంటఁ
బరమధర్మంబు నీ సరస నిలిచె
గీ. నర్థము పదాశ్రయంబున నలరినట్లు
ధనము ధర్మాశ్రయంబున దనరినట్లు
లఖిలసద్గుణరాశి ని న్నాశ్రయించె
రావుకులదీప! శ్రీసూర్యరాయభూప!
సీ. సేవింప నెన్నియో క్షేత్రంబు లుండనీ
యాపాదగయయుండె యూన మాకు

భావింప నెందఱో దేవత లుండనీ
కుక్కుటేశ్వరునందె కోర్కి మాకు
నిలువంగ నెన్నియో కలయూళ్లు లుండనీ
పీఠికాపురమందె ప్రీతి మాకుఁ
గొలువంగ నెందఱో యిలరాయ లుండనీ
మాసూర్యవిభునందె మనసు మాకు
గీ. విన్నదే కన్నదే మునుపున్నయదియె
యెన్నఁదగినది నీదయ యున్నఁ జాలు
నున్నమాటాడినా మేమి యన్నఁ గాని
రావువంశాబ్ధిచంద్ర! సూర్యక్షితీంద్ర!
సీ. అలరుఁదేనియలకై పిలిచిరే యెవ్వరైనఁ
దేఁటి కయ్యది యలవాటు గాక
తీవరపెట్టిరే తేనెకై యెవరైనఁ
బూపున కది పుట్టు బుద్ధిగాక
చివురులఁ దినుమంచుఁ జెప్పిరే యెవ్వరైనఁ
గోకిల కది నైజగుణము గాక
యలరు వెట్టుమటంచు నడిగిరే యెవ్వరైన
మామిడి కదియె నీమంబు గాక
గీ. యాశ్రితాశ్రితభావ మిట్లచ్చుపడఁగఁ
బ్రభులఁజేసుట కవుల స్వభావగుణము

శ్రీమహారాజ వైభవ శ్రీబిడౌజ
రావుకులదీప ! శ్రీసూర్యరాయభూప !

సీ. తెలిదమ్మిగద్దెపైఁ గొలువుండు జవరాలు
మొలకనవ్వులఁగుల్కు ముద్దరాలు
చెలువంపుఁ జూపుల సిరులిచ్చుప్రోయాలు
పేరుగాంచిన పెద్ద పేరఁటాలు
[illegible]లు[illegible]వ్వలవాని వలపుల యిల్లాలు
కంతునిఁగన్న బాలెంతరాలు
ఈరేడుజగముల నేలు నైదువరాలు
కీరుతుల్ గాంచిన గేస్తురాలు

గీ. కలుము లీఁ జాలుమిసిమి పాల్కడలిచూలు
గిలుకుమట్టెల రవరవల్ గులకరింప
నెలమి నీతోడు నీడయై మెలఁగుఁగాత
రమ్యగుణసాంద్ర! శ్రీమహారాజచంద్ర!

సీ. కుంతిమాధవుఁడు నీ కులదైవతంబయి
సకలాభిమతము లొసంగుచుండ
సత్యశౌచములు నీసరి తోడునీడలై
శుభమార్గమును నీకుఁ జూపుచుండ
ధర్మార్థకామముల్ తమతావు దప్పక
నీ కన్నుసన్నల నిలుచుచుండ

పౌత్రింబు శాంతంబు సరిగ నీవిపులరా
జ్యావనంబునకుఁ దోడగుచునుండ
గీ. సుగుణములతోడ వరసతీ సుతులతోడ
సుతలతోడను వైభవోన్నతులతోడ
లీలఁ జిరకాల మవనిఁ బాలింపుమయ్య
రావుకులదీప! శ్రీసూర్యరాయభూప!
పిఠాపురము 31-7-22.

---

స్వాగతము.

---

సీ. శ్రీపాదకమలముల్ సేవింపఁగా నిచ్చి
వరదానకరముల గుఱుతు లిచ్చి
కల్యాణమయమూర్తి గన్నుల హత్తించి
తెలివిలోఁ దేజంబు వెలువరించి
చలువచూపుల మేనఁ బులకలు మొలిపించి
భావంబు జల్లనఁ బలుకరించి
యానందరసమున మానసంబుఁ గరంచి
విశ్వరూపంబును వెల్లడించి

గీ. ప్రణయమంత్రంబు బోధించు పరమగురుఁడు
భక్తసులభుండు నినుఁ గుటుంబమ్ముతోడ
నాయురారోగ్యవిభవాఢ్యుఁ జేయుఁగాత
రావువంశాబ్ధిచంద్ర! సూర్యక్షితీంద్ర!

సీ. అనురాగరంజితం బగునాత్మభావంబు
విరిసినరేకుల వెలువరించి
భా[illegible]పమా బంధురామోదంబుఁ
జెలువంపుఁ బుప్పొడి నలవరించి
యామోదపరిపూర్ణమైన ప్రేమరసంబు
మిసిమిగ్రొందేనియ మేళవించి
ప్రేమరసానంద సామనిర్మలగీతి
భ్రమరస్వరంబునఁ బల్లవించి

గీ. నాథునకు నీకు నీకోకనదపురంబు
స్వాగతం బనుచున్నది సరసలీల
శ్రీమహారాజ! వైభవ శ్రీబిడౌజ!
రమ్యగుణసాంద్ర! శ్రీసూర్యరాయచంద్ర!

సీ. గగనధామంబులో ఘనమండలములలో
మెఱపుఁ గ్రొందీవలు విరిసి మెఱయ
నందనవనములో మందారతరులలో
జల్లు పువ్వులవాన వెల్లివిరియ

శాంతవనంబులో జాతికుంజములలో
నెమ్మి నెమిళ్లు నృత్యమ్ము సేయ
నవనీతలంబులో నమృతవాహినులలో
సరసతరంగశీకరము లెగయ,
గీ. మధురమోహనగతుల సమస్వరముల
నీమహారాజబిరుదాభిరామవార్త
చాటుచున్నది దుందుభి సకలదిశల
రావువంశాబ్ధిచంద్ర! సూర్యక్షితీంద్ర!
సీ. తెలివిఁ గూర్తునటంచుఁ దెలుపునే దినమణి
విమలప్రభాస్ఫూర్తి వెలుఁగుఁగాని
చలువ లిచ్చెదనంచుఁ జాటునే జాబిల్లి
యమృతకళాలీల నలరుఁగాని
జీవనాథుఁడ నంచుఁ జెప్పునే ఘనుఁడెందు
సురుచిరామృతవృష్టిఁ గురియుఁగాని
ప్రాణమూర్తి నటంచుఁ బలుకునే పవనుండు
విశ్వానురూపిమై వెలయుఁగాని
గీ. సుగుణులు స్వధర్మనిరతులై నెగడుచుండ
ఘనపదంబులు వారికే కలుగుచుండు
శ్రీమహారాజ! వైభవ శ్రీబిడౌజ!
రావుకులదీప! శ్రీసూర్యరాయభూప!

సీ. వలపుమున్నీట మున్కలు వెట్టుటే కాని
కవితామృతరసంబుఁ గాంచు టరిది
యరవిరిసెజ్జపై నడఁగి యుండుటె కాని
భావగంధంబును బట్టు టరిది
భవబంధములఁ జిక్కువడి యుండుటే కాని
సుప్రబంధంబులఁ జూచు టరిది
ఔదార్యమదముచే నలరుటే కాని
యర్థగౌరవ మింత యరయు టరిది
గీ. ప్రభువు లున్నార లెందఱో భాగ్యనిధులు
బిరుదులకు భూషణములైన వరగుణముల
వెలయు నీవంటివారలే యరిది గాని
సూర్యరాయమహారాయ! సుజనగేయ!
సీ. నిండారవిరిసిన పండువెన్నెల తేట
కున్నని విసుఁగువాఁ డుండుఁగాక
జిలజిల నమృతంబుఁ జిలుకుకోకిలపాట
కులికి వాపోవువాఁ డుండుఁగాక
గమగమ వలపించు కమ్మక్రొవ్విరితావి
సుహ్వాని యూఁదువాఁ డుండుఁగాక
మానసంబుఁ గరంచు మధురగీతంబున
కోష్ఠంబు విఱుచువాఁ డుండుఁగాక

గీ. చాటి చెప్పాచు నుంటి మీాశ్వరునియాన !
నీమహారాజబిరుదాభి రామవార్త
వడసి యానంద మందనివారు లేరు
రావుకులదీప! శ్రీసూర్యరాయభూప !

సీ. ప్రణయంబు గులుక నీపత్రిజలు నీకర్పించు
పువ్వుదండలలోన నవ్వినట్లు
గరువంబు చిలుక నీగాయకుల్ నినుఁ బాడు
సరససత్కృతులలో మెఱసినట్లు
కలకండ లొలుక నీకవులు నిన్ గొనియాడు
లలితగీతములలోఁ బలికినట్లు
కుతుకంబు దొలఁక నీహితులు నీకొసఁగుకు
భాశీస్సులకుఁ దథాస్తనినయట్లు

గీ. సర్వమయుఁడైన దేవతా చక్రవర్తి
చక్రవర్తిప్రదత్తప్రశస్తబిరుద
కలితు నిను మెచ్చుచున్నట్లు గానవచ్చు
రావుకులదీప శ్రీసూర్యరాయభూప!

ఆ. సూర్యవిభుఁడ వీవు సూర్యనారాయణుం
డితఁడు నీకుఁ జేయు నిట్టిపూజ
యాత్మపూజవోలె నానందమయమయ్యె
సూరిగేయ! రావు సూర్యరాయ!

గీ. కవులొసంగు నైశ్వర్య మక్షరము, తత్కృ
తాయువక్షర మారోగ్య మక్షరంబు
గాన నక్షరమైన యిక్కానుకనంది
యాయురారోగ్యవిభవంబు లందుమయ్య.

కాకినాడ, 5-8-22.



## ప్రణయోపహారము.

శ్రీలావణ్యము మెచ్చు కన్నుఁగవతో
శ్రీలీను కెంగేలితో
శ్రీలీలాలలితానురాగరస సం
సిక్తాంతరంగంబుతో
శ్రీలం గూర్చి జగంబు లేలువిభుఁడౌ
శ్రీమాధవస్వామి వి
ద్యాలంకారునిఁ బ్రోచుఁగాత నిను సూ
ర్యారాయభూపాలకా!

సీ. కన్నులలో నదే కరుణామృతరసంబు
నవ్వులలో నదే పువ్వుఁదేనె
చూపులలో నదే సుప్రసన్నత్వంబు
పలుకులలో నదే భావపటిమ

మానసంబున నదే దీనదయాళుత్వ
మాననంబున నదే యమలతేజ
మాకారమున నదే యానందమయలీల
వేషంబునం దదే వినయగరిమ

ఆ. పట్టభద్రుఁ, బిరుద పట్టభద్రుని నిన్ను
నాఁడు నేఁడు వేడ్కఁ జూడఁగంటి
మపుడు కొమరుఁబ్రాయ మిపుడు కౌమారంబు
స్థూలభేద మింతె సూర్యరాయ!

సీ. శరదిందుబింబంబుఁ జంద్రికయును బోలి
జాతివజ్రంబుఁ దేజంబుఁ బోలి
సరసప్రసూనంబు సౌరభంబును బోలి
మహితతపంబును మహిమఁ బోలి
సాధుచరిత్రంబు సత్కీర్తియును బోలి
రమ్యశబ్దంబు నర్థంబుఁ బోలి
మకరందరసమును మాధుర్యమును బోలి
కమ్రగీతంబు రాగంబుఁ బోలి

గీ. నీవు శ్రీచిన్నమాంబికాదేవిఁ గూడి
అతిముదముతోడ సుగుణసంతతులతోడ
లీలఁ జిరకాల మవని బాలింపుమయ్య!
కావ్యవంశాబ్ధిచంద్ర! సూర్యక్షితీంద్ర!

ఆ. రామచంద్రునకును బ్రేమ భరద్వాజ
సాధుమౌళి విం దొసంగినట్లు
గారవమున విందుఁ గావించె మాశివ
కామరాను నీకు రాజచంద్ర!

క. పాడును ముదమునఁ గోకిల
పాడినదే పాట, సుకవి భావము పొంగన్
పాడును బరిపరివిధముల
వేడుకపడి సూర్యభూప! వినయకపాలా!

కాకినాడ, 7-8-22.



## అభినందనము.

శ్రీమూర్తి భావించి సేవించినకొలందిఁ
కళ్యాణమూర్తియై కాంచువాఁడు
పరిణయమూర్తి నెఱింగి పలుకరించుకొలందిఁ
గారుణ్యమూర్తియై చేరువాఁడు
విమలమూర్తిఁ దలంచి వినుతించినకొలంది
నానందమూర్తియై యలరువాఁడు
తత్త్వమూర్తి గుఱించి ధ్యానించినకొలంది
విజ్ఞానమూర్తియై వెలుఁగువాఁడు
గీ. ఎల్లజగముల విసుఁగులే కేలువాఁడు
సాధుజనవర్తి దేవతాచక్రవర్తి
చిరకృపాస్ఫూర్తి మిమ్ము రక్షించుఁగాక
సూరిజనగేయ! శ్రీరావు సూర్యరాయ!

సీ. పిలిపించుచున్నావు నిగమధర్మంబుల
నిత్యనూతనములై నెగడునట్లు
పిలిపించుచున్నావు పెద్దపెద్దలఁ గళా
ధనులఁ బండితుల నాస్థానమునకుఁ
గొలిపించుచున్నావు కోడలి నత్తచేఁ
గవుల నిస్తంద్రవైభవులఁ జేసి

మొలిపించుచున్నా వ్రతులలేనియీావిచే
నర్థులమెయిఁ బులకాంకురముల

గీ. ఘనపదంబులు బిరుదముల్ గౌరవములు
కీర్త్తులే నీకు నివియెల్లఁ గులపరంప
రాగతంబులు సహజంబు లగునుగాక !
రావువంశాబ్ధిచంద్ర ! సూర్యక్షితీంద్ర !

సీ. కవిరాజచంద్రుల గద్యపద్యములలో
నటనటీరుచిరగానములలోన
శిష్టజనాగమాశీర్వాదములలోన
వైణికమధురారవములలోన
నఖిలార్థిబృందజిహ్వారంగములలోనఁ
గమనీయదానపట్టములలోన
ఘనవందిమాగధకైవారములలోన
సముల్లైన రాజచంద్రిములలోన

గీ. దశదిశలలోన సాధుసత్త్వములలోన
వినఁబడుచునుండె నీపేరె వీనులలర
శ్రీమహారాజ ! వైభవ శ్రీబిడౌజ !
రావుకులదీప ! శ్రీసూర్యరాయభూప !

సీ. పరమగురుధ్యానపరుఁడైన భక్తుని
పూజలో లోపంబు పొడమవచ్చు

కమనీయరసభావకలితుఁడైన సత్కవి
పదములోఁ బొరపాటు గదియవచ్చు
గురుతరానందముగ్ధుండైన గాయకు
గానంబులోఁ గళ గందవచ్చు
బరమవిశ్వాసభాసురుఁడైనసేవకు
సేవలోపలఁ దప్పు చేరవచ్చు
గీ. నట్లె నీప్రజలెల్ల నీ కాచరించు
నుచితసన్మానముల లోటులుండెనేని
హృదయ మెఱిఁగి మన్నించి గ్రహింపుమయ్య!
రమ్యగుణసాంద్ర! శ్రీమహారాజచంద్ర!
సీ. పరిణామసుందర ప్రకృతిరంగంబున
మూలకారణుదివ్యలీలఁ జూచి
ప్రణయసౌరభనవప్రసవపీఠంబున
సర్వేశ్వరునిపదచ్ఛాయఁ జూచి
యానందనవచంద్రికాంతరాళంబున
శ్యామసుందరుని తేజంబుఁ జూచి
నవసుధారసమయనామగానంబున
మోహనాంగునిభవ్యమూర్తిఁ జూచి
గీ. యలరి భక్తులు తన్మయులైనయట్లు
సకలజనరంజకుండైన స్వామి నిను...

గాంచి నీప్రజ లానంద కలితు లైరి
రమ్యగుణసాంద్ర ! శ్రీమహారాజచంద్ర !
రావుసూర్యరాయ రాజచంద్రునకును
జయము మంగళంబు జయము శుభము
చిన్నమాంబికకును గన్నబిడ్డలకును
జయము మంగళంబు జయము శుభము.

క. శుభమగు సూర్యప్రభునకు
శుభమగుఁ జిన్నాంబికకును శుభసంతతికిన్
శుభమగు నఖిలప్రజలకు
శుభమగుఁ బీఠపుర రాజ్య శుభపదమునకున్.

ద్వితీయభాగము సంపూర్ణము.



శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల, పిఠాపురము.

# FOREWORD.

Wh[illegible] the famous Venkata Parvateesvara Kavulu [illegible] a foreword to these poems, I had to consent [illegible] with some reluctance, as I felt that the task o[illegible] fallen into worthier hands. The present [illegible] Telugu literary world may fitly [illegible] called the [illegible] Venkata Parvateesvara Kavalu for to them [illegible] Telugu novel owes its present day perfection [illegible] poetry is by them made to run [illegible] ways of thought that it had never reached before. Theirs [illegible] an epoch in the history of Telugu literature that can [illegible] forgotten. Within a space of fifteen years, these great poets produced more than a hundred volumes in Telugu, and nearly a lakh of thier books are now in circulation in the Telugu country eagerly sought out, read and enjoyed. And one should [illegible] nervous to write a [illegible] word to the writings [illegible] authors.

Venkata Parvateesvara Kavalu are poets by nature, that had to take to prose writing because of the great need for it in the Telugu language. Much of their prose, however, is really poetry, for, as a great writer had [illegible] there is more poetry in what is

really prosaic, and there is much prose, which is markedly poetical. In an age like the present, when a new culture has opened up its treasures before us, it is impossible to resist its influence on human thought and activity, and the new age of Renaissance that began with my great Guru, Rao Bahadur K Veeresalingam Pantulu, received its present day perfection alike in prose as in poetry in the voluminous productions of these ourpoets. There was a time when Sanskrit exerted its influence on our language, and the venerable roll of poets from Nannaya onwards has bequeathed to us a glorious literature which echoes the genius of our language and of our ancient race, through the ideals that Sanskrit had presented to us. But oriental culture had its limitations, and would not outgrow its conventions. A stage of progress has thus been reached in the history of our language, beyond which it would not develop, and the Telugu poetry of our later period thus became purely conventional, and had no new phases and walks of thought to exhibit. The life of our nation as of our literature soon became dull and monotonous and it was therefore necessary to put new force into it, if only to arrest old age and decay. Such are the epochs in history, when great heroes are born, but in Telugu literature, it was to a new culture, the culture of the west, that the fresh life has been due. The march from the oriental into the

western lines of thought is a march from the marked artificialities of the east into the real and the natural. Here, we no longer indulge in the pompous hyperboles and in the highly artificial *utprekshas*, but look into life as it is truly lived, and into nature as it really presents itself to us. And it is this culture,—completely *Indianised*—that in the two Volumes now before us our authors have attempted to delineate. Kavya Kusumavali has thus the glory of being the first production, of any considerable length, in the Telugu language, that exhibits this harmonised culture, in poetry.

And what is western poetry? It is as Mathew Arnold tells us a criticism of life, under the conditions fixed for such a criticism by the laws of poetic truth and poetic beauty. A book in poetry is not merely a rhymed treatise intended to impart knowledge; it must yield æsthetic satisfaction.It involves the intellectual, the emotional and the imaginative elements, as also the technical element called style. As Carlyle puts it, style is not the coat of a writer, but his skin and as Hudson has it, sincerity is the foundation principle of all true style. Style is the real essence of the author's personality and cannot be produced by artificial means. It is an echo of the life and feeling of the writer. Poetry is thus a fine art intended to yield

æsthetic pleasure and involves the intellectual elements of precision, lucidity and propriety, the emotional elements of force, energy, and suggestiveness, and the æsthetic elements of music, grace, beauty and charm. As an English writer puts it "it is the one characteristic of poetry then, that whatever it touches in life, it relates to our feelings and passions, while at the same time, by the exercise of imaginative power it both transfigures existing realities and gives to airy nothing a local habitation and a name." Fidelity to nature, not perversion of it in the name of a figure of speech, is one of the main essentials of poetry. It is a purely subjective process of dealing with nature; it is not misrepresentation or distortion of it; not pathetic fallacy, as Ruskin puts it; nor sympathetic illusion, as Holmes expresses it.

"The objects of the poet's thought are everywhere," says Wordsworth, but the emotionalisation of them constitutes his true genius. He has the 'vision and the faculty divine,' by which he leads you through sensuous beauties to their spiritual meanings. The poet shows us and makes us know, what in real nature we so often see and yet know not. Nature is called into service in poetry for a variety of reasons. It may be for the simple delight of it, or for the sensuous love of its beauty. It is used metaphorically as a source of imagery and for illustration. It may serve as a background to emotion or action or to revive our thoughts

of an event through association. It may on the contrary be set against man's life and his littleness and imperfection. The indifference of nature to life, its sympathy and fellowship and the boundless spiritual meanings, that it suggests are likewise used by the poet in his feelings, emotions, and thoughts, and these constitute the subjective element of such poetry.

These in brief are some of the characteristics of western poetry. Though Indian poetry is considered to be highly artificial, it cannot be said that the natural is unknown to it. The purely artificial can never make poetry. Poetry is enjoyed in so far it is in tune with nature; not where it is unnatural and entirely out of touch with human mentality. No poetry can live that is divorced from nature. And some of our Telugu Poets like Nannechoda, Tikkana, Nachana Somanatha Kavi, Pingali Surana, Potana and others have more of this power of depicting nature and of rousing our minds than some others. If the glories of western culture are seen so richly depicted in the poems of these poets, one naturally wonders, how they that have not much English education were capable of enriching our literature so vastly. The truth is that the natural in Telugu poetry appealed to them more than the artificial, and some of the best productions of English poetry seen by them in original

or in their translation, or brought to their knowledge by conversations with English-knowing men so awakened their natural feelings, as to choose for them their future career. It was so early as 1904, long before the name of Sir Rabindranath was known that some of their earlier poems were published. The thought of the natural developed gradually in them as time went on and we may perhaps note its regular development in these poems in the Saguna form of prayer that begins the first volume and in the strikingly natural poetry that the thanksgiving in the second volume presents. By the time the poetry of Rabindranath began to show its influences in the Telugu country, our authors had gained a distinct individuality of their own, as the study of these poems in their chronological order amply indicates, and the new ebullition of poetic thought of the type of Rabindranath, now seen in the Telugu press, is only of a later date still in its infancy.

What then is the source of this enrapturing poetry of these authors? Why are we led to think that we are reading a Gray, a Thompson, a Wordsworth, or a Keats, when we are reading some of these poems? How have our authors been able to depict the glories of western thought, though they are not themselves masters of the English language? The answer is easy to find. Their poetry is the harmonious blending

of the east with the west;—not that the west is imported wholesale into the east, but that the ideals of the west have been taken to be goal of all natural poetry. A poet is one that feels and says, not he who merely conveys ideas. Of a natural bent of mind, our poets lived and moved and had their being in the natural in Telugu poetry, and by constant thought, and application, by true love and feeling, by life itself with all the currents of its activity, they became the bards of nature and the enjoyers in their souls of a heaven that is the *own* of a poet of nature. If the west gave them the ideals, the east gave them the life their own, and eastern life on the most natural ideals of western poetry is the achievement of their inner experience. Thus have the east and the west harmonised themselves in the inner souls of these famous poets, and the poetry that we see in these volumes is the ebullition of this heavenly harmony that has opened up a new culture for the Andhras.

The passion roused by such life and experience has with these poets grown into a religion. Their *Bhaktaseva* not included in these volumes is the most glorious production of the age that through nature spiritualises, and places us before the feet of God, in a heaven that these poets have given to man on earth. This spiritual aspect of natural poetry is not a mere borrowing, but real life, actually felt, and if

nature is uniform, the highest that it can give us whether in Europe or in India cannot but be the same.

The poetry of Venkata Parvateesvara Kavulu is thus the natural poetry of the east and the west, in its best Indianised form. The eastern ideal has here gone a step farther towards the spiritual, while the western ideal has been felt even as an Indian poet can feel it in his most natural Indian way, so as to reach the end that the west has set for it.

With these remarks, I commend these poems to the public and if the reader has seen in them the essential features of western culture as are indicated in these lines, I have no hesitation in saying that a new age has dawned for poetry in the Andhra, *viz.*, the age of Venkata Paravateesvara Kavulu.

T. RAJAGOPALA RAO,